


# శాంతి వచనములు.

రాజా భుజంగరాయ కవి విరచితము.

చ. అవనిని గష్టములఁ గనని యాత్మ్యులఁ గానము గా, నా[illegible]

త్సవములఁ దుల్యా[illegible] నేడుఁ [illegible] లపోసి గావిం[illegible] శాం

తివచనముల్ రచించితి సుధా[illegible]! [illegible], [illegible]

దవును, ప్రపంచ[illegible] [illegible] ఘటించి గట [illegible]. 1

శా. సారములేదోకింతయును సంస్కృతియందని పండితుల్ హితం
బార వచింప నేమిటికి వందురె చెప్పనిసొత్తు మిత్రమా!
యారయఁ బంచభూతమయ మజ్ఞ మచేతన, మాస్త్రియెంగునుం
జేరకనిండి, సత్యమయి, చిన్మయరూపముఁ దాల్చియుండెమున్. 2

ఆ. జనన మరణ దుఃఖ మనుభవింపదు, సూర్యుఁ
డెల్లవారి దృష్టి నిముడి దాని
వికృతినొందఁ డట్లు వివిధ భూతములలో
నుండి వానిదుఃఖ మొందదాత్మ. 3

చ. మలినపుముద్ద, దేహ మతిమాత్ర [illegible], బొక్కిహీనమై
జ్వలనునిపాలొ? నక్కల వశంబొ! యగుంగద! యట్టులయ్యునుం
గలతవహింపఁగా నెఱుక గానని దేహము నాశమొంద నా
కులత వహింప నేమిటికిఁ గుందఁగ నేటికి ప్రాణమిత్రమా! 4

ఆ. పొలఁతిగాదు, కొదుపురుషుఁడు, షండుఁడుఁ
గాఁడు, మేనులేక కలయఁజూచు
సాక్షి యాత్మయనఁగ సర్వంబునకు లోన
వెలిని నిండియుండు విభుఁడు సుమ్ము. 5

ఉ. చక్కనికోమలాంగి యనఁజాలిన బాల మలంపుముద్దయున్,
నిక్కపుమొద్దు, మూర్కొనఁగ నేరదు, పల్కదు, చూడ, దెద్దియుం
త్వక్కును మేను నేర్పరచి దానిమదిం దలపోసి చూడుమా!
మక్కువఁబ్రాణతుల్యయగు మానిని హేయపదంబు నీకగున్. 6

గీ. భూతములయందు జనియించు భౌతికంబు
లందుఁ బ్రాచీనుఁడగు నాత్మ యమరునిండి,
మగఁడెవఁడు ? మగువయెవ్వతె ? యగునో యందు
నెల్లవారలు సోదర్య మెంచిచూడ. 7

ఉ. గేహములయందు నాశనము గీల్కొనియుండియు వానిఁగాల్ప నా
వ్యోమ మొకింతయుం జెడుగునొందని కైవడి నాత్మ, మేనులం
బ్రాకుచు నిండియుండియును, వాని కుపద్రవ మయ్యెనేని యుక్
రాముఁడొకింత తాఁజెడఁ డనంతుఁ, డనంగుఁడు నౌట నిచ్చలున్. 8

ఉ. కొట్టితినంచు, నన్నొరులు గొట్టిరటంచుఁ దలంచు నిర్వురుం
గుట్టు నెఱుంగ రివ్విభుఁడు కొట్టఁడు కొట్టఁబడండు గాననీ
విట్టి విషాద మొందఁ గత మేమి ? సుఖించుము, శోక మింకఁబో
పట్టు, స్వరూపచింతన విధానముచే నిరతంబు మిత్రమా ! 9

చ. మఱిమఱి చింతయేల ? శివమాయ యెఱుంగఁగ రాదు, దానిచేఁ
జగమునందు లోకము, లుపాధి యహంకృతి గాన దానికిం
జగ మెడు కర్తృతాదులకుఁ బాత్రతఁ గాంచుచు నేసుఖించితిం,
దురపిలుచుంటి నంచుఁ గడుఁదొట్రిలు జీవుఁడు తెల్విలేమిచేన్. 10

క. మాయ యనంగను బ్రకృతియొ,
మాయావి మహేశ్వరుండు, మఱి తత్ప్రతిబిం
బాయత రూపంబులనే
నీ యెల్లజగంబు నిండె, నిది యెఱుఁగు మొదన్. 11

క. బోధాత్మము, త్రైకాల్యా
బాధితమును, దేశ కాల వస్తు పరిచ్ఛే
దాధారము, గానిది; విభు
తాధర్మము గల్గునాత్మ తా నీశుఁడగున్. 12

ఆ. వానియంశమైన ప్రతిబింబమె యుపాధి
హృదయములను జొచ్చి యేకమయ్యు
బహు విధముల జీవభావ మొందుచుఁదోఁచు
నీటి చంద్రుబోలె నిలుపులేక. 13

మ. తనువే వ్యర్థము, దానిలోన నలసద్వ్యాపార సంలగ్నమై
వనటంజెందు; సతీధనాదు లటుపై వ్యామోహముం గూర్చుఁ; దీ
రని సాంసారిక కృత్యసాధనలపై రాగంబు పెంపొంద, జీ
వనదుఃఖంబులఁగూలు జీవుఁడనుచున్ భావింపఁగా నొప్పెడున్. 14

ఉ. ఈశ్వరుఁ డైంద్రజాలికుఁడు; నీపరిదృశ్య చరాచరాత్మమౌ
విశ్వమె యింద్రజాలము, వివేకముమాని తదేకరక్తితో
శాశ్వతమంచుఁ బ్రేముడి నెసంగుటయే కనికట్టు; సర్వమున్
నశ్వరమంచు నెంచుచు మనంబుఁ దగుల్పమియే ప్రబోధమౌ. 15

ఉ. భూరుహమే జగంబు, దలపోయఁగ దాని విశాలశాఖలం
జేరు ఖగంబులే నరులు, చేరి సుఖంబుగఁ గొంతపట్టు సం
సారము నిర్వహించి, మఱి సారవిహీనత లేచిపోవు; నీ
తీరున శాంతిఁజెంది విరతింగనఁబోలదు మానవుండిలన్. 16

చ. సలిలనిధి ప్రవాహమున సంగముఁజెందిన మ్రాకులట్టు లీ
కలుష భవాంబురాశిఁబడి కర్మవశంబునఁ గూడి క్రమ్మరం
బలఁగుచు నుండుఁ దల్లియును దండ్రియుఁ బుత్రిక పుత్రుఁడన్న చం
చలతర బంధుభావముల సంగవియోగము లిట్టివే యగున్. 17

చ. భువనములందు లక్షలుగ భూతము లెల్లను బుట్టి కొన్ని నా
ళ్ళవని బ్రవృద్ధిఁజెంది, విలయంబును బొందుట నైజకర్మ, సం
భవముగఁగాదె! యా హరి శివ ద్రుహిణాదులకైనఁ గాలక
ర్మవశత తప్పునే! జనిస్థిరంబగునే తలపోసి చూచినన్. 18

చ. జలమున బుద్బుదంబు లనిశంబును బుట్టి క్షణంబులోపలన్
విలయముఁజెందు, నిందుఁ బ్రభవించునదేది? నశించు నేది? భూ
తలమున జీవకోటుల విధంబులు నిట్టివె: దైవమాయ లీ
కలుములు లేములుం; బ్రళయ కారణమంచన నొప్పు మిత్రమా ! 19

ఉ. వచ్చినవారివెంటఁ జనఁజాలరు బంధువు లెంతయాప్తులై
వచ్చిన, జీవయాత్ర తరుణంబునఁ దప్పదు, బంధముక్తి కా
వచ్చును, దెంపు తెంపెయగు, స్వార్థ పరార్థములెల్లఁ బోవు ; నిం
కెచ్చటి ముచ్చ టచ్చటికె యేగునుగాదె ! సుహృన్మణీ! కనన్. 20

చ. మతముల నన్నిటిం గడు విమర్శన జేసినఁ బ్రాక్తన జీవసం
తతులకుఁ గష్టముల్ దొలఁచు తత్త్వము చిక్కదు, దైవ తత్త్వమే
గలియగ, నాస్తికంబగ, జగద్వ్యథ తప్పును, మృత్యు వెప్పుడో
పతనముసేయు, దానఁబరిపాటిగ సర్వము నాశనంబగున్. 21

గీ. జనన మేసృష్టి, మృతియె నాశనము జీవ
తతికి వ్యక్తిత్వముగ; సాముదాయికముగ
ఖేదమోదంబు లజ్ఞాన కీలకములు
విడువ నెవ్వనికైన వేర్వేఱుగ నిల. 27

గీ. ముందు వెన్కలుగా మృతినందఁగలరు
సకల జీవులు, దుఃఖ ప్రసక్తి యేది ?
రాకపోకలు క్షణభంగురములు గావె !
జీవులెవ్వరు ! శ్వాసలు దైవమునకు. 28

గీ. జనన మరణ ప్రసక్తి యసత్యమైనఁ
గష్టసుఖముల కంగ వైకల్య మొదవ్రఁ
దనువు చాలించువఱకు నీతముగఁ గాల
గతిని బుచ్చి పోవుటయె యోగ్యమగు సఖుఁడ ! 29

క. స్వాంతమునఁ జింత యెంతయు
నంతంబగుఁ బాంతె, నయ్యనంతు కరుణ నోం
శాంతి శ్శాంతి శ్శాంతి
శ్శాంతి యటనుమ విరమింతు శాంతి వచనముల్. 30

ELLORE,
1—1—39.

RAJAH M. BHUJANGA RAO.

# శ్రీ రాణీ చిన్నమ్మారావు
# జీవితము.

[illegible]

[illegible]




[illegible]

ఏలూరు,
రాజా మంత్రిప్రెగడ
భుజంగరావు బహద్దరు జమీందారు
ప్రణీతము.


1938.

# విషయసూచిక.

# నామచిత్రానుక్రమణిక.

M V Press
ELLORE

# పరిణామము.

మ. జగతిన్ దంపతులందఱుంబ్రణయ సత్సౌఖ్యంబులం దుల్యరీ
తిగఁ బొందంగల, రాత్మలేకమయినం దీఱుంగదా ద్వైధి; యెం
చఁగ నద్వైతము దంపతీగరిమచే సాధ్యంబగుం జిన్నమా!
భగవజ్జ్వాలల రేఁగు, నగ్నికణముల్ ప్రఖ్యాత జీవాత్మలున్. 1

గీ. సూర్యకాంతిపగల్ కడుశోభఁగూర్చి
రాత్రియస్తమించుట కాళ రాత్రియగును;
జిన్నమాంబకీర్తి యొ యవిచ్ఛిన్నముగను
ధర నహోరాత్రములు వెల్గుఁ దరతరములు. 2

ఆ. కష్టజనులకధిక కష్టముల్ గలిగించు,
నిండియుండువాని నింపుచుండు,
దురవగాహములగు పరమాత్మ చర్యలు
సాగరంబునదుల సమితిఁ బోలె. 3

గీ అవని మార్తాండుఁ డస్తమయంబునొది
తిరుగ నుదయించు నమిత సాగరముదాఁటి;
చిన్నమయొ భువినస్తమించి దివివెలసె
నుభయ తారక మయ్యె నభ్యుదయముగను. 4

గీ. బాల్యయౌవన కౌమార వార్ధకములఁ
దనువు వృద్ధిక్షయంబులఁ గను తెఱంగుఁ
జిత్రపట వీక్షణము బోధసేయుఁ, బిదపఁ
గావ్య పఠనంబునను గుణగ్రహణమగును. 5



క. ధర చలపతిరావను మ
త్పరమాప్తుని దైన మంజువాణీ ముద్రా
క్షర శాల యందు హేలా
పురమున నీపుస్తకంబు ముద్రితమయ్యెన్.

---



శ్రీరాణి చిన్నమ్మారావు.

40 ఏండ్ల వయస్సు.

# FORE-WORD.

—:o:—

ACROSS the ward from the Dispensary stands the Rani Chinnamma Rao's Choultry or Inn. This was first built in 1906 and then accomodated 15 families. In 1913 and 1914 it was enlarged to provide lodging for 25 families. This building was given by M.R.Ry Rajah. M. Bhujanga Row Bahadur, and is worth about Rs. 20,000. The land was the gift of Mallella family.

It was in 1905 that the Brahmin Zamindar, M.R.Ry. Rajah. M. Bhujanga Rao, known among us as the Ellore Rajah, first came into touch with the Medical work in Guntur. A Sanscrit scholar and a Telugu poet, he was at that time a devout worshipper of Siva. The serious illness of his wife caused him to come to Guntur and the difficulties experienced by him in securing accomodation for his large retinue of relatives and attendants has much to do with the building of the Satrum.

The Rajah says his real interest in the Christian religion is due to his association with those in the Hospital, when often for hours every day he sat by the side of his sick wife in the Rani's room of the Children's Ward, or slept on the Varandah of the Despensary, when the life of a little daughter was hanging in the balance. No one has had a better opportunity of observing the methods of a Mission Hospital, for to him and his family the gates have always been open. The Privilege has never been abused.

Soon after the death of his first-born and only son died of fever in Ellore in 1913, he removed with his family to Guntur, and began the translation of the

Gospels, and of them he sold 9000. The work was continued until an edition of a thousand copies of the whole New Testament was brought out by him, and this is sold for less than cost. This translation represents ten years of work. His object is, in his own words, " to bring home to every Indian the Message of the Lord Jesus Christ in an acceptable form". Many expressions of appreciation of his labour of love have been received, including one from the King Emperor. The following is from a Hindu Editor," I was struck with the greatness of Jesus Christ sung in sweet and smooth poetry, when I read the Rajah's metrical version of the Gospels."

Nov., 12, 1927.
South Manchester,
Conecticut, U.S.A.

ANNA S. KUGLER, M.D., Sc. D.
Pioneer Founder,
Guntur Mission Hospital.

# TRIBUTES TO THE RANI.

o-

1. Resolutions passed by the United Luthern Church Mission Council, Oct. 1938.

" The news of the death of Sri Rani Chinnamma Row Garu of Ellore, the wife of Rajah. M. Bhujanga Row Bahadur has brought to the United Luthern Church Mission the consciousness of having lost a friend of the Mission and a benefactor to the Kugler Hospital in Guntur.

" The Rani and her husband the Rajah were personal friends of Dr. Anna Kugler who was for many years Physician in charge, and for whom the Hospital



కీ. శే. కుగ్లరు దొరసానిగారు,

అప్షమ్మ, రాజావారి మొదవ కుమార్తె.

was later named. As friends of Dr. Kugler and of the Hospital they were alert to the needs of the patients and gave generously of their substance to this cause for the relief of suffering humanity.

"Among their outstanding gifts to the Hospital are :—

1. The Sri Rani Chinnamma Row Garu Choultry or Inn.
2. A piece of land adjoining the Choultry which is leased, and the income of which is used for the Choultry.
3. A house and plot in Bezwada the rent of which is used for the support of the (hospital) Choultry.
4. A piece of land under cultivation near Velangapalli the proceeds of which are also used for the support of the (hospital) Choultry.

These very practical gifts may serve as fitting monuments to the memory of the Rani of Ellore, attesting as they do, to her close relation to and loving interest in the great work of the Kugler Hospital during many years in the life time of the Rani."

2. Mission to the Aristocracy of India.
Resolution dated 8-7-1938.

"We the members of the Mission to the Aristocracy of India deeply regret the demise of the late Sri Rani Chinnamma Row of Ellore and take this opportunity to place on record our appreciation of her sympathy for the Gospel of Christ."

3. Doctor Paru Miller.

A tribute from a Doctor who loved the Rani as her sister :—

" I have known Rajah. M. Bhujanga Row Bahadur and his wife Rani Chinnamma Row for many years. The serious illness of the Rani Garu caused him to come to Guntur in 1905 to see Doctor Kugler. Before the Rani and her children came to Guntur they knew very little of Christ, who is our Saviour. After their acquaintance with the Hospital, they began to read Telugu Bible daily. Although they did not become Christians they had daily prayers and were not ashamed when people saw them using their Bibles. Rani Garu is one of the most gentle women I have ever come across. She had a wonderful influence over her children, and they loved and respected her greatly. She was god-fearing and had great faith in prayers. She was a very kind-hearted and charitable person and helped many a poor and needy one in her quiet unassuming way."

4. Doctor G. Margon Happer, M.A., M.D.,

"Now there was at Joppa a certain disciple named Tabitha, which by interpretation is called Dorcas. This woman was full of good works and almsdeeds which she did.' Since the time of Dorcas many of her daughters have visited us and comforted us with their kind hands and quiet voices. Such a woman was Sri Rani Chinnamma Row Garu, who lived amongst us in the Andhra Country. When Dorcas died her friends gathered around her showing each other the things she had given them, and their voices when they spoke of her were full of love. That was their tribute to a great woman. There are those who speak to-day of the Rani in voices which too are full of love and appreciation.

5. A tribute from a hundred Indian villages.

" It looks like an old Inn a long rambling building

surrounding a courtyard on three sides. In this open court there are splashes of sunshine where the trees do not quite meet. A woman with a brass pot balanced on her slender shoulder moves to the centre of the space, where there is a great stone well. Soon after women and children and a few men have followed her, for the people of the Inn must have water for the on-coming evening. Some of the people are chattering loudly and laughing as people do when they feel the pleasant nearness of their neighbours about them. Some of them seem pre-occupied with their thoughts, and their hands move back and forth at their work in a sad purposeless way. A very little girl stands swinging small bare foot while she waits her turn for water.

This is Rani Chinnamma Row Garu Choultry or Inn, which has been built for the people who have come from villages near and far bringing with them sick people to be cared for in the Hospital just across the way."

6. Tribute from two women who loved the Rani as a dear friend.

"For almost thirty years Mrs. Doraiswami has been head-compounder at the Hospital. Mary Anne has been a Bible woman in the Hospital for thirty years. They say :—

"We have known Rani Chinnamma Row Garu for many years. We know her and her children at the time when there was great hatred against Christianity. The Rani came to the Hospital to begin with because of her sickness. She came from her native place Ellore, to Guntur, when Doctor Kugler's name was very popular in the Town. She did not like to give her hand to have her pulse felt or her tempera-

ture taken, as it would polute her hand. However she could not but oblige to give her hand, but she said she washed this hand several times as the untouchables touched it. She requested doctors not to mix water in her medicines as it would be a hindrance to her caste. When she became well acquainted with the doctors and nurses and Bible teachers in the Hospital she would listen very patiently to the Bible. She sent her children to learn the Sunday School lesson. These children used to take part in the Christmas conversations and songs during Christmas days. She had eight girls, most of whom were born in the Hospital. She had also a number of grand-children born there. She was always given the same separate room by the side of the X-ray room. Rajah Garu would attend the Sunday services at the Chapel. The Rani Garu was treated as the eldest daughter of Dr. Kugler and the sister of Dr. Paru. Rajah Garu constructed a choultry by the side of the Hospital in the name of his wife. At the time of her death the whole management of the choultry was given to the Superintendent of the Hospital. She and her children accepted Jesus Christ as their Saviour, but were not baptised. She walked amongst us. Perhaps some may say now that she has gone on to another land, for her death was recorded in the books of man, but she walks amongst us still, for her life is recorded in the books of one who breathed into every man the breath of life."

The Gospel Witness. November 1938.



శ్రీరాణీ చిన్నమ్మారావు
ఏండ్ల వయస్సు.



శ్రీరాజా భుజంగరావు
ఏండ్ల వయస్సు.

# కృతి సమర్పణము.

ఉ. హారము, పద్య గుచ్ఛ సుమ హారము, దుర్వ్యసనాది దుష్టసం
హారము, శారదావన విహారము, శబ్ద విశుద్ధమైన వ్యా
హారము, గ్రామ్యశబ్ద పరిహారము, మత్కృత కావ్యరాజమున్
హారముఁ, జిన్నమాంబ గళహారముగా సమకూర్చి యిచ్చితిన్. 1

ఉ. దామము, చంపకోత్పల సుధారస పూరిత పద్యకావ్య ము
ద్దామము, వృత్తసౌష్ఠవ కథామృత శబ్దసమృద్ధ సాహితీ
ధామము, హావభావ సముదంచిత సౌరభసూత్రి మల్లికా
దామము, చిన్నమాంబ గళదత్తముఁ జేసితి నాత్మశుద్ధిగన్. 2

ఉ. మాలను, జంప కోత్పల సుమప్రతిమాన సుపద్యరాజ సం
పాలిత పుష్పమాలను, నిమంత్రణ పూర్వక మంత్రపుష్ప స
జ్జాల సహస్రనామ సుమచర్చిత మాలను, జిన్నమాంబికా
ఫాలమునన్ ఘటింతు, సురవర్గ మహో సుమవృష్టి నింపఁగన్. 3

మ. ప్రతిపద్యంబున నిన్ను జేర్కొనెడు మర్యాద న్విలోకింప, నో
యతివా! పెండిలినాటి వైభవము లాహా! సంస్మరింపంబడెం;
బ్రతినిత్యంబు సహస్రనామముల నీ ప్రజ్ఞా విశేషంబు, లు
ద్ధతి నర్పించెద గ్రంధమాలమునఁ బ్రత్యక్షంబుగాఁ జిన్నమా! 4

గీ. ఐహి కాముష్మిక ప్రదమౌ మదీయ
కావ్య పఠనంబు నీదివ్య కాంతి వలన,
సేతు వగును లోకద్వయ శ్రేయమునకుఁ,
జిన్నమాదేవి! మత్కృతి స్వీకరింపు

# గీతములు.



చూతవృక్షము నలము ప్రసూన వల్లి
దా హరించియు వృక్ష గాత్రమున స్వీయ
చిహ్నముల నిల్పుపగిదిని జిన్నమాంబ
నిలిచె నాదేహయష్టిని నిశ్చలముగ. 1

వక్త్రమునఁ జేరి, రసము సర్వముఁ గ్రహించు
రసనపోలిక, నువిద భార్యగను నరున
కమరి చిన్నమ్మపగిది ధర్మార్థ కామ
మోక్షములఁ గూర్చు నైహికాముష్మికముగ. 2

ఇంద్రియ వ్యాప్తి నాత్మచేయించు రీతి
గృహిణి గృహకృత్యములను వర్తింపఁ జేయు;
స్వర్గమనుకూల దాంపత్య సంఘటనము,
కానిచో నరకమగు జగత్త్రయంబు. 3





# రాణీ చిన్నమ్మారావు జీవితము

-:ఉపక్రమము:-

శా. శ్రీకారాత్ముఁడు, భక్తులం దనుపకార్తిం గూర్చువాఁ డచ్ఛ స
ల్లోకారాధ్యుఁడు, స్థాణుఁ, డాశ్రితుల కార్తుల్ గూర్చి శోధించు వాఁ
డాకారంబునులేనివాఁడు, బరిశుద్ధాత్మ ప్రభుం డోముతన్
మాకాంతామణి చిన్నమాంబ విమలాత్మన్, దివ్యముక్తిం గనన్. 1

క. శ్రీరాజ్ఞీచిన్నాంబా
సారసదళనేత్రి సుగుణ సంపత్ఖని సం
సారేత్థ కృతి రచించెద
నారాఢిన్ దివ్యపదము నందిన దగుటన్. 2

మ. ధర రాజాబిరుదంబునంది, కవితాతత్త్వంబు సాధించి, శం
కరసంస్తుత్య భుజంగరాయ ఘన సన్నామంబున న్మించు, నా
కరయన్ సత్సహధర్మచారిణిగ నైక్యంబంది, చిన్నాంబ, యు
ర్వరఁ దా నర్థశతాబ్దమున్ గడిపి, సుస్వర్గామి యయ్యె న్వడిన్. 3

మ. కవివర్యుల్ తమ బంధుమిత్రజను లుత్కంఠాత్ములై స్వర్గతిన్
భవబంధంబుల వీడిపోవ, ననుకంపాయుత్తచిత్తంబులన్
భువిఁగావ్యంబులువ్రాసి నిల్పెదరు సంపూజ్యప్రచారిత్రలం,
గవినౌట న్స్వసతీచరిత్రము లసత్కావ్యంబుగాఁ గూర్చెదన్. 4

క. పదునెనిమిదివందల యెను
బది మూఁడవ భవ్య హూణ వత్సరమునఁ బెం
పొదవఁగ నొకటవ ఫిబ్రవ
రిఁ దగం జిన్నమ్మజని ధరిత్రిం గాంచెన్. 5

క. వర చిత్రభాను సంవ
త్సర పౌషా సిత సుపక్ష సన్నుత నవమిన్
గురువాసరమునఁ జిన్నమ
ధరణిని జన్మించి కీర్తి తత్పరయయ్యెన్. 6

గీ. వసుస దినచర్యగలుగు ప్రవర్తనము
సహజధోరణిఁగూర్చితిఁ జతురగతుల
నతిశయోక్తులఁ గల్పన లతుక లేవు;
సహజకథనమ్ము చిన్నమ్మ చరిత మిందు. 7

గీ. సతుల యోగ్యతఁ బతులు ప్రశంససేయఁ
దగదు జీవించియుండుసందర్భమునను;
గీర్తిశేషుల ప్రతిభ సంకీర్తనంబు
సేయఁ దగు నెవ్వరైనఁ బ్రసిద్ధమిదియు. 8

గీ. గ్రంథమునఁ దెల్పఁ బడు నభిప్రాయములను
దెలిసికొని, యట్లుజనులు వర్తించుకొఱకె,
గావ్యము రచింపవలయును శాస్త్రఫణితి,
నదిగదా! కడుఁ జాకచక్యంబు కవికి. 9

గీ. కరుణఁ బ్రకటించు తటి గాన కవిహృదయము
భావములఁ జను, కడలిపై నావ పగిది;
శబ్దజాలము నెంచ వశమగునొక్కొ ?
భావములయున్న కావ్యస్వభావమెన్న. 10

గీ. కావ్యరచనాపటిమ సమగ్రముగ నిచట
నవరసంబులఁ గరుణ ననర్గళముగ
నుబుకఁజేసితిని, గుణమూల్యాలు గణింపఁ,
చిన్నమాదేవి పేరు సుస్థిరముగాఁగ. 11

గీ. రస మనస్సరోవరమున రాజహంస
క్షీర నీరంబులను వేఱుచేయు పగిది
ధర రసజ్ఞు లీకావ్య తత్త్వము గణించి
రసముఁ గొని విడువఁ దగు నీరసము నవల. 12

ఉ. భావకవిత్వముల్ జను లపారముగాఁ గనఁగోర, మన్మనో
భావముల న్సుధా మధుర వాక్యముల న్వెదజల్లితిన్, సతీ
పావనమూర్తి నాత్మ నిడి భావనఁజేయుమఁ; దత్సుకావ్యమిం
పై వసుధన్ స్థిరంబుగ సమాదరణంబును గాంచుఁ గావుతన్. 13

మ. ప్రతి పద్యంబును భిన్నభావ రసపూర్ణంబై, స్వయంవ్యక్తమై
జతఁగాంక్షింపకయుండు, పాఠకులకున్ సౌలభ్యమీశక్తి; హృ
ద్గత భావంబుల వేఱువేఱుగను గ్రంథస్థంబుఁ గావించితిన్
సతియౌ చిన్నమదేవి సద్గుణవిశేషంబుల్ సమగ్రంబుగన్. 14

## —♦ ఫలశ్రుతి ♦—

ఉ. ఈకృతిలోని చిత్రముల నెంచిన మానవ జీవితంబెటుల్
జోకఁ బ్రవర్ధమానమయి సుప్రకాశించునో ? ద్యోతకంబగున్ ;
లౌకిక, పారలౌకిక ఫలంబుల స్వానుభవంబుఁగూర్చు, స్వ
ర్లోక నివాస సౌఖ్య నిజరూపము రూఢముసేయుఁ జిన్నమా ! 15

గీ. చిన్నతనమున సుబ్బప్పయన్న పేరు
కలదు; చిన్నమ్మయను సార్థకమగుపేరు
యౌవనారంభముననుండి యమరి, రూఢ
మయ్యె, సుప్రసిద్ధముగ జనాళియందు. 16





శ్రీరాణి పిన్నమ్మారావు,

౫ ఏండ్ల వయసు



# 1. సతీస్మృతి.



ఉ. మంచముబట్టియున్నతఱి మాటలఁ జెప్పెడువేళ, నీకడం
గొంచెము ముచ్చటించెదను, కుక్షిగతంబగు వ్యాధి రేఁగి బా
ధించెడుపట్ల మూర్ఛిన, హృదిం బెనుబాడ యొకంపువడ్డ య
ల్లించెను నామజీవితము నేలతలంపవు? చిన్నమాంబకో! 17

ఉ. భోజనభాజనంబులను, బుత్తడిపీటల, వెండిచెంబులన్,
భోజన వస్తుజాలములఁ బోడిమిఁ గూర్చెడువారు పెక్కు రే
యోజఁ జరించుచున్న, వినయోదధివై యెవరి నాప్రియంబో? ని
ర్వ్యాజ నయాంతరంగమున నద్దియె కూర్చిహితంబుసేయు నీ
సాజపు మైత్రివీడి దివిషద్గతిఁ జెందుట ధర్మమే? సతీ! 18

ఉ. అన్నెముఁ బున్నెము న్దెలియనట్టి సుతావళి, బంధువర్గముం,
దిన్ననిరాజ్యముం, బ్రజను, దేవ గురు ద్విజ పూజనంబు, నీ
యున్నతసౌధరాజము నయో! నిరసించినఁ జెల్లుఁగాని, యో
యన్నులమిన్న! నన్ను విడనాడఁగఁ జెల్లునె! యెన్నఁడేనియున్. 19

చ. గృహమున నేదెసం గని భరింపఁగనోపుదుదేవిఁ గాంచ దు
స్సహమగు నీవులేనిదెస, సభ్యత వీగి కళావిహీనమై
తహతహఁగూర్చు; తీవ్రపరితాపము హృద్గతమై మథించుఁ, బ్రి
త్యహమును, జిన్నమా! బ్రతుకు నంతయు మార్చితివీవుమాయమై. 20

ఉ. చిన్నమలేనిరాజ్యమును, జిన్నమలేనిమహోపభోగముల్,
చిన్నమలేని భాగ్యములుఁ జిన్నమలేని విశాలసంతతుల్,

చిన్నమలేనిసౌధములుఁ, జిన్నమలేనివరావరోధముల్,
చిన్నమయేని సంతసముఁ జెందఁగ జేయునె? నన్ను జీవికన్. 21

చ. అణువుగ షష్టిపూర్తిని రయంబున నింపితి నీకటాక్ష వీ
క్షణముల రక్షణన్ క్షణముగా; నిపుడంతయుఁ దారుమారయై
క్షణము యుగంబుగా జరుగసాగెను జిన్నమ! నీవులేని కా
రణమున, నాహృదంతరసురాగము, భోగముఁ దీరునెట్లొకో? 22

ఉ. ఆదృతిలేనిజీవము దవానలకీలల దహ్యమానమై
మేదుర దుఃఖభారమున మేదినిఁగ్రుగ్గి నశించు, జిన్నమాం
బా దరహాస చంద్రికల ప్రాప్తి నశించుట నాదుజన్మలో
నాదశకష్టిఁగాదె! మరణాంతము నిట్లు తపింతు నింతిరో! 23

చ. తరుణవయస్సునన్ హృదయతాపము నోర్వఁగనోపు, వృద్ధతే
తరుణమునన్ సతుల్ సురపథంబునఁ బోవఁగ నోర్వఁజాలరో
తరుణిరో! చిన్నమా! నను వ్యథం దగిలించి చనన్ ఘనంబె? నా
మరణముఁగూడఁ గూర్పనది మంగళమౌఁగద! నీకు నాకునున్. 24

ఉ. సీమకుఁ బోయివత్తునని చెప్ప ననుంగొనిపొండు వెంట, సా
ధ్వీమణి భర్తతోఁ జనుట దివ్యమటంటి వొకప్డు చిన్నమా!
క్షేమమె భర్తవీడి దివిఁజేరుట నీకుఁ బతివ్రతాప్రభా
వామితశక్తి నన్నును రయంబునఁ దోడ్కొని పోవఁగూడదే! 25

ఉ. కీర్తినిబూర్తిచేసి పరికింపఁగ స్వర్గపురంబుఁ జేరినన్
భర్తృవియోగదుఃఖము దివంబున భోజ్యము గాకపోవునే?
యార్తిని గూర్చి భర్త కిట, నచ్చట సౌఖ్యము నందనేర్తువే?
ధూర్తుఁడనంచు నెంచకుము దుఃఖముచేఁ బ్రవచించితి న్సతీ! 26

సీ. కడలేని దుఃఖసాగరవీచికల మ్రింగఁ
గన్నీటిధారలు కారుచుండ

నెనలేని చాంచల్య హృదయంబు స్తంభింపఁ
గాలుసేతులు వడఁకం దొడంగ
మితిలేని కూర్మిసంతతి గోడు నుడుపంగ
నాల్క వెంగలి వచనములు వల్కఁ
గనలేని పౌరుషంబును నాత్మ నెలకొల్ప
నబలాత్వ మట్టె వెన్నాడుచుండ

గీ. నేఁకిం దెలియనివానిగా రచించి,
దుఃఖమునముంచి, చాంచల్యదోషము నిడి
వెఱ్ఱివానిగ నొనరించి, పిరికితనము
నొసఁగి యాడించితివికదే! యోప్రియంబ! 27

గీ. అన్నమునకుఁ బ్రతిగ నాకులైన దొరకు,
నాకులకు మాఱుగా జలమైన దొరకు,
జలమునకు నీసుగాఁగ ననిలము దొరకు,
దొరకునే? నీకు సాటిగ దొడ్డరాణి. 28

ఉ. చిన్నమదేవి! నీయుదరసీమ వ్రణంబుజనించె నన్న నాఁ
డెన్నఁగరానివేదన జనించెను నాహృదయంబునందు, బా
ధోన్నతి నిన్నుజట్టఁగ భయోన్నతి నన్నునుజుట్టెఁ; గాల మా
సన్నత నీకుఁగాఁగ నలసత్ఖలకాలము నాకుఁజేకురెన్. 29

చ. మరువని మల్లికార్జున కుమారుని దుఃఖములో సగంబు, న
ల్లుర పెనుచింతసాము, సుతలుం, బితలున్, హితులుం గడుం బరం
పరఁ గలిగించునార్తి సగబాలును, నింతకుఁ బంచికొంటి, వె
వ్వరునను బంచి యిమ్మనుచు వచ్చెదు వారికిఁ జిన్నమాంబరో! 30

ఉ. ఏనుగతింతు నన్నపు డహీనమతిం గడుధైర్యవాక్యముల్
మానుగ నుచ్చరించుచుఁ గ్రమంబుగ నెల్లరియొద్దఁ బుత్త్రికల్

దీనతఁ గుందునప్పుడును ధీరతఁబల్కి శమింపజేసి, యీ
పైనను జూచుకొమ్మనుట పాడియె? చిన్నమదేవి! వృద్ధుఁడన్. 31

ఉ. పూతచరిత్రవై దివిజపుంగవ పూజల రేఁబవళ్ళు వి
ఖ్యాతిని నీవొనర్చునెడ, నయ్యయొ! చాల యపూతవృత్తి నా
చేత నొనర్పఁబోలు, నటుసేయకయుండిన నాకు నీగతిన్
ధాతవిధించియుండునె? ఘనంబగుశిక్షను జిన్నమాంబరో! 32

ఉ. ఈ వొనరించు సత్క్రతుల కేను విఘాతము నెన్నఁడేని ని
చ్ఛావిధిఁ జేసినాఁడనె? పవిత్రసత్కృతుల్ నను జేయుచున్న నీ
త్రోవనె సంచరించితి, నెఱుంగుదు రీవును దేవుఁడున్, స్మరో
భావములొక్కఁడే మనకుఁ బ్రాణములొక్కఁడె చిన్నమాంబరో! 33

ఉ. ఆఁకలిదీరె, సర్వమున నాశలుఁదీరెను, నీకునాకు, స్వ
ర్లోకనివాసము న్సలుప లోకము వీడినదాఁకవౌట; భూ
లోకమునందు నిర్వహుచు లోపమునన్; సుమనీషి నేని నా
నాకము నిన్నుఁగూడియె చనం దలపోయుచుఁగాదె! యుగ్మలీ! 34

ఉ. నాకనుదోయి నీను నటన న్నినుగంటకు వేనవేలుగా
శోకసుగాఁగఁ జూపఁ దెరఁబోలిన నావిమలాంతరంగముం
దాకొని కన్నుమూయఁగఁ గనంబడు టబ్రముగాదు; విచ్చినన్
నీకళలెల్లఁ జిత్రసరణిం గనుపించును జిన్నమాంబరో! 35

మ. ఉపచారంబుల సర్వకాలములనో హా! నీవుగావింతు, వీ
విపుడస్తంగతవౌట నింకెవరు! దేవీ! నన్నుబోషింప, నీ
విపులన్; వృద్ధుఁడ, లేవలేని స్థితిలో వీడ్కొంటివో చిన్నమా!
వపువు న్వీడి భవత్సకాశముఁగనన్ భవ్యంబు నాకిప్పుడున్. 36

ఉ. ఎందఱు బంధు మిత్రతతు, లేర్చిన సేవకు, లాత్మజాత, లిం
పొందగ సేవఁజేసినను నొప్పునె నీమృదుపోషణంబుకో?

మానుచుండు, దేహమునఁ బ్రాణములుండెడు నంతకాలమౌ
నందిని! చిన్నమా! విభు మనంబున నాటినకాంతవౌట వేన. 37

చ. సతు లనురక్తలైన పురుషప్రవరుల్ కడుధన్యు, లట్టి వా
పతులము, చిన్నమా! పరమపావనమూర్తివి, భర్త నిష్ఠ సా
వ్రతముగ వీడి స్వర్గమును రక్తిని జెందితి వద్ది న్యాయమే ?
హితమతి నన్ను వెంటఁగొని యేఁగిన ధన్యులమై తరింపమే ! 38

గీ. అనయముగ్రస్తమై దేహ మలసియుండ,
వరసతీవియోగమ్మునఁ బరితపింపఁ
మిత్తిదయసోక లేదు నామీఁద, నాకు
నిన్ను జేరుటయేమేలు చిన్నమాంబ! 39

గీ. ఆత్మహత్యను ఘాతకమండ్రు బుధులు
దేహపాతము దనుక నేతీరు జరుగుఁ?
జిత్త మున్మాదదశఁ జెందు టుత్తమను నది
దైవఘటనను జేకూరఁ దగును రాణి! 40

గీ. అద్వితీయ ద్వితీయవై యలరినట్టి
నిన్ను స్వర్గమునందున్న నిలయమునను
నున్నఁ గాంచుచు, నిన్నె నే నెన్నికొనుచుఁ
జింతలను బాపికొందు నోచిన్నమాంబ! 41



# 2. ప్రణయ విలాపము.

-:o:-

ఆ.వె. చుంబకాశ్మమందు సూదియంటినరీతి
మానసంబు నీసమక్షమందు
నిలిచెఁ, జిన్నమాంబ! నిశ్చలంబయ్యెను
మరల దైహికమున మసలదింకను. 1

గీ. నిలిచినను, మేలుకొన్నను, నిద్రఁగొన్నఁ,
గూరుచుండిన, నడచినఁ, బాఱుచున్న,
ఛాయపగిదిని నీస్మృతి బాయ దెపుడు
నన్ను జన్మాంతము వఱకుఁ జిన్నమాంబ! 2

ఉ. చిన్నతనంబునుండి మృదుసేవల సన్నెద నాశ్రయించి, వి
చ్ఛిన్నముగాని భావముల శ్రేయముఁగూర్చిన నీకు సౌహృదం
బెన్నక మృత్యువక్త్రమున కేను సమర్పణ మాచరించితిం,
జిన్నమదేవిఁ బోవిడిచి చింతలఁజిక్కితి, నేమిసేయుదున్. 3

గీ. ప్రాణములు మేననిల్చి మర్మములఁ గలఁచి
దుర్వహములౌచు వేధించు సర్వగతులఁ;
ద్యాజ్యములుగావు కర్మాలయంబులగుటఁ;
గరుణమూర్తివి, చిన్నాంబ! దరికిఁగొనుము. 4

ఉ. పిన్నటనాటనుండి కృపఁబెంచిన సౌహృద సాహచర్య సం
పన్నత, మానసోల్లసన భావ సరాగ విశాల సార, మ
త్యున్నత చిత్తరంగ సమయోచిత సూచక వీక్షణంబులన్
గ్రొన్నన సంస్మరింపఁబడి గాథ మనోవ్యథఁగూర్చెడి న్సతీ! 5



శ్రీ రాణి చిన్నమ్మారావు 18 పండ్ల వయస్సు.

మల్లికార్జున కుమారుఁడు.

ఉ. భావమునం దలంచెద శుభాంగిరో ! నీ సరసానులాప సం
భావిత సత్కథామృత శుభప్రద గాథల నెల్లవేళలన్ ;
భావనజేసెదన్ లలిత వర్తన నర్తప కీర్తనంబులన్,
దైవము హృద్గతానుభవ తత్త్వము మావను చిన్నమాంబకో ! 6

చ. ఇదిగృహలక్ష్మి, శ్రోత్రములకింపుగఁబల్కును, గన్నుదోయికిన్
ముదము ఘటించు, రాగమున ముంచు గుణప్రకరంబునన్ ; సుఖ
ప్రదమగు చిన్నమాంబిక కరగ్రహణాంబు, మనోహరాంగునన్
సదమలగాత్రి సన్నిధి పోసంగను నాకిఁక జీవితంబునన్. 7

గీ. వీనులను నీవు వాణివై వెలసినావు,
నేత్రముల నీవు పాపవై నిలిచినావు,
హృదయమున నీవు రాణివై యెసఁగినావు,
చిన్నమా ! నిన్ను విస్మృతిఁ జెందు టెట్లు ? 8

గీ. పంకజాతాక్షి ! భవదీయ భాషణములు,
కృష్ణ కర్ణామృతములు, సంతృప్తిదములు,
మానసోల్లాస కరములు, మానితములు,
మరపునకురావు, చిన్నమా ! పరిమళములు. 9

గీ. పరిణయంబాదిగా నీవు బాల్యమందు,
యౌవనమునందు, వార్ధకమందు, నింపుఁ
బొందుపరచిన సంప దానందములను
మరువ నేరను, జిన్నమా ! సుర తరుపువు. 10

గీ. నీవు నాహృదంతరమున నిండియుంను
కతనఁదావులే దితర సంగతుల కెందు,
ఘనతరేకాగ్రచిత్త భాగ్యమును గంటిఁ
దన్మయత్వంబుఁగాంచితి ధరణి దేవి ! 11

గీ. ననుచు ననురాగ సమ్మేళనంబు వలన
హృదయమున శోకసంక్షోభ మొదవువేళ
నెచటఁజూచిన నీమూ ర్తియే యగపడు,
ముదిత ! నాతోడ దాగుడుమూత లేల ? 12

గీ. సూర్యుఁడ స్తమింప జలజ శోభ దొరఁగు
జంద్రికాంతము కరుగదు శశి శమింప,
నటులె చిన్నమాదేవి లేనట్టి జగము
నాకు శూన్యమైనదని యనఁదగుఁగాదె ! 13

చ. ప్రియసతిఁబాసి జీవితము గ్రీష్మమున న్విరివోలె వాడె, ని
ర్దయఁబ్రకటించె దైవము, యథార్థము; పాపము శాంతిఁబొందుతన్ ;
దయితను నన్ను గూర్చి విధి ధన్యతఁగాంచఁగరాదె ! చిన్నమా !
భయమునువీడి నీవు భగవంతుని వేడుము నన్నుబిల్వఁగన్. 14

శా. ఓదేవీ ! హృదయంబు పెల్లగిలె, భావోద్రేకవిస్ఫూర్తి, వి
చ్ఛేదంబైనవి దేహబంధములు, కాల్సేతు ల్వడంకున్, మహా
ఖేదోద్విగ్నత నంతరాత్మయును మూకీభూతమై యేన్పు, ను
న్మాదావస్థను జెందియుంటి, దరిగానం జూడు చిన్నాంబరో ! 15

చ. కలకలలాడు నీ ముఖవికాసముఁగాంచని కన్నుదోయియుం,
బలుకులఁ దేనెలొల్కు మృదుభాషలు సోకని వీనుదోయియుం,
జెలిమిని గాంచనేరని వినిందిత రిక్త తనూ విలాసముం,
గలిగియు లేనివే యనుదుగాదె ! ధరాస్థలిఁ జిన్నమాంబరో ! 16

ఉ. ఏయదిచింతఁగూర్చు ? దసహిష్ణుతఁబెంపదు ? సత్సతీవియో
గామత ఖేద భగ్న తరళాత్మను ? సర్వజగంబు మిథ్యగా
మాయను మాను, శూన్యవనముం బురుడించును లోకమంతయుం,
బ్రేమపిలేని జీవితము పృథ్విని వ్యర్థముగాదె ! చిన్నమా ! 17

చ. అలప్రియమిత్రుచెల్మి, బుధులందఱిబీరము, వైద్యరత్న ధీ
బలమును, వెజ్జులందఱి జవంబును, సుస్థిర బంధుమిత్ర వీ
రుల దృఢ శక్తిసంపదలు, రోయనె? నిష్ఫలమయ్యె; నీవు నే
స్థలమున డాఁగియుంటివో! వెసం గన శక్యముగాదు, చిన్నమా! 18

చ. ప్రతిఫల మేమి కల్గునను భావముకల్గదు నెమ్మదిం బతి
వ్రతలకు, భర్తృసేవయె నిరంతర జీవన ధన్యవాద, మ
ప్రతిహతమౌను, స్వర్గ మపవర్గమునోఁ బతి సన్నిధానమే;
పతి విగనాడి పోవుటది భావ్యమె? సన్గొనిపొమ్ము చిన్నమా! 19

గీ. సర్వతోముఖమగు కీర్తి చంద్రికలను
భూనభోంతరముల వ్యాప్తిఁ బొందుపఱచి
స్వర్గరాజ్యంబుఁ బాలింపఁజనుట, దేవి!
యోగ్యమైనను, బతి వీడి యుండఁదగదు. 20

గీ. కామరూపులు చొరరాని భూములుండ
వగుట నాహృదంతరమున నణఁగియుండు;
స్వర్గమునకును మనమొక్కసారి చనఁగ
నగును; జిన్నాంబ! నేను దేహమును విడువ. 21

మ. సతతంబు స్సురలోకమందిటు నివాసంబుండెదేనిం, బతి
వ్రతనైన న్మది సంశయించు నమరవ్రాతంబు, సర్వోత్తమ
స్థితి నాహృత్తటవాస, మట్లగుట నోచిన్నాంబ! నీవుస్సదా
పతిమేన న్నివసింపఁజూడు మది సంభావ్యంబగుం గోమలీ! 22

గీ. మానస నివాసినివి నిన్ను మరచుటెట్లు?
జన్మజన్మాంతరముల నాసక్తి విడను;
స్థిరముగ వసించు నా హృదంతరమునందు,
నీయదియెకాదె! చిన్నాంబ! నిశ్చయముగ. 23

గీ. మృత్యువశమున నీమనః ప్రేరణముల
భేదమేమైనఁగలిగెనా ! సాదరమున
నన్ను స్మరియించెదవె? దేవి ! నిన్నుఁజూడ
దివికి వచ్చెద వేగ నందియముఁ గొనకు. 24

గీ. సహజధోరణి మునుగా నిహము విడిచి
పరమునకు దాఁటిదీసితి, వరయ నదియె
మాకుఁ బ్రాణగొడ్డంబయ్యె; మంచి విడిది
సిద్ధపఱచి పిలువనంపు, చిన్నరాణి! 25

గీ. పూర్వపుణ్యవశంబునఁ బొసఁగె మనకు
సామరస్యంబు, తద్విఘ్న జాత ఖేద
మధిక పరితాప కారణంబయ్యెఁ; జిన్న
మాంబరో! నన్ను వడిఁ బిల్వనంపు మటకు. 26

గీ. అబ్బె గీర్వాణపద మనుపట్టివైభ
వమున గీర్వాణమును గనవలను, దేవి !
భర్తృ సాన్నిధ్యమునఁగాని వ్రతసమాప్తి
కాదు స్త్రీలకు, నారాక ఘన నిరీక్ష. 27

ఆ. అఖిలలోక లోచనానంద నిలయమై
యెసఁగు నీస్వరూప మెచటనుండె
జగతి శూన్యమగును సౌందర్య హీనమై
చిన్నమాంబఁ గనకయున్న యపుడు. 28

గీ. చకిత హరిణీ విలోచన, చంద్రవదన,
శ్యామలాంభోజ మాలికా కోమలాంగి,
ప్రీతిఁగొని నాకు సాక్షాత్కరింతువేమొ!
యని తలంచెద మదిని, జిన్నాంబ! సతము. 29

క. భవదీయ సాహచర్యో
త్సవమొప్పినఁ గల్పములును సంవత్సరముల్
భవదీయ విరహ ఖేదో
ద్భవమున వత్సరములైనఁ దగుఁ గల్పములై. 30

చ. సుర నర కిన్నరాదులను జూడఁగలేని స్వరూపసంపదల్,
పరమ పవిత్ర భావములు, భాస్వర సుస్వర వాగ్విలాసముల్
సురుచిర సత్యసంధతయు, శుద్ధిగఁ గల్గిన చిన్నమాంబ యీ
స్థిర నిటువీడిపోవఁ బతి తెంపునఁ దా వెనువెంట నేగునే ! 31

శా. బాలేందు ప్రతిమానమౌ వదనశోభ న్మూర్తిమంతంబుగా
నాలేఖ్యంబునఁగాంచ నెమ్మది ననాయాసంబు సంధిల్లదే
లీలం బ్రాణము లుగ్గఁబట్టినను జాలిందూలు సర్వాంగముల్,
పాలింపంగదె ! చిన్నమాంబ ! దివికిన్ రప్పింపుకొ మ్రొక్కులో ! 32

గీ. బాలచంద్రుని నిరసించు ఫాలతలము,
దాడిమీ బీజముల మించు దంతపఙ్క్తి,
ముగ్ధ రంజన వాక్య సమ్మోదమగుచుఁ
దనరు నీచిన్ని మోముదమ్మిని దలంతు. 33

క. కలనైన నిన్నుగాంచఁగ
వలనుపడదు నాకు నిద్ర పట్టని కతనం
గల చిత్రపటముఁ జూడం
గలనన నశ్రువులు నేత్రకాంతుల నుడుపున్. 34

గీ. వేడుకలఁ గొల్పు వార్తయు, విమల విద్య,
భవ్యమైనట్టి కస్తూరి పరిమళంబు
పగిది, నీకీర్తిచంద్రికాభములు ప్రబలి
వన్నెవెట్టెను జగతికిఁ జిన్నమాంబ ! 35

క. బంగరుఁబోలు భవదీ
యాంగంబుల, ముఖ వికాస హాస ప్రభలన్
మంగళ వీక్షణ సారము
లం గాంచెడి భాగ్యములఁ జెలంగవె మాకున్ ! 36

ఉ. వీనుల నుత్తమాంగ గళ పీఠ హృదంతర సీమలందు, నీ
మానిత రూపసంపదల, మంజుల సూక్తుల, సద్గుణాంచితా
నూన ఘనప్రభావముల, నుత్తమ వృత్త కలాప పఙ్క్తులం
బూనెద నిష్ఠ ; సర్వసురభోగముల న్నినుగూడు నంతమున్ 37

ఉ. వేలకొలందిపద్యముల వ్రేఁగఁ గూర్చెదవేల యందహో
హాళిని దన్మయత్వ విదులందఱు నట్టులె సంస్మరింపరే
బాలిశులైరె వారు ! సతిఁబాసిన జీవమె దుర్భరంబగున్
మహాళిశయిన్ ధరింపఁదగు మాన్యచరిత్రవు చిన్నమాంబరో! 38

ఉ. పిల్లల పోషణార్థమయి పృథ్విని నన్ దిగవిడఁ గూడ దో
పల్లవపాణి ! యేగతిని వంశమునంతను నాకు సాకఁ గాఁ
జెలును ? వారలెట్టులో ప్రసిద్ధికి రాఁగల రాత్మశక్తి, వ
ర్ధిల్లెద రీమహీస్థలిఁ దరించెద స్వర్గముఁ జేరి చిన్నమా ! 39

చ. తనయులు పెద్దవారయి స్వతంత్రతఁ గాంచిరి, వారివారి జీ
వనముల నెట్టఁగల్గుదురు, వారల బిడ్డల వారె సాకఁగాఁ
జనుఁగద ! నాప్రచారమిఁక సభ్యముకాదిట వార్ధకంబునం,
బనియిఁక నేమి నాకిచట ; వచ్చెద నీదరికేను జిన్నమా ! 40

గీ. ముదిమి చేతను, వ్యాధిచేఁ గదలలేను,
బనులుఁ జేయఁగలేను, నావలన లాభ
మేమి ? యుపచారములు సేయుటే మిఁగులును,
దేవి ! నీసన్నిధియె నాకు దివ్యమగును. 41

గీ. వృద్ధు లారోగ్య హీనులు, పృథ్వి నుండఁ
దగదు, వారికిఁ బైవారి కగును బాధ ;
లాభ మెవ్వరికిని లేదు, క్షోభమె గద ;
చిన్నమాదేవి ! స్వర్గతిఁజెంద నిమ్ము. 42

గీ. కాలమునకు నిరీక్షించి కనలుచుంటి,
సాధ్యమగునెడఁ దడయక సముఖమునకుఁ
జేర్చికొనుము, చిన్నాంబ ! పోషింపఁదగిన
వాఁడఁ బ్రియుఁడను, బతిని, నీవాఁడఁగానె ? 43

గీ. దైన్యమనుమాట నెఱుఁగ నింతవఱకేను,
హాయిగా బ్రదికితిని నీయుండ గలుఁగ ;
లక్ష్మివి దొలఁగితివి, నాకు లజ్జ వొడమె,
భూతల నివాస మింక నొల్లఁ ; బొలఁతి ! గొనుము. 44

గీ. ఈసడించెద రెల్లరు హీనునిగను,
బిలిచి ప్రార్థేయుపడినను బలుక రెవరుఁ ;
గాలగతి మాఱిపోవ సౌఖ్యంబు గలుగ
దేటి కీబ్రదుకికేఁ దేవి ! దాఁటివత్తు. 45

గీ. సాటివారలలో నగుబాటు కాదె !
నేనపత్నీకుఁడనగుచు నిలువ నిలను,
బాపమనుచు బ్రతివారుఁ బలుకుచుండ్రు,
చిన్నమాంబిక లేనట్టి క్షితి యదేల ? 46

గీ. ఈవు దరినుండ జగమున కేను వెఱవ,
బ్రహ్మకైనను బైఁ బరబ్రహ్మకైన ;
అతివ లేనప్పు దేహపృథ్వి నవ్వులనుచు
వెఱవ వలయుఁ, జిన్నమా! సరస మగునె ? 47

క. భూకాంత సస్యవృద్ధిం
జేకొనియెను జిన్నమాంబ స్థిర వసియింపన్
లోకము శూన్యంబయ్యెను
నాకమునకుఁ జిన్నమాంబ యరిగిన వెనుకన్ 48

క. తొలకరి మెఱుపులఁ గలఁకలఁ
గలిగించెడి దేహకాంతి గల కులకాంతం
బలుకుల చిలుకల గళరవ
ములుగల చిన్నాంబ నెట్టి మూఢుఁడు మరచున్. 49

క. ఈ త్రిపుర సుందరీమణి
నేత్రాంచల దృక్ప్రసార నిర్మల గతిచేఁ
ఛాత్రా పాత్ర విచక్షత
శ్రోత్రియ పోషణ మొనర్చె, సుగతిం గనియెన్. 50

ఉ. మానస మన్ సినీమ, గనెదన్ హృదయాంతరమున్ తెరన్, సతం
బూనుచు; నంతరంగమను నుజ్జ్వల వైద్యుత దీపకాంతి సం
ధానముచేసి, నీకథఁ, బ్రదర్శనముం గనుచుందు నిత్యమున్,
మానిని! చిన్నమాంబ! యని మానస రంజక నాటకంబెనూ. 51

చ. మనమను యంత్రముం గొని, కుమన్ హృదయంబను దర్పణంబుపై
వనితరో! నీస్వరూపమును భవ్యముగాఁ బొటొగ్రాఫుఁ దీసితిం;
దనరెను భూతశుద్ధముగ దానికి బుద్ధి వినిశ్చలంబుగాఁ;
గనఁగల నెల్లకాలము, ముఖాముఖి నీప్రతిబింబమున్, సతీ! 52

క. స్వర్గమొ? నరకమొ? నివస
దుర్గమున వసింప మాకు దుఃఖము లుడుగున్
నిర్గమన సరణి మన కప
వర్గము, చిన్నాంబచెంత వాసము గలుగన్. 53

గీ. భావ పరిణామమునను సంభవములగును
స్వర్గ నరకము లిల మనో జాతములగు;
వినమె? భ్రమర కీట న్యాయమును ధరిత్రి?
నీగతిని గాంతుఁ జిన్నమా! నిన్నుఁ దగిలి. 54

గీ. పడఁతి లేనట్టి సౌధము పర్ణశాల,
సతి వసించెడి పూరిల్లు సౌధమె యగు;
నరకమౌ స్వర్గతుల్యము నాతి యుండ,
జిన్నమయు లేని స్వర్గము చిర నరకము. 55

గీ. ప్రబల సహవాసమునఁ జేసి వాయసీయ
కాఁగలరనెడి సామెత కలదు, దేవి!
యిట్టులే తాపసమ్మార్గరతి నవని మనము,
దివమునను నల్లె యగుదు సందియము లేదు. 56

క. భజనల, వ్రతముల, నిరవిగ
నిజపతిఁ గొలిచితివి ధరణి, నియతిగను సతీ!
సుజనుల వినుతులు గలిగెను
వృజినము నెఱుఁగక, దివిగన వెడలితివి గదా! 57

గీ. భుజగ కవివరుని సతివి, గజ గమనవు,
ధరణి విడిచి తరుణమునఁ దరలితివి, ది
వమునకు, సతికిఁబతికిని వసతి నచట
నమరుచును, త్వరగతి నట కరుగుదు నిఁక. 58

క. పూర్ణానుస్వారము సం
పూర్ణముగాఁజుట్టి లేచిపోతివి దివికిం
గర్ణాకర్ణిగ మొరనా
కర్ణింపుము చిన్నమా! యఖండ యశమగున్. 59

ఉ. సృష్టిరహస్య తత్త్వములు శ్రీపతికే తెలియంగనోపు, నా
కష్టము లామహేశ్వర ముఖంబున వెల్వడియుండు, సృష్టి ని
ర్దుష్టముసేయ భర్తలను దుఃఖములం బడఁద్రోయఁ జెల్లునే !
భ్రష్టునిజేసె నీగతి, శుభప్రద జీవన మార్గ్గెఁ, జిన్నమా ! 60

ఉ. ఎఱుఁగని వాఁడగాను పరమేశ్వర సన్నిధి కేల పోతివో ?
యరమర లేల ? యావిభు దయాఁగని స్వాగతమిమ్ము వచ్చెదన్
సురపురికేను, నంత మనఃశోధన లంతముపొందుఁ, జిన్నమా !
నిరయముఁ గోరఁజాల, ధరణిం బని లేదిఁక నాకు నిల్వఁగన్. 61

క. శుద్ధాంతఃపురకాంతలు
రాద్ధాంతముసేయఁ గను దురాసద మగుఁగా !
సిద్ధాంతముల గ్రహించి, త్రి
సిద్ధింగనుఁడని వచించుఁ జిన్నమ ధరణిన్. 62

చ. ఉదయముగాకయున్న రవి యుర్వర గాఢతరాంధకారమై
జదలను గ్రమ్మియాయు, సదృశంబగురాత్రికి, జీవకోటి కా
పదయగుఁ; జిన్నమాంబిక దివంగతయౌట మదీయ జీవితా
భ్యుదయము నల్లె శోభచెడియుండె నిశీధినిరీతి నుర్వరన్. 63

గీ. చిలుకగూటఁ బాముటు ప్రవేశించి నట్లు
మిత్తి నిన్నెత్తుకొనిపోయె నుత్తమాంగి ;
దైవసాన్నిధ్యమున పునర్దర్శనంబు
కలుగు సత్యముగ నచిర కాలమునకు. 64

గీ. ఉదకము ఘనీభవించి, మేఘోదయమునఁ
గరకమైనట్లు కర్మసంఘర్షణమున
మార్దవంబగు చిత్తము దుర్దశఁగని
రాయి యయిపోవుఁ, జిన్నమా! రాగముడిగి. 65

గీ. నమ్రమగు జీవయాత్రను నడపు జనులఁ
గష్టములువచ్చి మార్చును దుష్టులుగను ;
దారి బోయెడు పామును దరిమి కొట్టఁ
దిరుగఁబడిపట్టి కరచెడి తీరు, దేవి ! 66

గీ. రెండుదారులు, బ్రతు కంతరించు టొకటి ;
రెండు లోకాంతర ; మివి భరింపవచ్చు ;
శూన్య మొక్కటి, కలయిక సొంపు రెండు,
తరుణమున నెట్లో కాలము జరుప నగును. 67

గీ. కలియుదుము నిత్యజీవము కలుగు నెడల ;
మరణమే యంతమైన సమసెదము గద !
చావుబ్రదుకులు మనకు వ్యసనము నిడవు ;
చిక్కులే దెట్టులైనను జిన్నమాంబ ! 68

మ. త్రిజగన్మోహన మూర్తివై వరలి, ధాత్రిన్ శుద్ధ సద్వర్తనన్
భుజగేంద్రున్ మురిపించి మించి, ప్రతిభానూన ప్రసన్నాత్మవై,
విజయాభూత సమస్తదేవ వనితా ప్రేమాను సంధాత్రివై,
గజలక్ష్మిం బురుడించి, చిన్నమ! సురఖ్యాతి న్విడంబింపుమా! 69

క. పిడుగుల, నురుముల, మెఱుపుల,
వడిరువ్వియు, వెనుక వానఁబడి వడి జల్లిం
బడుగతి, యోగ్యులు తొందర
పడి కడు నుపశాంతిఁ జెంది వరలుదురు సతీ ! 70

గీ. శిశిరమున నాకులను విసర్జించి చెట్లు
మోడులై, వసంతాగమమునఁ జిగుర్చు ;
నాకు శిశిరము చిన్నమ్మ నాకమునకుఁ
జనుట, నేనట జనఁగ వసంత మగును. 71

గీ. వారు వీరననేల ? సర్వప్రపంచ
మందు గలవ్యక్తులెల్ల సౌఖ్యములఁగోరు,
నాపదం గోరరైన, ధన్యాత్ము లరిది ;
జన్మయే దుఃఖమయమని చాటు దేవి. 72

గీ. మనకు మించిన వ్యక్తి చేసఁడి సృజన
దాని భేదించు శక్తి లే దీనరులకుఁ ;
జంద్రమౌళీశ్వరుని పూజ సలుపఁదగును
వానిపై భారమును వేయవలయు దేవి ! 73

గీ. జీవు లమరులు, నాంలతావు దివము,
వసున నరకము, శిక్షకు వాస మగుచు ;
తప్పుఁజేసిన సురలు భూతల నరక ని
వాస శిక్షను ముదమ్ము వడయుఁ గాంత్రు. 74

గీ. చేతగాని వాఁడింతటి సృష్టిఁజేయుఁ
గలఁడె ! వ్యర్థశోకముల ముంపఁ దలఁచుకొక్కా !
తెలివిలేనివారమగుటఁ గలతఁ జెందఁ
దగదు, చిన్నాంబ ! నెమ్మది ధైర్యముఁగను. 75

చ. అమరులమై దివంబున మహామహు సన్నిధి నెట్టి దారుణా
క్రమములఁ జేసియో, యిట్టు, ధరన్ ఘనశిక్షను బొంద వచ్చియుం
దు, మది సమాప్తియైన, మన దుర్దశ తీరి దివంబుఁ గందు, మీ
యమపురి వీడి, సత్యమిదియంచు వచించెదఁ జిన్నమాంబరో ! 76

చ. వెనుకటి పుణ్యపాప సువివేచన నిచ్చిన భూ నివాస శి
క్షణగతి దుర్భరంబగును, గావున విస్మృతిఁగూర్చె దైవ మీ
ఘనకృప మేలు ; నీతమగు కాలము పుచ్చి, దివంబుఁజేరి, దే
వుని సముఖంబునన్ మొదటి పొల్పుచు గాంతుము చిన్నమాంబరో !

శా. లీలామాత్రమె కానిచోఁ బ్రకృతి వల్లీబద్ధుఁడై బ్రహ్మ, ని
త్యాలాపంబులఁ జిక్కి, దుఃఖపరిణామావస్థ శోషించునే!
ఫాలాక్షుండు ప్రబుద్ధుఁ, డాత్మవిదుఁ, డుత్పన్న ప్రవిష్యుండె మహా
బాలారత్నమ! చిన్నమాంబ! వికృతోత్పాతంబు గాదంతయున్. 78

చ. జనుఁ డొకఁడైన సౌఖ్యముగ సాగెను జీవిత, మెట్టి కష్టముల్
గనకయె యున్నవాఁడు మనకంటికి నొక్కఁడు, సర్వమానవుల్
ఘనతర కష్టనష్టములఁ గంటిమటంచును, సృష్టి నొక్కఁడేన్
దనిసితినన్న తృప్తి వసుధం గనరాదిది యేమొ! చిన్నమా! 79

గీ. తమకు నైజములగు దుర్గుణముల నెల్లఁ
బరుల కారోపణమొనర్చ భావ్యమగునె!
ప్రాజ్ఞులగువారె కళల సర్వజ్ఞులయ్యు
నిట్టిగతులఁ జరించెద రేమనందును. 80

చ. ఇరువురు మన్మరాండ్రు మనయింటనె యుండిరి, యీడువచ్చుటన్
వరులనుజూచి వారికి వివాహముల నొనగూర్చు యత్నముల్
త్వరగతిఁ జేయుచుంటి దయితావిరహవ్యథ యేర్చుచుండినన్ ;
జరిగెడి కార్యముల్ నిలువఁజాలవు సాగును చిన్నమాంబరో! 81

గీ. ఒక్కవత్సరమైన నీ వున్నయెడలఁ
గార్యములు సలక్షణముగ గడచియుండు!
నీవు లేకట్టి వైభవానీకములును
జిన్నఁబోయి యుండునుగాదె! చిన్నమాంబ! 82

ఉ. కార్యములున్, వివాహములు, కట్నములున్, సంపూర్ణ భూసురా
ధ్వర్యముతో యథావిధి శుభంబుగ సాగుచునుండెఁ జిన్నమా!
యార్యుల పూర్వపద్ధతి యుగాంతము నిల్చును, నిన్ను, భర్తలున్
భార్యలు, బిడ్డలేమయినఁ బ్రాక్తన ధర్మము లాగ వెన్నఁడున్. 83

గీ॥ బుచ్చి వెంకటలక్ష్మికి నచ్చినపతి
లక్ష్మరాజు శ్రీహనుమంతరాయ మంత్రి,
ప్రాడ్వివాకుఁడు, భూస్వామి వరుఁ డమరువిరేఁ;
జిన్నమా ! వధూవరుల నాశీర్వదించు॥ 84

గీ. ఆజ్యసంసర్గమున నాహితాగ్నిఁ బోలెఁ
బ్రజ్వరిల్లును గృహమేధి భార్యవలన ;
నట్టిసమ్మేళనముఁ బాయ నడఁగుఁ బ్రతిభ ;
నట్టిగతిపట్టె నాకుఁజిన్నాంబ యేగ. 85

గీ. కర్మలకు వీతిహోత్రుఁడు ఘనతఁ గూర్చు
నటులు గృహమేధి గృహిణిచే నందు ఘనత ;
జంటవిడిపోవ సామరస్యంబు చెడును ;
నడవిఁగాచిన వెన్నెలయగును దేవి ! 86

గీ. వేదముం గ్రైస్తవుల సత్యవేదము నిల
భార్య, భర్తదేహములోని భాగమనియె ;
సంతతియు నిర్వురకు దేహజనితము ; మన
సృష్టి బ్రహ్మకభేద్యమూఁ జిన్నమన్న ! 87

గీ. పూర్ణజనుషాంధునకు దృష్టివొడమినటులు
ధనవిహీనునకును నిధి దక్కినటులు
దూప దీరంగఁ దోయముల్ దొరకినటులు
సంతసించెదఁ జిన్నాంబ సన్నిధిఁగన. 88

గీ. నీటిలోమున్గి యూపిరి నిలుపలేక
తహతహను జెంది దరిఁజేరఁ దలచునటులు
చిన్నమనుగాంచు కాంక్షనిక్షితిని విడచి
దివికిఁబోవలెననెడి తితీక్షనుంటి. 89



శ్రీరాణి చిన్నమ్మారావు, 25 ఏండ్ల వయస్సు,
రాజాగారి తల్లి.




మ. త్రిజగన్మోహనమూర్తి రూపకళాపూర్తిం, బూర్ణసత్కీర్తి ది
గ్విజయస్ఫూర్తి, భయార్తరక్షణ మహోద్వేగంబునన్ ధాత్రి, భ
క్తిజనప్రీతిని దాత్రి, శాంతివ్యయఘనకీర్తిన్ విస్ఫురద్గాత్రి, యీ
ద్విజనారీమణి, చిన్నమాంబ, సకలోర్విన్మించెఁ బ్రఖ్యాతిచేన్. 1

మ. అహాహా! బ్రహ్మ స్వకీయ శక్తి సముదాయం బంతయుం జేర్చి నీ
మహనీయోరు సురూపముం బరమ నిర్మాణంబుగావించెఁ, బ్రి
త్యహముం గాంచి తరింపనోపుఁ, గనువారా రమ్య సౌందర్యమున్
మహిలో నెప్పుడు విస్మృతిం గనరు స్వాంతంబునం జిన్నాంబరో! 2

మ. ప్రమదారత్నమ! చిన్నమాంబ! త్రిజగద్బ్రహ్మాండ గోళంబులన్
క్షమ శోధించిన నీకుఁ దుల్యయగు సత్కాంతామణిం గాంచనో
పము, సౌందర్య విలాస వృద్ధులను; శోభన్ యోగ్యతా పూర్ణప
త్రిము నీవేకాన నర్హవౌదువు, యథార్థం బేను వాక్రుచ్చితిన్. 3

ఉ. చల్లనితల్లి, పిల్లల నజస్రముఁ బోషణసేయుఁ బ్రేమ వ
ర్థిల్లఁగ, దర్పణంబుగతిఁ దెల్లని చిత్తవిశుద్ధిఁ బ్రాతసం
ధిల్లఁగ నెల్లజీవసమితిం గృప సాకుచు, జిన్నమాంబ, తా
నొల్లదు కాలయాపన మహూన నిరర్థక రూపకంబులన్. 4

మ. ధరణి న్సర్వసతీమణీ విమల మూర్ధస్థాన మందుండనొఁ
బరమోదార కృపాతరంగిణి యగున్ భవ్యాత్మ చిన్నాంబ, త
చ్చరితంబు న్విరచింప శక్తుఁడనె? స్వచ్ఛందాత్మయా నీమెకున్
సరియా స్త్రీలు లభించు టబ్బురము శశ్వత్కీర్తి సంపత్తులన్. 5

ఉ. హెచ్చుగఁ జిన్నమాంబ పద మెచ్చటసోకునొ! యచ్చటచ్చటం
బచ్చని తోరణంబులును, వైభవముల్, ధనసంపదాను, ల
త్యుచ్చదశం గనుం, బరిణయోత్సవముల్, శుభ శోభనంబులుం,
బెచ్చుగుఁగాదె! యామె చన నిల్వక సర్వము మాయమౌఁగదా! 6

గీ. చిన్నమాంబకు దైవత్వసిద్ధి గలిగెఁ,
బూజనీయ యయ్యెను బరిపూర్ణశుద్ధి;
నగ్నిపరితప్త కాంచన మట్లు, వెలసెఁ
గాన స్తుతిఁజేసెదను సమగ్రముగ నిపుడు. 7

చ. భవమునఁ, జిన్నమాంబరో! స్వభావము జంటగఁ గూర్చుటం బున
ర్భవమున దంపతీగరిమ వర్ధిలుతన్ మనమధ్య, సద్ది సం
భవమగు యోగ్యరీతిఁ దలఁపన్ సురలోకమునం దటం బరా
భవమును గల్గనేరదు, శుభప్రదమౌ ముదమౌఁ బ్రశుద్ధిగన్. 8

ఉ. పూవునఁ దావి పీడకయె వ్యోమమునం బ్రసరించు, సూర్య సం
భావన వీడకే కిరణపంక్తులు భూస్థలిఁ బ్రజ్వరిల్లు, న
ట్లే వరచిన్నమాంబరో! మహిన్ దివి నెచ్చటనుండినన్ సతుల్
కేవల భర్తృసక్తలు, చలింపరు, దిగ్గజముల్ చలించినన్. 9

చ. వసనముఁ బట్టిలాగి, మనపైఁబడి, మన్మలు మన్మరాండ్రు నల్
దెసలనుమూగి, యల్లరి ప్రతిధ్వని సేయఁగ సంతసించి, నీ
వసలునకంటె వడ్డియె ప్రియంబని పల్కెడిదాన, విప్పు డా
కసముననుండి బిడ్డలనుగాంచి సుఖింపుము చిన్నమాంబరో! 10

శా. వృద్ధిక్షీణభవంబు లన్నియును బృథ్విం గాలకర్మాది సం
బద్ధ ప్రస్థితు, లాత్మ నిర్మలమగుం, బాటింపఁగాఁజెల్ల దీ
శుద్ధా శుద్ధ విచక్షణల్, ప్రకృతి విక్షోభంబులౌ, జీవి ని
త్యైద్ధప్రజ్ఞ వసించు, మాయ మునుఁగం డేవేళఁ జిన్నాంబరో! 11

మ. వరవృక్షంబులు బీజసంయుత ఫలోత్పత్తిన్ స్థిర స్సర్వదా
స్థిరజీవంబులఁ గాంచు; సంతతిని వాసింగాంచితో నిప్పుడా
పరముం జేరియు వంశవర్ధన కరోపాయంబులం జూడు మో
తరుణీ! తద్విధి నిత్యజీవముల సాఫల్యంబౌను జిన్నాంబరో! 12

ఉ. తల్లి నిజస్వరూపమును దాల్చి జనించిన పుత్త్రికాళి వ
ర్ధిల్లుట, వారిభూమిక ధరించి పునర్భవవైత్తి, పీతనూ
వల్లిక నామరూపము లవశ్యము సుస్థిరముల్ స్వసంతతిం;
బిల్లలతోడ నున్నపటువీక్షణ నిద్ది స్ఫురించెఁ జిన్నమా! 13

ఉ. ఇచ్చిన యర్ధరాజ్యరమ నిచ్చటనే దిగఁబెట్టిపోతి వా
మచ్చున; నర్ధదేహమును మాత్రము వీడక వెంటఁగొంటి వీ
పొచ్చెములేల! నీవు నను బూర్తిగఁగైకొని పోవు టొప్పదే?
ముచ్చటకైనఁ బిల్చికొనిపొమ్మిఁక వచ్చెదఁ జిన్నమాంబరో! 14

చ. పరిణయకాలమందు సమభాగములం దగఁ బంచుకొంటి మి
శ్వరముచు దేహబంధములఁ, బోతివి నాసగ మీయకీవు, స
త్వరముగఁ జీల్చి యర్ధతనుభాగమునే కొనిపోయినావు, నీ
కరమరలేల! చిన్నమ! రయంబున సర్వముఁ దీసికొమ్మిఁకన్. 15

చ. సరకచతుర్దశిన్ బుధజనంబుల, బంధుజనంబులన్, మహో
దరమున మజ్జనంబునకుఁ దప్పకపిల్చి ముదాన నూనెఁ ద
చ్ఛిరముల-'నమ్మకడ్డు మఱి చెల్వుగ నీదగు నత్తకడ్డు నీ
స్థిరపయిఁ జల్లఁగా-'ననెడు దీవనతోడను బోసి యుంటు నీ
పరమ వరానురాగ విభవంబుఁ దలంచెదఁ జిన్నమాంబరో! 16

చ. పరమ పవిత్ర జీవనము పాడుపడెన్ సగబాలుపోవ నో
తరుణిరో! సౌధరాజ వరధామము నిల్చునె? కుడ్య మూడినన్;
ధరణి కుటుంబ వృక్షముఁ దన్వియె మూలము, వేరుఁ గోసినం
దనువు నశించుఁగాదె! మన తత్త్వము నట్టిదె, చిన్నమాంబరో! 17

చ. అటికటి! మీవు నేను హృదయంబున, జేర్చిన యంతమాత్రనే
ప్రతియనవచ్చు; నంటు నటు లంటవుచే వెగిఁగోయఁ గూలదే!
సతి పతి కర్ధదేహము; వెనన్ సగభాగముపోవ నేనిఁకన్
బ్రతుకుట యెట్లుసాగును ధర న్వచియింపుము చిన్నమాంబరో! 18

చ. ప్రకృతి నశింప, బ్రహ్మకుఁ దరంబగునే పునస్సృష్టి సేయ? సా
ధక మదియే యగుంగద! యథార్థముగా సతిలేని కాపురం
బకట! నిరర్థకంబు; పురుషార్థము సాగదు, మృత్యువౌను, మా
మకగతి యట్టిదయ్యెను తపముం బ్రకృతంబుగఁ జిన్నమాంబరో! 19

చ. తెలియనివాఁడఁగాను, జగతి న్మృతిపొందిన వారలెవ్వరి
యిలఁ బునరుద్భవంబుఁ గన రీతను రూపున, నీవురమ్ము; యీ
విలయము కూడిరాదు, పరివేదన తీరదు, పక్షవాత రో
గులగతి నర్ధదేహమిలఁ గూలెను నాకిటఁ జిన్నమాంబరో! 20

మ. ప్రమదాయోగ్య సమస్త సద్గుణ సముద్ర ప్ర ప్రవాహంబు ని
కమిత ప్రాభవమున్ మహాదధిపతిన్ సభ్యత్వముం గూర్చెఁ; జి
న్నమ! త్రైలోక్య విభుత్వముం గలిగె నాహా! బంధు మిత్రాళికిన్
సమత న్మోక్షము సంతరింపఁగల వెన్షన్, స్వర్గముం గాంచెదన్. 21

ఉ. లోకము లుద్ధరించఁగల రుద్ర మహేశ్వర సత్ప్రభావముల్
నీకు లభించియుంచె నవలీలఁ దపోమహిమన్ ధరాస్థలిన్;
నాకము గోటిమీటున క్షణంబున నీకులభించె, బాంధవా
నీకమునన్ ననుం దనుపు, నిర్మలచిత్తవు చిన్నమాంబరో! 22

గీ. సత్య సంధతయే నిత్యకృత్య మనఁగఁ
బావనుల సేవయే జన్మపావనముగ
లోకపాలనయే సదాలోకనముగ
నెమ్మనమ్మునఁ దలఁచెఁ జిన్నమ్మ సరిగ. 23

గీ. నందనుల సేవ సచ్చిదానందముగను
బంధుజనగోష్ఠి సాధు సంబంధముగను
పుణ్యయువతీ భజన పూర్వపుణ్యముగను
జిన్నమాదేవి భావించెఁ జిత్రముగను. 24

గీ. రూపలావణ్యములు సుస్వరూపముగను
ధన సమార్జన మృత్యు సాధన మనఁగను
సార్థ జీవనమే పరమార్థముగను
దలఁచి చిన్నాంబ పరమ పదంబుఁ గనెను. 25

గీ. నిటలతట ఘటితాంజలి పుటములొప్ప
సకల నారీమణులు నమస్కారములను
జేయఁదగుఁ జిన్నమాంబకు; స్త్రీలెకాదు
పురుషులును మ్రొక్క నర్హ మీ పుణ్యచరిత. 26

ఉ. చిత్రము చిన్నమాంబదగు జీవచరిత్రము బాహ్యరీతిఁ దా
పత్రము సంకులంబనెడి భ్రాంతిని గొల్పును, లోని తత్త్వమే
మాత్రము నట్లుకాదు, గరిమం బరమార్థ విలిప్తమౌ సుధా
పాత్రను బోలు నెమ్మన, మహార్హ్య విరాగ వివేక శక్తులన్. 27

ఉ. ముంగురు లింపు నింపుచును మోమునఁ దుంపెస లాడుచుండ, హ
స్తాంగుళి దిద్దుచుం బ్రహసనోచితి జూపెడి నీముఖాబ్జ ము
ప్పొంగ మదీయ సన్నిధి విభుత్వముఁ జూపెడివాని విప్రు ని
స్సంగతి నిట్టులేగ విరసంబని తోఁచదె ? చిన్నమాంబరో! 28

ఉ. వెన్నెలకంటెఁ జల్లనగు వీక్షణముల్, ముఖమెన్న ధౌతమౌ,
నెన్నుదురెన్న స్నిగ్ధమగు, నింపు రదాళియు నట్లు, హాస మా
వన్నెను మించు, నిర్మలిన వర్తనముల్, హృదయ ప్రవృత్తులుం,
జిన్నమదేవియే పరిహసించు. జయించినదౌట వెన్నెలన్. 29

ఉ. భూకైలాసము నిశ్చయం బిది యనం బొల్పొందు మద్గేహమే
నాకంబౌనని తోఁపఁజేసితివి విన్నాణంబుగాఁ, జిన్నమా !
నాకా సౌఖ్యములెల్ల నీవిరహమున్నన్ శూన్యమయ్యెంగదా !
శోకంబీ నిలయంబు నిండె నిపుడస్తోకంబుగా రేఁబవల్
నాకున్ భూసురనామునుండియు మరున్నారీ శిరోరత్నమా ! 30

ఉ. ఎంతతంబుఁజేసిన మహిన్ హృదయేశ్వరిఁ గోలుపోయినం
జింతలఁజిక్కి వందురని జీవులు మేదిని నుందురే? సరా
గాంతమున న్విరాగ మరయన్ సమకూడదు చిన్నమాంబరో !
సంతముకాదు, జీవిత మభాగ్యము నాకిఁక నెప్పు డోర్పుటన్. 31

ఉ. ఓ యెలనాగ ! నీహృదయ మేగతి నేగతి నన్నువీడి దే
వాయతనంబుఁ జేరఁగ ధ్రువంబుగ నొప్పెఁ బతివ్రతాత్వ శో
భాయుత ధర్మమౌనె యిది? ప్రాక్తన పద్ధతికాదు, చిన్నమా !
ప్రాయము న్యాయమున్ దెలుపు భర్తృసమక్షము వీడియుండినన్, 32

గీ. దైవపరిశోధనల కాత్మ తత్త్వమందు
సంశయింపను చిన్నమ్మ సత్త్వముగను,
ఖేదముల మనోద్రఢిమమే పాదుకొలిపి
భక్తి పరవశ యగుచు, స్వభావగరిమ. 33

ఉ. గాత్రమునందు, గాత్రమృదు కాంతుల, హాస కటాక్ష విస్ఫుర
న్నేత్రములన్, సుధారస వినిర్మల బింబ రదచ్ఛద ద్వయిన్,
శ్రోత్ర మలీమసాపహర సూక్తులఁ, గుంతల నీల పంక్తులన్,
ధాత్రిని జిన్నమాంబికకుఁ దాల్చిన కాంతలఁ గాంచ శక్యమే. 34

ఉ. కుందనమున్ హసించు మెఱుఁగుంగను మైఁరుచులున్ సితాభస
త్కుంద రదంబులుం, గుసుమ కోమల శోభఁ దలిర్చు నంగమున్,
బంధుర నీల కుంతల ఘనత్వము, పావన దృగ్విలాసముల్,
శంసుమె? యన్యకాంతల కిలన్ మన చిన్నమదేవికే తగున్. 35

చ. అలికులవేణి పన్నగము, హాసము చంద్రిక, మోము పద్మమౌ,
బలుకులు కీరవాక్యములు, పల్లవముల్ కరముల్ గనన్ లస
ద్గళమును శంఖమౌ, బదము కంజము, తీరగు బెండకాయ లం
గుళులు, సునాస చంపకము, గోమలి చిన్నమదేవి కన్నఁగన్. 36

మ. అళులో! మేఘములో! కురుల్, ముకుర మే యానొక్కొ నీహారమో
ధరఁజెక్కుల్; ప్రభ దంతపంక్తి ఘన ముక్తాహారమో మల్లెపూ
సరమో! ఫాలము బాలచంద్రుఁడో! సుధా సారంబొ! బాహుల్లరం
బరయం దామర తూండ్లో? వల్లరులొ? యేమౌనొక్కొ? చిన్నాంబకున్,

మ. అరవిందంబొ? శశాంకుఁడో? తెలియ దాస్యంబన్న, మీనంబులో?
సరసీజంబులొ? లోచనద్వయ లస త్సౌభాగ్య మెన్నంగ, సుం
దరి యోష్ఠంబది దొండపండొ? కరమోదారామృతంబో? యనన్;
వర చాంపేయమొ? నువ్వుబువ్వొ? వికస న్నాసంబు చిన్నాంబకున్.

మ. ముఖలావణ్య విశుద్ధ శోభ లమలంబుల్, నేత్ర పద్మంబులౌ;
నఖ దంతద్యుతి ధౌత నిర్మల నభో నక్షత్ర తుల్యంబెయౌ;
సఖి చిన్నాంబ కటాక్ష వీక్షణ విలాసంబుల్ సుధాధారలౌ;
సుఖదుఃఖంబులు విస్మృతంబులగుఁ దచ్ఛోభాకృతి ప్రస్మృతిన్. 39

## —♦ విధి నైపుణ్యము ♦—

చ. తలఁప విధాత సృష్టిపరతం జిరకాల సమార్జితాత్మ శ
క్తుల సముదాయ సారమును గోమలి చిన్నమ రూపమునందు స
ల్లలితముగా నమర్చె సరళంబుగ; సద్గుణ సాంప్రదాయ ని
ర్మల సమయానువర్తనల, రక్తివిరక్తుల నింపె, నేర్పుచన్. 40

చ. పిక శుక శారికాదులను, వృక్ష లతాదుల, మల్లికా సువా
సక జలజాదులన్, మకర మత్స్య ధులీవర శుక్తికాదులం;
బ్రకట మృగేంద్ర వారణ కురంగ శశాదులఁ, బ్రోవుఁజేసి, యొ
క్కకరువున న్మధం బమునుగానిడి చిన్నమ స్రష్టచేయునో. 41

చ. పొలతి వయోవిలాస నవమోహన రూప దిదృక్షు విభ్రమం
గొలుప, గుణంబు నెంచకయె కూర్మిని జెంది వివాహమాడినం
బ్రళయము మెయిరాఁ బదంపడి ధరన్, గుణసంపదగూడఁ గల్గినన్
నిలయము స్వర్గతుల్యముగ నింపురు జిన్నమదేవి కీర్తిగన్. 42

—§ నవరసములు §—

చ. నవరసముల్ యథోచిత గుణంబులఁ జిన్నమదేవియందు సం
భవమయి తత్తదుక్త సమవర్తన మద్భుతకీర్తిఁ జేయు, సం
స్తవమున కర్హమయ్యెది, ప్రశంసకుఁ బాత్రము; భారతీ మహా
త్సవములుగావె! సర్వరస తత్త్వ సమాశ్రయముల్ ధరాస్థలిన్. 43

చ. నవరసముల్ యథోచిత గుణంబుల నౌచితినెంచి, దేశకా
లవశతఁ జిన్నమాంబికల లభ్యములై మెలఁగెన్ సమిష్టిగన్;
జనమున నాజ్ఞమీఱు, వశంవద లెప్పుడుఁ జిత్రమౌఁగదా
భువి మనుజ ప్రకాండుల కభూతమె గాక యసంభవంబగున్. 44

సీ. శృంగార మాత్మజా దృగ్విలాసములందు,
వీరంబు దాతృతావేశమందు,
కరుణ నిస్వజన ప్రకాండ సంతతియందు
యద్భుతం బతుల దేవాంశయందు,
హాస్యంబు జార చోరాస్య దర్శనమంద।
యతి భయానకము పాపాలియందు
బీభత్స మురుజీవ వితతి హింసలయందు
రౌద్రమ్ము దుష్టవారంబునందు,
గీ. శాంతము గృహస్థధర్మ విసరమునందు,
కాని మఱియొందుఁ జూచినఁ గానరాద
టంచు సర్వజనులు వినుతించుచుండ్రఁ,
జిన్నమాదేవి చిన్నమ చెన్ను దన్నె. 45

—♦ నవనిధులు ♦—

చ. నవనిధులు న్మదీయ సదనంబునఁ జిన్నమతోడవచ్చి, ప్రా
భవమున నిల్చి, యర్ధశత వత్సరముల్ పరిచర్య సల్పి, వా
సవపురి కామెయేగ, సరసంజనె నవ్వియు, నాప్రమేయ మొం
చవు మది, ప్రభ్వివోవఁ బరిచారిక లేటికి నిల్తు రిచ్చటన్. 46

సీ. వర మహాపద్మమ్ము వదనమ్ము సేవింప,
నెమ్మిఁ బద్మమ్ము హస్తమ్ముఁ గొలువ,
లలిత శంఖమ్ము గళమ్మును భజియింప,
ఘన మకరమ్ము జంఘల నుతింపఁ,
దత కచ్ఛపమ్ము పాదమ్మును గొండాడ,
శివ ముకుందమ్ము సౌష్ఠవము నెంచ,
ధవళ కుందమ్ము దంతంబులఁ గొనియాడ,
నురు నీల మలకల గరిమఁ బొగడ,

గీ. భూరి వర మంగ సంచయమును వరింప,
నవ నిధులచేత సేవ్యయై భవ విముక్తి
ముక్తికాంతా సమాసక్తి మోక్షపదవి
నధివసించిన చిన్నాంబ యర్హురాలు. 47

—♦ నవగ్రహములు. ♦—

చ. అవయవ సద్గుణంబుల రయంబునఁ జేరి నవగ్రహంబులున్
ధ్రువముగ నాశ్రయించి తగు రూఢిని జిన్నమదేవి జీవితం
బు వసుధ నుచ్చకాల ఫలముల్ గనుపద్ధతి సంచరించి, శా
స్త్రవిధిని జ్యోతిషంబున వశంవదలయ్యె ధరిత్రి నెంతయున్. 48

గీ. సూర్యకాంతియుఁ, జంద్రవిశుద్ధ యశముఁ,
గుజ సమక్షమ, బుధసౌమ్య గురుగుణంబు,
గురు మనీషయు, శుక్ర విస్తరసునీతి,
రాహుకేత్వమృతత్వంబు, రాణఁదాల్చి
చిన్నమాంబిక సురపురిఁ జెలువుఁ గాంచు. 49

— రాసులు —

గీ. మీన నేత్రిమ్ములును, వర మేష సాధు
విధమును, వృషభ సత్త్వంబు, మిథున కీర్తి,
కన్యకా సంతతియుఁ, దులాగౌరవంపు
ద్వంద్వసమబుద్ధి, సింహ మధ్యంబుఁ, గార్ము
కోపమ భ్రూయుగంబును, నొప్పుచుండఁ
జిన్నమాంబిక సురపురిఁ జెలఁగుచుండు. 50

మ. సముదంచత్స్మిత హాస వీక్షణముల జ్యోత్స్నాప్రాయ చిన్నాంబ, సం
భ్రమమారఁ దద్వదనారవిందము సుధాప్రాయంబుగాఁ జూడ్కికిన్,
భ్రమరంబుల్వలె నీలకుంతలము లాస్యాయంబులౌ, దేహమం
దమృతం బెల్లెడఁ బూర్ణమై యుబుకు స్వర్గాహా! మది దోఁచెడిన్.

మ. తనువా! యేటికిఁ దాపమొందెద వనిత్యంబైన చిన్నాంబ భూ
తనువుంగూర్చి? పాంచభౌతికము ప్రధ్వంసంబుగా వీగెఁ; బా
వన తత్త్వంబగు దేవియాత్మ తిరమై వర్ధిల్లె స్వర్గంబునం;
దనువున్వీడిన జీవులందఱుఁ బరాత్మం జేరి యుండ్రెప్పుడున్. 52

చ. కరములు దానధర్మము లఖండముగా రచియించి మించెఁ, ద
త్కరములు దేవపూజ లధికంబుగఁ దృప్తిగఁ జేసియుండె, నా
కరములు భర్తృసేవల జగ ద్విదితంబులు, చిన్నమాంబికా
కరములు పావనంబులు, సుఖప్రదముల్, సఫలంబు లెన్నఁగన్. 53

చ. పటమున నాత్మసంతతిని బ్రక్కలఁ జుట్టును గూర్చి, మధ్యఁ బ్రా
కటగతిఁ జిన్నమాంబ సముఖంబున నాపటమున్ లగించి, నా
పటుతర దివ్యకావ్య ముఖపత్రమునన్ సమకూర్చినాఁడఁ; బ్ర
స్ఫుట హృదయానుతాపము విమోచన జెందునుగాక నాకికన్. 54

ఉ. చిన్నమ జీవయాత్రనిటఁ జిత్రపటంబులఁ జేర్చికూర్చుటన్,
సన్నుత కావ్యరాజమును సల్పి పఠించుటచేతనుఁ, మదీ
యోన్నత తీవ్ర ఖేద శమనోపకృతిం గనఁబూనితిన్; సతీ
సన్నిధి నున్నయట్టు లనిశంబును నీగతిఁ బ్రొద్దుఁబుచ్చెదన్. 55

ఉ. చిన్నమ వాక్ప్రసంగము లశేషము వీనుల మాఱుమ్రోగెడిన్,
గన్నులఁ దత్స్వరూపము సుఖప్రదమై కనుపట్టుచుండెఁ, ద
త్సన్నుత సన్నిధాన సరసత్వము నన్నెడఁబాయ దెత్తఱిన్,
మన్నన మిన్నగన్నిలుచు మాన్య పతివ్రత యన్నఁ జెల్లదే! 56

—♦ పంచభూతమయము. ♦—

చ. అనవరతంబు శాంతి హృదయంబున నిల్పుట, మానసంబు పా
వన రసపూర్ణమౌట, సుర వందిత తేజమునం గృహాంతరం
బనిలమొ? వ్యోమమో? యన రయంబును జూపుట, పాంచభౌతికం
బనఁదగుఁ జిన్నమాంబ లసదాత్మయు దేహముకేతి నెంచఁగన్. 57

గీ. ప్రాణ పంచకమును ఘన పాంచభౌతి
కేంద్రియంబులఁ గూర్చి నిస్తంద్రముగను,
జిన్నమాదేవి విజ్ఞాన సిద్ధిఁ గాంచి
జీవయాత్రను నడపె సంజీవి కరణి. 58

—♦ గార్హస్థ్యము. ♦—

మ. కృతిమత్కావ్య సమీక్షణేచ్ఛ గనువారిందన్ని భాగంబులా
తత దుఃఖాకులమౌటఁ దత్వసము పేతం బెన్నఁగాదంచు సాం
ప్రతముం బల్కెద, రద్ది భ్రాంతియగు, నద్వైతంబు దాంపత్య సా
ధిత ధర్మంబననౌ, సతీపతుల కార్తిం బాపు, మోక్షం బిడున్. 59

గీ. ఆశ్రమంబుల గార్హస్థ్య మమలమనియు,
నైహికాముష్మిక ప్రదం బనియుఁ, గలదు ;
ధర్మపత్నియె సిద్ధ సాధనము ; సతిగ
తింప భర్తయుఁ బృథ్వి గతించినట్లు. 60

చ. ధరణి సతీపతుల్ ప్రణయ తత్త్వ పరైక్యతఁ జెంది ప్రేమ త
త్పరులగుచున్న జీవపరతత్త్వ సమాశ్రయ ధర్మ సాధకం
బరయుటయౌను; జన్నము పరాధిపుఁ జేయుట ధర్మసాధనాం
తర మిఁక నాకు లేదు; నిరతంబును దత్స్మృతిచేఁ దరించెదన్. 61

మ. అరయ న్సద్ఋషిసత్తమోత్తములు బ్రహ్మపద ముత్కృష్ట మం
దురు, సృష్టి న్విధి గాంచెదాని, సగుణాధుల్ జీవు లాప్రీతి ని
ద్ధర దాంపత్యవిధి న్సుఖింతు రలపుండేన్ సృష్టికార్యంబునం
బరమానందమునంది వర్ధిలుట భావ్యంబౌను జిన్నాంబకో ! 62

గీ. ఆహితాగ్ని ప్రతిష్ఠాప నాధికార
మంతరించెను నాఁడు జిన్నాంబ తరలఁ ;
గర్మ బాహ్యుఁడనై కలకాల ముర్వి
బ్రతికియుండుట ధర్మ ప్రపత్తికాదు. 63

గీ. రెంటికిం జెడిపోయిన రేవణ నయి
ధరణిఁ దలక్రిందుగను గపోత ప్రసక్తిఁ
గని, యపత్నీకుఁడ నగుచుఁ, గనలుచుంటి,
దైవ దుర్విపాకము దాఁటఁ దరమె ! దేవి ! 64

క. సిద్ధాంతులు, మాంత్రికులును,
రాద్ధాంతముల న్నిరంతరంబును భక్తి
శ్రద్ధలఁ గృషిసల్పియును, ని
రుద్ధప్రజ్ఞల, నిరుత్తరులైరి యకటా ! 65

## —♦ వ్యక్తిగతములు. ♦—

చ. అరయఁగ జీవజాతములు వ్యక్తిగత ప్రభవంబు, లాత్మత
త్పరములు, ఖేద మోద మిళితంబులు, స్వార్థము, లన్యభోజ్య స
ద్వరములు గావు, కర్మపరిపాకము, లెవ్వరికైనఁ దప్ప, వీ
శ్వర పరికల్పితంబులగు సత్య నిబంధన లివ్వి, చిన్నమా! 66

మ. తలిదండ్రుల్, సహజుల్, సతీపతులు, సంతానంబు, బంధువ్రజం
బులు, సన్మిత్రులు, వెంటరారు, రుజలం బోఁగొట్టలే రెవ్వరున్;
ఫలముల్ జీవియె పూర్తిగా ననుభవింపం జెల్లుఁ, జిన్నాంబరో!
విలయంబై చను బుద్బుదంబులగతిం బ్రేమానుబంధంబులున్. 67

చ అవని జనించుటాది మరణాంతములోపున నొందఁజెందఁగో
భువిని సతీ సుతాది హితముఖ్యులు గూడెద రైహికంబుగా;
జవనిక వ్రోవ నందఱును జాటయి బాధ విమోచనం బగుం;
గువలయ శోభ యిద్ది; మఱకుం గతి యిద్దియె, చిన్నమాంబరో! 68

## —♦ భగవల్లీల. ♦—

ఉ. పిల్లలు బొమ్మరిండ్ల నతివేడుకతో నిసుకన్ రచించి, యు
త్యుల్లసనంబుతోడఁ బరమోత్సవముల్గని, తుష్టిఁజెంది, సం
ఫుల్ల పదాంబుజంబుల సమూలముఁ బాడొనరించు రీతి, రా
జిల్లును దైవ సృష్టియును, జిన్నమ! లీలయె వాని కంతయున్. 69

మ. సవిలాసంబుగ దైవ మీసృజనఁ దా సల్పున్; గడున్ మోదమం
ది వడిన్, దా విరమించు సర్వమును, వ్యక్తిత్వంబు జీవాత్మకుం
దవకాశం బసలే లభింప, దిట మిథ్యావాదమే సార్థకం
బవుటం, జిన్నమదేవి! చింత మఱ కింతైనం గనం జెల్లునే? 70

ఉ. నాటక రంగమందు నటనం బొనరించెడి పాత్రలట్లు, భూ
వాటిక జీవకోటులు క్రమంబుగ వచ్చి చరించి పోవ, రీ
పాటి కహంకృతిం గనుట భావ్యముకా దవనిన్, సదా జగ
న్నాటక సూత్రధారుని మనః పరికల్పిత వృత్తులే కదా! 71

—♦ వా యు దే వుఁ డు. ♦—

చ. అనిలమె దైవ, మెల్లెడల వ్యాప్తముగన్, బహిరంతరంబులం ;
దనువున వ్యోమమందు జ్వలితంబగు జీవపదార్థ మిద్దియే ;
ఘన గుణ రూప కాంతులను గాంచును, సర్వసమత్వ మొప్పఁగ; జీ
వనమె నశించు నీవిధుల వాయువు పోయినఁ, జిన్నమాంబరో ! 72

గీ. ప్రాణపంచకమనఁ బంచవాయువులని
వేదములఁగల, దద్వైత విధిఁ దలంప,
జీవ పరమాత్మ లైక్యతఁ జెందుఁ ; జిన్న
మా ! మనమును దైవము వాయు వనఁగఁజెల్లు. 73

గీ. వాయుసుతుఁ డతిబలుఁడు, రాజసేయుఁడనఁగ
భగవ దంశను బ్రభవించె వరమొందగుచు ;
ధరఁ జిరంజీవి యయ్యె నాతఁడు ; సఖులనె
తనువువిడి చిన్నమయు దివ్య తనువుఁ గాంచె. 74

క. అండాండంబును, దనుపరి
బిండాండంబెల్లనిండి, విచ్చలవిడి బ్ర
హ్మాండం బంతయుఁ బూర్తిగ
నిండెను జిన్నాంబ కీర్తి నిర్మలితముగన్. 75

ఉ. ఏపురికైన నీవు చననెంచిన మున్నుగ నన్ను బంప, నీ
కై పరిశుద్ధ మందిరము నచ్చట సిద్ధముచేయువాఁడ, నే
డీ పరిపాటి మార్చి దివి కేగితి వొంటిగ ముందు చిన్నమా !
యీపని నాకసాధ్యమని యెంచి స్వయంబుగ నిర్వహించితే. 76

-:0,-



శ్రీరాజా చిన్నమ్మారావు, మనుమలు, మనుమరాండ్రు
౬౮ ఏండ్ల వయస్సు.




ఉ. ఇందిర, సర్వభాగ్యలస దిద్ధ వరప్రద కార్యపాళి, నిం
దిందిర మీశ్వరాత్మ వర నీరజ సాధమతల్లికం, గళా
మందిర, మార్యలోక పరిమండిత సత్పరిషద్ధరన్. ధరా
సుందరి సుప్రజాభరణ శోభను జిన్నమదేవి యెంచఁగన్. 1

ఉ. చిన్నమ పాత్రదానమది చిన్నమయేనియుఁ మేలు మేలనుం
గన్నమఁబోలె నేనకుల కన్నమ తెవ్వరుఁ బ్రీతిగాదనుం
బన్న మమిత్రుఁబొందిన విపన్నమతిం దలపించుఁ, దిండి లే
దన్న మనుష్యునిం బనుప దన్నమవెట్టక రాత్రియుం బవల్. 2

ఉ. నేత్రము లుత్తమాంకతరుణీజన దేశికతా ప్రసిద్ధికిం
బాత్రము లంచితాఖిల సుమప్రభవామల సౌరభాఢ్యమా
గాత్రము, దుష్టకష్టజన కాండలతావ్రజ ఖండశాత స
ద్దాత్రము లౌర! శ్రోత్రములు తథ్యము చిన్నమదేవి కెన్నఁగన్. 3

ఉ. భూషణముల్, కవీంద్ర బుధ భూజన యాచక బాంధుబృంద సం
తోషణముల్ సమస్తఖల దుర్గుణ పంకజలౌఘ భానువి
శోషణముల్, సుధాసదృశ శుద్ధసమిద్ధ వరార్థబద్ధ సం
భాషణముల్, సతీతిలక వర్యను జిన్నమ నెన్న శక్యమే ! 4

గీ. మాణవకులను బెంచెడు జాణతనము,
రాణివాసము వెలయించు పోణిమియును
బ్రాణవల్లభ యనిపించు త్రాణగల్గి
క్షోణి నలరారెఁ జిన్నమరాణిరాణి. 5

ఉ. వాణి, సుధోపమాన మృదు వాగ్రచనన్, ఘన చంచరీక స
ద్వేణి, విశుద్ధ నిశ్చల వివేక విశేష సమస్త సద్గుణ
శ్రేణి, సుదాతృతా దివిజ వృక్ష లతా ప్రతిమాన సద్యశః
పాణి, సుశీల, భవ్య వరవర్ణిని చిన్నమరాణి యొప్పుగున్. 6

చ. రసము సమస్తసజ్జన పరంబగు సాధుహృదంతరంబు, సా
రసము ప్రఫుల్ల పుష్ప మకరంద సమాన ముఖంబు, సత్కృపా
రసము మనంబు దీనజన రక్షణ పాలన దీక్ష, గోస్తనీ
రసము దలంపఁ జిన్నమ పరామరికన్ శిశు పోషణంబునన్. 7

చ. వనము గృహంబు చిన్నమ దివంబున కేగుటచేత, నాదు జీ
వనము వృథాయనందగు ధ్రువంబుగఁ, దత్స్మృతిఁగన్న జన్మపా
వనము, తదీయమూర్తి హృదిఁబాదుకొనంగ ధరించి మించు సే
వనమున నేఁదరించెద, స్వభావ విశుద్ధము కాదు, పూజ్యయే. 8

చ. సరసములాడదెన్నఁడుఁ బ్రశస్త విశుద్ధ సుశీలసంపదన్,
విరసములన్ సహింపను బ్రవీణతఁ జూపుచు దన్నివారణం,
బరుసములాడువారలు సుపర్వులెయైన నిరాకరించుఁ, గ్రో
ధరసముఁజూపు దుర్జన విధానముఁగాంచినఁ జిన్నమాంబయున్, 9

ఉ. ధైర్యముఁజూపు దుర్జన కుతంత్ర విమర్దన దీక్ష, సన్మన
స్థైర్యముఁజూపు దీనజన దైన్య నివారణ సాధనంబునన్,
శౌర్యముఁజూపు నెత్తజీఁబ్రశస్త సతీజన మాన రక్షణం,
గ్రౌర్యముఁజూపు దుష్కృతి, నిగర్వశిరోమణి చిన్నమాంబయా. 10

చ. అరమరఁగాంచ దెయ్యెడల నార్తజనావన రక్షణంబునన్
గరగరతో మెలంగు వెటకారముఁ జూపెడి వారిపట్టునన్
సురుచిర దైవసేవ పరిశుద్ధ హృదంతర భక్తి పూరయా,
వరతరుణీలలామ, జనవందిత, చిన్నమదేవి యొంచఁగన్. 11

ఉ. హ్రాస్వముమూసె నెల్లగతులన్ సతియున్సుతుఁడున్ గతింప, స
ర్వస్వము శూన్యమయ్యె, జనరంజక శక్తి హరించె, నంతఁగం
ఠస్వరముం జలించెఁ, బ్రకటంబగు బుద్ధియుడంగెఁ, బృథ్వినా
భాస్వరమూర్తి చిన్నమ దివంగతయౌటఁ, బరాత్పరేశ్వరా ! 12

ఉ. భద్రమెటుల్సతీవిరహ పాతక జీవికి? సర్వదా గృహ
చ్ఛిద్రము లావరించి, పరిషేచన సేయు సదాశయంబులన్ ;
క్షుద్ర మనోవ్యథల్ పరమశూన్య మొనర్చు హృదంతరంబు, ని
ర్నిద్రతఁజిన్నమాంబ ధరణి న్విడిపోయిన జీవనం బికన్. 13

చ. తలఁపఁగ నుత్తరాయణము ధన్యతఁగూర్చెడి పుణ్యకాల మీ
యిలఁద్యజియించి స్వర్గపురి కేగెడి వారికిఁ; జిన్నమాంబ కీ
ఫలములభించె; స్వర్గసుకవాటము లన్నియుఁ దీసియుండు నీ
వలనున, లోని కేగనగుఁ, బ్రస్ఫుటమియ్యది శాస్త్రపద్ధతిన్. 14

మ. తరమే బ్రహ్మకునైనఁ జిన్నమసతీ తత్త్వంబునన్ లోకమి
ద్ధరణిం గాంచఁగ ధర్మవర్తన యథార్థప్రజ్ఞ సాధించె; ను
ర్వర శీలంబును, సత్యమున్, దయయు, ధైర్యస్థైర్య సంశుద్ధి చే
వరలంజేసిన ధన్యురాలు, సుమనోవారంబునం జేరె, నౌ. 15

ఉ. ఈసతినాశ్రయించని యహీనగుణ ప్రకరంబుగాని, యు
ద్వాసనఁ గాంచనట్టి యపవర్తనఁగాని, గణించి చిన్నమాం
బాసతి జీవితంబున క్షమం బ్రకటింపఁగ శక్యమౌనె, భూ
వాసుల కేరికైన? సురవందిత దివ్య చరిత్ర యౌఁగదా ! 16

చ. త్రిభువన సీమలందు సుదతీమణు లందఱుఁ జిన్నమాంబ కు
ల్లభమిడి, మార్గదర్శినిగ రక్తిఁగొనందగు, నీమె కెంపు స
న్నిభయగు కాంతయుండెను, గణింప సతీజన మాననీయ యౌ,
శుభఫలదాత్రి యీమె, పరిశుద్ధ వినిర్మల సత్య వాణియే. 17

ఉ. చిన్నమ జీవయాత్ర నెటుజేసెనొ కాంచిన యోగ్యులైనఁ, బ్రి
చ్ఛన్నమున న్వచింపరె ప్రశస్త విశుద్ధ విరాగ శక్తి సం
పన్నతఁగాంచె సాధ్వి, సుతపంబుల నెన్నిటినో రచించె, వ్యా
ప్తన్నమతిం బరాత్పరుని భక్తి భజించి తరించె నంచిలన్. 18

మ. తన సంకల్పములన్ మనోద్రఢిమ సాధానంబుగావించి, మిం
చిన నిష్కామ విశుద్ధ చిత్తమును గాంచెన్ దేవి, చిన్నాంబ, యీ
తనువేమైన భయంబు లేదను మనోదార్ఢ్యంబుఁ గాంచెం, దుదిం,
జని బ్రహ్మంబున నైక్యమయ్యెనన నాశ్చర్యంబు లేదింతయున్. 19

ఉ. నిర్మల చిత్తవృత్తిని గనెం గలకాంక్షలఁ బూర్తిసేయుటం ;
గర్మవశంబున న్మిగులు కష్టములం బరిపూర్తి నందె, స
ద్ధర్మములన్ రచించెఁ ద్వరితంబుగఁ దృప్తిని గాంచె నన్నిటం ;
గూర్మిఁదరించె నౌననుటకున్ మది సందియ మేలకల్గెడున్. 20

గీ. పూర్వ కర్మానుభవములఁ బూర్తిజేసె ;
ముందుజన్మకు దుష్కర్మములను జేయ
లేదు, నిర్దుష్ట జీవ నిర్లిప్తతఁ గనెఁ ;
జిన్నమాంబిక ముక్తినార్జించె నిటులు. 21

క. చిన్నమ్మయందు లోపము
నెన్ని ప్రదర్శింపఁగల్గునే ! ధర నెవఁడున్ ;
సన్నుతికిఁబాత్రి, లక్ష్మీ
సన్నిభ, గుణనిధి, శుభాంగి, సాధ్వీమణి యా. 22

ఉ. ఈకలికాలకాంత లమితేచ్ఛల భర్తల ద్రవ్యసంపదా
నీకము లార్థికంబుగ గుణించి వశంబొనరించుకొందు ర
స్తోకము ; చిన్నమాంబిక త్రిశుద్ధిగ నెన్నఁడుఁగానుఁజేతితోఁ
దాఁకియెఱుంగ; దద్ది ఘనతం బ్రకటింపదె విశ్వసించినన్. 23

చ. వితరణశీల చిన్నమ, పవిత్ర విరాళములన్ ధరన్
చితముగ నిచ్చెఁ దాను బరిశీలనఁ జేసి సమస్తసంస్థలం;
బ్రతిదిన మొందఁజో యెడియొ భవ్య శుభంబని వేడఁదా ననా
హతముగ సత్కరించి వినయంబునఁ దృప్తి ఘటించి పంపదే! 24

చ. పురముల నార్థికస్థితు లపూర్వముగా నెసలొందు, నందుఁగా
పురములఁ జేయువారికని పొక్కడి చిన్నమకిష్ట పార్వతీ
పురములభించె, సద్గుణ విభూషిత యాటను; జాల పుణ్యస
త్పురములఁ గాంచి దివ్య సురభోగములంది తరించుఁ గావుతన్. 25

మ. భగవన్నామ మనుక్షణంబు రసనోర్ధ్వప్రాంతమందాడుచుం
డఁగఁ జిన్నాంబిక జన్మనంతయు నిరాడంబంబుగాఁ బుచ్చె నీ
జగతిం; గేవల మాత్మశుద్ధికది ప్రాశస్త్యంబునుం గూర్చె; స్వాం
తగతం బౌటను దన్మయత్వమును సాధ్యంబయ్యె; భవ్యంబెయగా. 26

ఉ. దేవుని సన్నిధానమునఁ దృప్తిఁ బ్రశస్త సమస్త భాగ్యముల్,
దేవి! మహాప్రసాదముగతిం జెయిఁ జిక్కను గాదె! నీకు సం
భావన కల్గెనోఁ బరమ పావన భూస్థల జీవనంబుచేఁ ;
దావలమంది ముక్తిఁగను; ధన్యవు, సత్సతి! చిన్నమాంబరో! 27

గీ. భూత సముదాయ సంపద్విభూతి ధరణి
వ్యక్తిగతమై స్థితప్రజ్ఞ వరలఁ జేయు;
సంఘబలిమియె వ్యక్తుల శక్తియగుచు;
జిన్నమ వచించునిట్లు ప్రక్షిప్తముగను. 28

ఉ. చిన్నమ! చిన్నమా! పిలుతుఁ జిన్నమ! చిన్నమ! రమ్మ చిన్నమా
చిన్నమ! చిన్నమా! పలుకు, చిన్నమ, చిన్నమ' పల్కు చిన్నమా!
చిన్నమ! చిన్నమా! కనుము, చిన్నమ! చిన్నమ! కన్మ చిన్నమా!
చిన్నమ! చిన్నమా! ప్రకృతిచిహ్నమ! చిన్నమ! చిన్న చిన్నమా! 29

ఉ. చిన్నమ పున్నె మెన్నఁగల శేముషి నాకిల నెన్నఁడైన సం
ఛన్నము గాకయున్న యెడ, జన్నవులన్నియుఁ గ్రన్నఁజేసి న
ల్లెన్నెద, నన్నుమిన్న గుణ మెన్నెదఁ, దిన్నఁగఁజెన్నుమీఱె న
త్యున్నతి ; వెన్నదొంగసతి కున్నవె ? చిన్నమకున్న యున్నతుల్. 30

చ. పొలఁతి బృహస్పతిం గెలుచు బుద్ధిని, మించిన సంపదన్ సిరిన్
గెలుచును, శారదం గెలుచుఁ గీర్తిని, గర్ణుని గెల్చు దాతృతం,
జెలువమునన్ రతిన్ గెలుచుఁ, జిత్తవిశుద్ధిని గెల్చుఁబార్వతిం ;
దులనిడఁ జిన్నమాంబికకుఁ దూగరు స్త్రీపురుషాళు లెవ్వరున్. 31

ఉ. అన్నముఁబెట్టు, వస్త్రముల నర్థులకిచ్చు, ధనంబునిచ్చుఁగా
ర్యోన్నతినెంచి, విద్యలకునో సముహార్చు సమస్తముం, బరా
కన్నది లేను, స్త్రీలకు సహాయమ్ము చేయుచు యుక్తరీతిగాఁ,
జిన్నమదేవి యోగ్యత వచింపఁగ శేషునకైన శక్యమే ! 32

ఉ. రక్షణశక్తి యీసతి పరంబుగనుండి ప్రతిక్షణంబుఁ బ్ర
త్యక్షమగుం బరాత్పరు సుదర్శన చక్రముభాతి, దీనసం
రక్షణదీక్ష నక్షయతరం బొనరింపఁగ మేటిదేవతా
వృక్షము చిన్నమాంబ, కృతకృత్యులఁజేయఁగ నర్థికోటులన్. 33

ఉ. వృద్ధుఁడు భార్యవోవ నవివేకముగా నిటు లేడ్వఁగూడదే
ప్రొద్దు నటంచు కొందఱు ప్రబుద్ధులు, మానవ శుద్ధ తత్త్వ సం
బద్ధులుగారు వారని ధ్రువంబుగఁజెప్పితిఁ జిన్నమాంబ ! నీ
శుద్ధ హృదంతరాళ పరిశోధన చిక్కునె! లౌకికాళికిన్. 34

గీ. రాగమునుజూపు సంగీత రాగములను ;
భోగములఁగోరు సకల వైభోగములను,
యోగమునుబూను నిల సముద్యోగములను,
రాగ భోగ యోగ సమితి రాణి ధరణి. 35

గీ. చిన్నమాదేవి చిన్నమ్మ, స్థిరజనించి,
లోక సౌభాగ్యమును గూర్చి, నాకమునకు
రాజయోగినివలెను విరక్తిఁజెంది
వెడలిపోయెను దివిని దీపించుకొఱకు
భగవదవతార మూర్తుల పగిది రాణి. 36

ఉ. తామసమన్న నెట్టిదియొ? తన్వి యెఱుంగదు, సత్త్వమూర్తి, సా
ధ్వీమణి చిన్నమాంబ; ప్రభవించిన సద్గుణ పుంజ, మాత్మ సౌ
దామినియేయగుం, బ్రకృతి ధర్మములం బ్రహసించిమించె నీ
రామ పరోపకార బుధరంజన దీక్ష వహించె సర్వదా! 37

ఉ. భూతదయన్ శమింపదు, ప్రభుత్వముఁ జూపదు నిస్వులందుఁ, దీ
వ్రాతపశాంతి దీనులకు, యాచకపాళికిఁ గల్పవృక్షమా,
భూతల జీవనంబుఁ దెలుపుం బతిభక్తిని, ధర్మమూర్తి, సా
ధ్వీతిలకంబు, చిన్నమ సతీమణి, యన్నులమిన్న కాదొకో! 38

చ. గుణగణమెల్లఁ జిన్నమను గొల్చు ననన్యశరణ్యమంచు, నా
గణుతి నటుండనిండు, త్రిజగంబుల లోపము నెంచఁదగ్గ కా
రణమును జూపఁజాలిన ధురంధరుఁడొక్కఁడు కానరాఁడిలం,
బ్రణతులొనర్తురెల్లరుఁ, దిరంబుగ నాసతి కీర్తి చాలదే! 39

ఉ. ద్వీపములెల్లదాఁటి పృథివీస్థలిఁ బశ్చిమ ఖండవాసులం
దేపువహించెఁ, జిన్నమ యహీన గుణ ప్రతిభాతరంగముల్;
వ్యాపకమయ్యె భారత సువర్ణమునందన నబ్బురంబె? సా
ధ్వీపతినైతి నద్ది పృథివీపతి నొటకు మిన్నయౌఁగదా! 40

శా. చిన్నాంబా! నినుబాసి చింతల గృహచ్ఛిద్రింబులం జిక్కుటన్
ఛన్నంబయ్యె మదీయ మానస వికాసంబంతయున్, జీవితం
బన్నన్ వ్యగ్రితదోఁచె, లౌకికమునం దాసక్తియున్వీడె, నా
కన్నంబేటికి? విందులేటికి? దుదం బ్రాణంబు లింకేటికిన్ 41

గీ. ఘనులు నీచులు నొక్కెడఁ గలిసియున్న
నతుక దాపొత్తు క్షణములోఁ జితికిపోవు,
పికముఁ గాకము నొకగూటఁ బెరిగి తుదకు
విరుగునెడ కాకికాకియె, పికము పికమె. 42

మ. రథచక్రద్వయ మేకరీతిఁదిరుగన్ రమ్యంబగున్ యాన స
ద్విధి, యందొక్కటి గ్రుంగ నిల్చు; గమనోద్వేగం బసాధ్యంబు; సా
రథియున్, రథ్యము లప్రయోజనములై ప్రధ్వంసమౌ, స్త్రీయ స
న్మిథునం బిట్లెడఁబాయ సంసృతినెటుల్ మెప్పింతునో చిన్నమా! 43

చ. సుతుఁడుగతించుటాది శుభశోభనముల్ గన పేరటంబుకై
సతిచనలేను, దుఃఖవివశంబున సంతముఁజందదక్క, నీ
స్థితిఁగనిబంధువుల్ మిగులఁ జింతిలి యాదృతిఁజూచిరెప్డు, డ
ద్భుతమగు నీసతీ హృదయ పూరిత తత్త్వము నెంచిచూడినన్. 44

ఉ. మీసము పౌరుషంబునకు మేలగుచిహ్నము పూరుషాళికిన్;
వాసిదొరంగ మీసమెడబాసి వసించుట యోగ్యమౌటచేఁ
జేసితి నేనునట్లె; తరుణీ విరహస్థితి శ్మశ్రు చిహ్నముం
దీసి విమాపినైతి; ధరణిన్ మృతితుల్యముగాఁ దలంచెదన్. 45

మ. సతిసావిత్రి స్వజీవితార్థమును స్వేచ్ఛన్ భర్తకర్పించె, నా
గతిఁ జిన్నాంబయు నన్నుదేల్చె; నటులేఁ గావింపలేనైతి ను
ద్ధతి, దుఃఖంబులఁజిక్కి పామరులపంథన్ గ్రుక్కితిన్; బాపురే!
సతులే సాహసికల్ ధరం, బురుషు లెంచన్ దీటుగా రెంమగన్. 46

గీ. సూర్యుఁ డుదయాస్తమయములఁ జొచ్చు రీతి
జీవుఁ డుత్పత్తి లయములఁ జెందుచుండు;
నిత్య నైమిత్తికమువంటి నియతి యిద్ది,
చిన్నమా! చిద్విలాస వైచిత్ర్య మిదియె. 47

గీ. ఆది మధ్యాంత రహితమై యలరు దైవ
లీలల విధినిషేధము లేలపొసఁగు?
రెంటికి నతీతుఁడగును విరించి, చిన్న
మాంబ! కర్తయు భోక్తయు నగు నతండె. 48

గీ. రెండు ఱెక్కలు దండిగ నుండుపక్షి
యాకసంబున విహరించు నద్భుతముగఁ;
బక్షవిక్షేపమున నేలఁబడు; నటులనె
దంపతుల సంసృతియు నిలఁ దనరుఁగాదె! 49

గీ. జీవ పరమాత్మ లొక్కెడఁ జేరి నపుడు
వ్యక్తి గతమగు, విడిపోవఁ బ్రళయమగును;
సతియుఁ బతియును జేర సంసార మగును;
బ్రకృతి పురుషుల సృష్టి వైభవము పగిది. 50

గీ. కాలచక్ర విభ్రమణ సంఘర్షణమున
శశియు వృద్ధిక్షయములకు వశుఁడు; కాల
కర్మవశమున జీవాత్మ గాంచు జనన
మరణములఁ జిన్నమా! సృష్టి మర్మ మిదియె. 51

గీ. కష్టసుఖములు రథచక్ర గతులఁబోలె,
దర్శ పూర్ణిమలను బోలెఁ, దథ్యముగను
ముందువెనుకలఁ బరివర్త మొందుచుండు
విధి విధానము సరికట్టు విబుధులెవరు! 52

చ. పరిణయమాది, జీవమెడబాసెడి యంతను భర్త దైవమన్
సురుచిర భక్తి మర్కట కిశోరవిధి న్నను హత్తియుండె, ను
ర్వర సతి చిన్నమాంబ; తన వ్యక్తిని లీనముఁ జేసె నీగతిన్;
వరలునె పుణ్యపాపముల వాసన లిట్టి పవిత్ర జీవికిన్. 53

చ. వినయము, సాధువర్తనము, విశ్రుత మంజుల వాక్ప్రచారమున్,
సునిశిత సత్యసంధతయు, శుద్ధచరిత్రము, సాధుసజ్జనా
వన ఘనదీక్ష, బంధుజన వత్సలతంగని, చిన్నమాంబ జీ
వనమును నింపి ధారుణి, దివంబును జేరెను ధన్యయౌంగదా! 54

చ. పెనిమిటి సంప్రతింపక భువిం దలపెట్టవు చిన్నకార్యమై
నను, బరలోక యాత్రను క్షణంబున స్వేచ్ఛగఁ జేసితీవు, నా
యనుమతి నందలేదు, ప్రణయంబున కియ్యది హాని, చిన్నమా!
క్షణము యుగంబుగాఁ జరిపి చయ్యన వచ్చెద నీదు చెంతకున్. 55

ఉ. బంధువు లెవ్వరైనను దివంగతులౌనెడ దుఃఖహేతువౌ,
నంతను దంపతీ ద్వయముఁ దోకరిల్గిన నున్నవారు జా
త్యంధులఁబోలె జీవితము నంతను దుర్గతిఁ బుచ్చుచే యగుఙ్ ;
వందనము ల్మహేశుని ఘనంబగు సృష్టివిధాన శక్తికిన్. 56

ఉ. మొత్తముమీఁద సృష్టివిధముంగన స్రష్టకు జ్ఞానపూర్ణ సం
పత్తి ఫలింపనేరదు ; స్వభావమొ? దైవమొ? నాస్తికంబొ! యే
పెత్తనమైననేమి? పదవి చ్యుతి గల్గె, రసంబువీగె, స
ర్వోత్తమ శక్తి యన్న బిరుదూడెను, జిన్నమ! యేమిచేయనౌ! 57

గీ. సృష్టి నిర్దుష్టమనుమాట భ్రష్టమయ్యె,
స్రష్ట సర్వజ్ఞుఁడును సర్వశక్తిమంతుఁ
డనఁగఁ జెల్లదు ; మనపాట్లు చన వెటులును ;
జిన్నమా! చిత్త విశ్రాంతిఁ జెందు మెపుడు. 58

గీ. భర్తయేలోకమున కేగు, భార్యయు నట
కేగునని వేదములుచెప్పు ; నిపుడునీవు
స్వర్గమున కేగితివి; నే నసర్గళముగ
నచటికరుదెంతుఁ దారుమారు అగుట, దేవి! 59

గీ. ధరసతీపతుల్ ప్రణయ తత్పరత నైక్య
మైన మిథునము విడఁదీయ నలవియగునె
ధాత కైనను వానిపై నేత కయినఁ
జావుబ్రదుకుల మనకుఁ బ్రసక్తిలేదు. 60

గీ. వసుధ వైవాహికాది సంబంధవిధులు
గనఁ, బరస్పరసౌఖ్యార్థ మనఁగఁజెల్లు;
మానసికమగు ప్రేమ కే స్థానమగునొ ?
దైహికముకాదు, జీవతత్త్వమగు; దేవి ! 61

ఉ. జీవుఁడు శాశ్వతప్రతిభఁజెందినఁ బ్రేమయు సుస్థిరంబగున్ ;
దేవి ! శరీరపాతమున దేహినశించిన శూన్యమౌఁగదా !
దైవవిధాన మీద్వితయ ధర్మములందెటులున్న మేలెయౌఁ ;
గేవలనాస్తికంబో ? పరికింపఁగ శాశ్వతమైత్రియో ? యగున్. 62

గీ. చీఁకటియుఁ గాంతి యొకచోటఁ జేర నటులు;
జాలియును దుష్టశిక్షయు సాగవొకటఁ
జిన్నమను రెండుగుణములు సేవజేసెఁ,
బులులమేకలఁ ద్రావించె జలము నొకట. 63

గీ. నేత్రములు రెండునుంగూడి నిశ్చలముగఁ
జూచు, శ్రోత్రములాలకించు, నటువలెనె
దంపతులుజేర సంసారధర్మమగును,
జిన్నమా ! విడిపోవ విచ్ఛిన్నమగును. 64

# 5. జీవితాభ్యుదయము

గీ. కరుణారసముసఁబడిన లోకమును నింపఁ
గలను, బాలకులకది వ్యగ్రితగనుండుఁ
గాన నిఁక నిల్పి నేను సాకల్యముగను
నీ కథామృత గానంబు నేనొనర్తు. 1

క. పుట్టెను దొడ్డమపేటను
మెట్టెను హేలాపురంబు, మేటిగ బ్రతికెన్
గిట్టెను జెన్నపురంబునఁ
గట్టా! విధిచైవులవి యఖండములు గదా! 2

క. పదితొమ్మిది వందల ము
ప్పది యెనిమిది యైనయేటఁబరగఁగ నేప్రెల్
పదుమూఁడవ వాసరమున
సదమలమతిఁ జిన్నమాంబ స్వర్గముఁజేరెన్. 3

గీ. సప్త సంతానములఁ గాంచి సాధ్వి ధరణి
సప్త సంతానములను బ్రసక్తిఁ గనియె ;
సాధుజన కల్పవృక్ష మపాధి విడిచి
చిన్నమాదేవి త్రిదివంబుఁ గన్న దబల. 4

గీ. ద్వాదశాపత్యములఁ గాంచెఁ దన్వి; పుత్రి
కలను ద్వాదశాపత్యంబుల లలిఁ గనిరి,
సిరియు సంపత్తి పూర్ణమై చెలఁగుచుండఁ
దృప్తినంది చిన్నమ తాగతించె దివికి. 5



రాజదంపతులు, బిడ్డలు,

రాణీ వయస్సు 45 ఏండ్లు.

మ. పతికంటెన్మునుమున్న స్వర్గతిని బోవంజెల్లు పుణ్యాంగనా
తతి యంచార్యులు వల్కువాక్యములఁ జిత్తంబందు హత్తించి, యీ
సతి చిన్నాంబిక దారివట్టె దివికిన్ సౌకర్యమున్ భర్తకున్
సుతునింగూడి రచింప; ధన్యులుగదా! సుశ్లోకు లెల్లప్పుడున్. 6

మ. పతియే దైవమటంచు నెమ్మదిని సంభావించి, పుణ్యాంగనా
తతి నాదర్శముగా గ్రహించి, సతతోత్సాహంబునం దద్గతుల్
కృతకృత్యంబుగఁ జిన్నమాంబ వ్రతపూర్తిం జేసె జన్మాంతమున్;
నుతిసేయంజనదే మహాజనులు మాన్యుల్ స్వర్గపర్యంతమున్. 7

మ. విలస ద్రాజకుటుంబమందెలమి నావిర్భూతముంగాంచి, ని
ర్మలమౌ రాజకుటుంబమం దఖిలమౌ రక్తిన్ వధూత్వంబు రం
జిల, సత్సంతతిఁగాంచి, యర్ధశత సంకీర్ణాబ్దముల్ రాణివా
స లసద్భాగములంది, స్వర్గపురవాసంబందెఁ జిన్నాంబయున్. 8

చ. స్థిరమతి నేఁబ దబ్దము లతీతముగా గృహపాలనంబు ని
బ్బరముగఁజేసి, సంతతి నపారముగాఁ గనిపెంచి, బాంధవ
స్మరణయు, సాధుసజ్జన సుసంగతి, సేవకవర్గ పోషణం
బరిమురిజేసి స్వర్గము రయంబునఁ జిన్నమదేవి చెందెహా! 9

చ. అనయము నాత్మవల్లభునియం దనురక్తియు, సత్ప్రపత్తియున్,
ఘనతర భక్తియుం, గలిగి, నర్మిలి నింపుగఁ బాదసేవలన్
వినయవిధేయయై సలిపి, పిమ్మటఁ దాశయనించు నిత్యముం,
దన కిల భర్త దైవమను తత్వము చిన్నమ విశ్వసించుటన్. 10

మ. చిరకాలంబుగ సాహచర్యమున వాసింగాంచి, సత్సంతతిన్
వరలంజేసిన ప్రేమమూర్తి, సకలోపాయంబులన్ భర్తృ సు
స్థిర సౌఖ్యంబుల సంతరించు సుర సాధ్వీరత్నమైనట్టి, మా
వరచిన్నాంబిక మమ్మువీడి సుమనోవారంబునం జేరెహా! 11

క. పాతివ్రత్య మహత్త్వము
చేతఁ దృఢభక్తి గలిగి, సిరి, సంపదలు
ద్యోతితములగు నటంచును
జేతంబునఁ జిన్నమాంబ చెందు ముదంబున్. 12

శా. పాతివ్రత్య విధాన సంఘటన శుంభత్ప్రక్రియాసక్తి వి
ఖ్యాతిం బేర్కొన నగ్రిగణ్యయగు నీకాంతాశిరోరత్న, మా
రా! తప్పౌనొకొ? భర్తృవాక్యమిది తా రక్షణంబు గానోపదో?
పూతాచారిణి సత్యమంచు మది మెప్పుంగూర్తు లోకంబునన్. 13

మ. చిరకాలంబు పతివ్రతాదర్శమ వాసింగాంచె, సత్సంతతిన్
ధర దౌహిత్రులఁ గాంచె, నెప్డుఁ బరమౌదార్యంబు పెంపొంద, నె
ల్లర బంధుప్రతతిన్, సుమిత్రతతి, నుల్లాసంబుగా సాకెఁ, దా
నరిషడ్వర్గములం జయించినది బాహ్యాభ్యంతర స్ఫూర్తిగన్. 14

ఉ. వాయన మిచ్చిపుచ్చుకొను పద్ధతిగాఁ గొని యర్ధరాజ్య ముం
బ్రేయసి తిర్గియిచ్చెఁ దనివింగని; యియ్యది యర్ధ దేహ మా
ప్యాయత భర్తకిచ్చి, కొనుపద్ధతి సాదృశమై తనర్చె; నౌ
రా! యిలఁ జిన్నమాంబ కల యార్యయె సాటి తలంచిచూచినన్. 15

గీ. సతులుఁబతులును సుఖదుఃఖ వితతులందుఁ
దుల్యభాగంబు లనుభవింతురఁట భువిని;
సౌఖ్యములనెల్ల భర్తకు సంతరించి
కష్టములనెల్లఁ జిన్నాంబ తుష్టిఁగొనియె. 16

గీ. సతుల పాపములంటును బతుల కెపుడుఁ
బతుల పాపంబు లంటవు సతుల కిలను;
బరమ సద్గుణ సాంద్రయై వరలు కతన
భర్తృ కిల్బిషతతినెల్లఁ బాపె, నీమె. 17

ఉ. సోదర సోదరీ మణులఁ జూచెను బ్రీత్యనురాగ సంపదల్
పాదుకొనంగ; దైవమును బ్రార్థనఁ జేయుచుఁ బుట్టినింటి భా
గ్యోదయ మెల్లవేళల బహూకృతిఁ గోరుచు, ధాత్రిఁ గీర్తికాం
తా దరహాసచంద్రికలఁ దాల్చెను జిన్నమదేవి, ఠీవిగన్. 18

మ. పరులం బిడ్డలఁ దుల్యరీతిగను సంభావించు నైపుణ్య మీ
వరనారీమణికే పొసంగుఁగద! సంభావ్యంబుగా నేడ్తెఱం
బరివారంబును సాకు నేర్పులమై వర్ధిల్లె; నెవ్వానినేన్
బరుషోక్తిం దురితంబుగాఁ బలుక నైనంగాన మెప్పట్టునన్. 19

చ. పరిజనులందుఁ బ్రేముడి నపారముగాఁ బ్రసరింపఁ జేయు నీ
తరుణి సుశీల బిడ్డలవిధంబునఁ బాలనఁ జేసె, కాలమున్
గరగరికన్ విడంబనముగా వృధసేయక, దైవభక్తి త
త్పరయయి, సేవకాళులను దద్దయుఁ జిన్నమసాకె నేర్పునన్. 20

మ. సిరిసంపత్తిని మేటినైతినను వాసింగాంచి గర్వింప, కు
ర్వర బంధువ్రజమున్ సమానగతి సంభావించెఁ నెల్లప్పుడుం;
బరుసంబుల్ పలుకంగనోడెఁ దరణోపాయంపు సత్కార్యముల్
వరుసం జేసెను జిన్నమాంబ దురితవ్యాపార దూరంబుగన్. 21

ఉ. ఆభరణప్రియల్ సుదతులన్న ప్రవాదము మిథ్యయంచు నీ
శోభనగాత్రి చాటెఁ దనసొమ్ముల నెల్లను బుత్రికాళికిం
బ్రాభవమొప్పఁ బంచియిడి రంజిలె నెన్నఁడొ వేఱువేఱ; నా
వైభవమెల్ల నాత్మవిభవంబుగఁ జిన్నమరాణి యెంచుచున్. 22

ఉ. తల్లులుపంచతం గన సుతల్ గల యాభరణంబులన్ ధరం
జల్లఁగఁ బంచుకొందురు ఘనంబుగ; నయ్యదిలోకరీతి, యీ
తల్లిగతింపఁ బుత్రికలు తాలిమిఁ దూలుటయే ఫలంబుగాఁ
జెల్లెను, దల్లివస్తువు లశేషము పూర్వమె పంచియిచ్చుటన్. 23

ఉ. పెట్టెలుఁ దాళముల్ సతికి వేఱుగ నెన్నఁడు లేవు, ధాత్రిపైఁ
బుట్టములుం గలాపములుఁ బొల్పుగ లేవు ; సుతాళి యిచ్చుటే ;
మట్టెలు నల్లపూసలును మంగళసూత్రముఁ దక్క సొమ్ములిం
కెట్టివి లేవు దేహమున నింతి మృతింగని నప్పుడద్దిరా ! 24

చ. కసరదు సేవకుల్ సలుపు కార్యములన్ దొసఁగు ల్పొసంగినన్,
విసువక మంచిమాటలను వేమరు దిద్ది గడంగుఁ, బెన్ దయా
రసము హృదంతరాళమున రాపిడి వెట్టఁగ నోర్పుఁ జెందు, సం
తసమునఁ జిన్నమాంబ వసుధం దులలేనిదగుం దలంపఁగన్. 25

చ. మనుమలు మన్మరాండ్రు విషమంబుగ నల్లరి నెంత జేసినన్
మనమునఁ గిన్కఁ జెందదు, క్షమం దగు శిక్షయొనర్చుఁ బ్రీతిమైఁ;
దనయులు, గానివారలను, దత్వము నెంచక తుల్యరీతిగాఁ
దనుపురు ; సర్వసాక్షియగు దైవమె చేతనమంచు నెంచుచున్. 26

మ. కలనైనం దలపోయ దేరికిఁ బ్రతీకారంబు నెప్పట్టునన్,
ఫలితార్థంబుగఁ ద్వేషభావముల నుత్పాటించు నేవేళలన్,
విలపించున్ దురితంబుల న్వినన మదిన్ భీతిల్లి, చిన్నాంబకుం
దుల యెవ్వారును లేరు భూతలమునందుం జాల గాలించినన్. 27

క. నోముల వ్రతముల నీసతి
కామితఫలసిద్ధినందఁ గాఁదలఁపక యే
నీమమునఁ జేయుఁ బండిత
పామర జనరంజకముగఁ బరమ ప్రీతిన్. 28

చ. విరివిగ ధర్మకార్యములఁ బ్రీతిరచించితి వెన్నియెన్నియో ?
పరమపతివ్రతామణివి, పాపమెఱుంగవు స్వప్నమందునన్,
సిరులను నోలలాడితివి, నిర్మల సంతతిఁ దుష్టిఁగాంచి తీ
వరయఁగఁ జిన్నమాంబవె, ధరామర పూజ్యవు, ముక్తిఁగాంచుమీ! 29

చ అనుదిన మెందఱో మృతికి నాహుతియౌదురు, వారిబంధువుల్
మనములఁ జింతనందియుఁ గ్రమంబుగ విస్మృతిఁగాంతు ; రీయశో
ధనులగు వారి జీవితము ధన్యము సంస్మరణీయమై తగున్ ;
గుణనిధి చిన్నమాంబిక, తగున్ మృతజీవులఁ జేర్ప నిద్ధరన్. 30

చ. విని కని నట్టివారలకు వీనులుఁ గన్నులు సర్వకాలమున్
విని కనుచున్నరీతిగనె విభ్రమఁ గొల్పుచునుండు, నీసతీ
వినయము వినమ్ర వర్తన లభేద్యములౌటను, గాంచి విస్మృతిం
గనుట యసంభవంబు చిరకాలము చిన్నమదేవి నెవ్వరున్. 31

గీ. రూపలావణ్యముల సుస్వరూప వగుట,
సకల సద్గుణ సాంద్ర భూషణము వగుటఁ,
గాంతవైనను నిను ముక్తికాంత వలచెఁ
జిన్నమాదేవి ! నీవన్నె నెన్న వశమె ! 32

గీ. కీర్తి మూర్తీభవించి సంకీర్ణ మగుట
వలనఁ, గనువారి దృక్పథ ప్రసరణములు
సంచరించవు నీ రూపసమితిమీఁద ;
నెన్న సౌందర్యరాశివి చిన్నమాంబ ! 33

గీ. పొలఁతి గుణరూపముల కిలఁ బొత్తుగలియ
దందు, రదికల్ల యనిపించి తబల ! నీవు ;
రూపమున నార్యవు, గుణనిరూఢి శచిని,
వన్నె మరపించితివి గద ! చిన్నరాణి ! 34

గీ. ఆంగ్ల యువతుల సహవాస మలరఁ జేసి
హైంద వాదర్శముల నందుఁ బొందుపఱచి,
సామరస్యంబుఁ బ్రకటింపఁ జాలినావు
చిన్నరాణివి, నీసాటి చెలులు గలరె ? 35

ఉ. కమ్మని పల్కు తేనెలఁ జొకాటముగాఁ బ్రసరింపఁజేయు, వా
క్యమ్ముల వెజ్జిపోకడల నంటగనీయను, సత్యశీలయై
నెమ్మదిఁ బారమార్థిక వినిశ్చలవృత్తుల నాత్మ తత్త్వమున్
నమ్మి చరించు సాధ్వి, కరుణానిధి, చిన్నమయార్యఁ దిశుద్ధిగన్. 36

గీ. భూ నభోంతరములఁ గీర్తి పొంగి పొరలఁ
జేసితివి ; నిన్ను దూషణసేయువార
లొక్కరైనను లేరని నిక్కమంబు,
చిన్నమాదేవి ! నీభాగ్యమెన్నఁ దరమె ? 37

గీ. మచ్చుఁ జూపుట కొకరైన మహిని జిన్న
మాంబ సేగి చేసెనని యనెడు వారు
లేరు, శపథంబుసేతు, నిలింపు లెల్ల
మెచ్చి సాయుజ్యమిచ్చి రీ సచ్చరితకు. 38

గీ. దొడ్డ యిల్లాలు చిన్నమ్మ ధూర్తగాదు,
మేలుచేసెను బ్రజల కమేయముగ, స
నాతనాథునాత్మప్రీతి భూతలమున
నని పొగడు చుండి రెల్లరుఁ దనివిదీర. 39

గీ. బ్రదికి యుండిన వేళ నెవ్వరును నిజముఁ
బలుక నెరతురు, చచ్చినఁ బలుకుదు రిల
మంచిచెడ్డలఁ, జిన్నమ్మమాటఁ దలఁప
నెల్లరును గొనియాడి రుత్ఫుల్లగతుల. 40

క. జనవాక్యము కర్తవ్యము
గను నను నార్యోక్తి నిజము, గావున ధరణిన్
మన చిన్నమ సాయుజ్యముఁ
గనె నని ధ్రువపరుపఁగలము గాదే ! ద్రోషిమన్. 41

క. పూర్వాచారపరాయణ
సర్వోత్తమగతుల నడచు సాధ్వీమణియై
పూర్వోత్తర సందర్భము
లుర్విం జిన్నమ్మ నిల్ప నోపెను గాదే! 42

ఉ. ఆమయపీడనందుచు భయంకర దుస్థితి నే వసింప, సా
ధ్వీమణి వైద్యరత్నమును బిల్చి, సహోదర! బావగారికై
నీమది భీతిఁ జెందకుము, నేనిలనుండఁగ వారి కాపరం
ధాముఁడు లోటుసేయఁడని ధైర్యముఁ జెప్పెను జిత్తశుద్ధిగన్. 43

ఉ. బంధుగు లందఱుం గలిసివచ్చి, భయాకుల మానసంబులన్
వందురుచుండఁ, జిన్నమ—"సువాసిని నెప్పఁగ రాజుగారి కి
బ్బంది రవంత సోక"—దని వారల కార్తిఁదొలంచి ధైర్యముం
బొందుపడంగఁజేసె, సతి పుణ్యచరిత్రము నెన్నశక్యమే! 44

క. ఎన్నెన్ని సత్కృతులను మ
హోన్నతిఁ జేసెనో? గణింప నోపము ధరణిం
బున్నెముల మూటగద! మన
చిన్నమ సకలార్థసిద్ధిఁ జెందిన దగుటన్. 45

ఉ. ఆపదవచ్చెనన్నను రయంబున నెవ్వరికేని నాదృతిం
జూపును సాధ్యమైనయెడ, సూనృతవాది దయార్ద్రభావ, వి
జ్ఞాపనఁద్రోసివేయు, దపచారముచేయను శత్రుకోటికేన్
గోపమెఱుంగనట్టి సుమ కోమలి, చిన్నమదేవి యెన్నఁగన్. 46

ఉ. మొత్తముమీఁద దైవముఖముంగన లజ్జను గూర్చుచేష్టలం
జిత్తమునన్ స్మరింప, దటుచేసెడు వారలు బిడ్డలైనఁ బ్ర
త్యుత్తరమిచ్చుఁ దీవ్రముగ; నోడు వినం బయి దుష్ప్రచార, మీ
యుత్తమసాధ్వి చిన్నమ మహోజ్జ్వలమూర్తి యనంగఁజెల్లదే! 47

గీ. కీర్తికాముల జీవ మక్షీణమగుటఁ
గీర్తిశేషులగుదురు ప్రక్షిప్తముగను;
జగతి నిల్చురు వేఱు సంశయము లేదు;
చిన్నమాదేవి వీరిలోఁ జేరె ధ్రువము. 48

గీ. ప్రతిగృహంబును గృహలక్ష్మి క్షితిని విడువఁ
జితికిపోవును; సంసార మతుక దింకఁ;
జిన్నమాదేవి దివికేగ మన్నివాస
శోభ చెడిపోయె, రాదు త్రిశుద్ధిగ నిఁక. 49

గీ. చిన్న పుట్టింటి కేగినదన్న భ్రమత
గలుగు; దివి జీవి పుట్టిల్లుగాదె! తలఁప;
వచ్చి యిచ్చటి ముచ్చట లిచ్చఁగాంచి
తిరిగిపోయెను ప్రస్థాన మగుపగిది. 50

గీ. ధరఁ బునర్జన్మఁ గాంచదీ పరమసాధ్వి;
వర పతివ్రత యగుటను బరులఁ జెట్ట
బట్టనొల్లదు, భర్త కింకెట్టి జన్మ
కలుగదని చిన్నరాణికిఁ దెలియుఁగాన. 51

గీ. నిలిచినను గూరుచుండిన నిద్రఁగనినఁ
బలుకుచున్నను నేపని సలుపుచున్నఁ
జిత్తము పరాత్పరునిమీఁద హత్తఁజేసి
చిన్నమాదేవి సిద్ధిని జెందె నిజము. 52

గీ. చిన్నరాణికి దైవము సిద్ధిఁగూర్ప
కున్నఁ బృథ్వి నెల్లరకును సున్నజుట్టు
నని దృఢంబుగఁ బల్కు సాహసమొనర్తు
సకల సద్గుణ సాంద్ర యీసాధ్విగాన. 53

గీ. దైవ నామస్మరణ చిన్నదేవి సలుప
నింటి వాసములకుఁ జుట్టి యంటుకొనియె
ముమ్మరముగాఁగ ; ముక్తి యీ పుణ్యవతికె
చిక్కకుండినఁ బరుల కిం కెక్కడి గతి ! 54

క. సిరియును రూపము గుణములుఁ
బరిపాటిగ నొక్కయువతి పట్టున నెపుడుఁ
వరలవని పెద్దలందురు
తరుణీమణి యీమె దానిఁ దప్పఁగఁ జేసెన్. 55

గీ. వేదమూర్తులుఁ, బండితుల్ వినుతయతులుఁ,
గవి శిఖామణు లంద ఱుత్కంఠతోడ
సలుపు నాశీస్సులన్నియు సమసి పోయెఁ
జిన్నదేహంబు పృథ్వి నశించు కతన. 56

గీ. కవుల వాక్ప్రభావము లనర్గళములైన
మిత్తి మాయింటఁ జేరి వేటెత్తఁగలదె ?
యిన్ని యాశీస్సు లందిన చిన్నరాణి
సురపురికి దారివట్టెఁ బ్రస్తుతి గడింప. 57

గీ. వత్సరశతంబు జీవించవచ్చు నీవు
వచ్చిన పనిని సగములోపలనె పూర్తి
చేసి, విజయంబుఁ గాంచి, ప్రసిద్ధి వడసి
దివికిఁబోతివి, చిన్నమ్మ ! దివ్యచరిత ! 58

గీ. నిష్ప్రయోజనమూర్తులు దుష్ప్రవర్త
నములఁ జిరజీవు లౌదురు, న్యాయమూర్తు
లంతరింతురు సౌభాగ్య మలముకొనఁగ
బ్రజల దురదృష్ట మిదియన వచ్చుఁగాదె ! 59

గీ. ధరఁ గుశాగ్రబుద్ధులు తమతమ పనులను
క్షణములోఁ బూర్తిగావింపఁ గల, రటులుగ
జీవవిధు లర్ధశతముఁ జేసి, తృప్తిఁ
గాంచి దివికేగెఁ జిన్నమ్మ ఘనతమీఱ. 60

గీ. పాప ముత్కృష్టమై పరిపక్వముఁగన
ధరణిఁ జిరజీవులగుదు రధర్మపరులు ;
ధర్మపరు లల్పజీవులై తనువు విడిచి
ప్రిమద చిన్నమ్మ వలె ధర్మపదముఁ గంద్రు. 61

క. ఎన్నిక ధర లక్ష్మి సం
పన్నతఁ దులఁదూఁగునట్టి పతిరత యగుటం
జిన్నమ్మ సర్వవిధములఁ
జిన్నమ్మను బోలె ననుట సిద్ధముగాదే ! 62

గీ. చక్రవర్తులు నవతార విక్రములును
మిత్తికెరయైరి ; కీర్తియే మిగిలె ధరణి ;
రూపుమాసినఁ బేరు నిరూఢినందు
యశమును గడించెఁ జిన్నమ్మ విశదముగను. 63

ఉ. క్రన్ననఁ గ్రీస్తు, బుద్ధుఁడు, నఖండ మహమ్మదు, రామ, కృష్ణ, ల
త్యున్నత భోజ, శంకరు, లహోబలుఁ, డార్యయు, నన్నయాది వే
మన్నలుఁ, గృష్ణరాయలు, శుమంగల పూర్వులు, స్వర్గతిం గనం
జిన్నమ వారిసన్నిధికిఁ జేరె, సుపర్వులఁ గాంచు కోరికన్. 64

క. గోషాయన రాణికి సం
తోషము లేకున్నఁ బరులఁ ద్రోసికొని చనన్
రోషముఁ జెందును, సముచిత
వేషంబుల భాషణముల వెలయవలె ననున్. 65

క. సభలకు నుత్సవములకును
విభవంబునఁ జనదు, వేద విశ్రుతిఁ గాంచుం
బ్రభవించిన యార్యయె యన
శుభశోభనములను రాణి శుద్ధిగ మెలఁగున్. 66

చ. పరువడి కార్యభారమున వర్తిలుచుండఁగఁ బెండ్లివార లీ
తరుణిని బోల్పనేరక, స్వతంత్రత వియ్యపురాలుగార లే
వెరవున నుండి రంచడిగి, విభ్రమఁజెందెద రామెఁగాంచి యీ
గరితయె చిన్నమాంబ యన ; గాదిలిబిడ్డల పెండ్లివేళలన్. 67

మ. శుభకార్యంబుల నేదెసంగనిన ప్రజ్యోతించుఁ జిన్నాంబ, స
ర్వభటాళిం దగుసేవలం జొనుపు మర్యాదల్ దగంజేయఁగా
విభుతం జూపదు, కార్యసాధన విధిం బ్రేరేచు రేయింబవల్ ;
ప్రభవప్రజ్ఞ మెలంగు, వైభవము శోభాయుక్తమై వర్ధిలన్. 68

గీ. రాజసములేక, గృహకృత్య రచనయందు
రాణివాసముఁ జూపక, రాత్రిఁ బవలుఁ
దెరిపి విశ్రాంతి యనకయే తిరుగు, రాణి ;
సేవకులకన్న మిన్నగాఁ జేయుపనుల. 69

క. దూషణ కలుగదు చిన్నమ,
భూషణ విని మదిని బొంగి పొరల దొకప్డుం,
బోషణ మాతను మించును,
భాషణముల మార్దవంబుఁ బరపుం గాదే! 70

క. సత్యాసత్య విచక్షణ
మత్యమలము, కొన్నియెడల హానికర మగుం
బ్రత్యహ మిదిగని చిన్నమ
గత్యంతర మిలనుగనక కనలుచు నుండున్. 71

ఉ. భూరి కృపా సముద్ర, పరిపూత మనోహర సచ్చరిత్ర, స
త్సారవిరాజమాన గుణసాంద్ర, సుధామధురోక్తి చంద్రికా
పూర తరాంతరంగ, ఘన భూతదయా మయచిత్త, కీర్తికాం
తా రమణీయ మూర్తి, కరుణానిధి చిన్నమదేవి యుర్వరన్. 72

చ. కలుములు లేములున్, సకల కష్ట సుఖంబులు, మిత్తి చేతిలో
విలయములౌను, దేహ పరివేదనలెల్ల హరించు, దుర్మదాం
ధుల దురితంబులేగు, శివదూతలఁ జేర్చును మృత్యువంతలోఁ;
గలతలఁబాపు మిత్రమను గాఢతరంబుగఁ జిన్నమాంబయున్. 73

గీ. అంత్య దశయందు శ్రద్ధతో నాదరించు
బంధుగులె బంధుగులు, కానివారు నామ
మాత్రు లగుదురు, వారలమాటఁ దలఁపఁ
దగదనును జిన్నరాణి, సందర్భ వశత. 74

గీ. కన్నమూయక రేఁబవళ్ళెన్ని నెలలొ
తల్లి కుపచారములుచేసి తరలు వఱకు
మాతృఋణమును దీర్చె సమంజసముగ
బిడ్డ శ్రీమహాలక్ష్మమ్మ విమల చరిత. 75

గీ. విద్యలను మేటిగాకున్న వినుట వలన
ధర్మశాస్త్ర పురాణోక్త ధర్మములను
సాంగముగ గ్రహించుటఁ బ్రశంసార్హ యయ్యెఁ
జిన్నమాదేవి పున్నెంబు నెన్నఁ దరమె ? 76

క. పెద్దలు విద్యాసక్తులఁ
దద్దయుఁ బండితులతోడ ధర్మములాడన్
సుద్దులు చెవికెక్కఁగ, ని
మ్ముద్దియ చిన్నాంబ ధర్మమూర్తియె యయ్యెన్. 77

గీ. పుట్టినింటివా రిచ్చిన భూమినెల్లఁ
బౌత్రి దౌహిత్రి సమితికిఁ బంచినావు;
అర్ధరాజ్యంబుఁ బుత్త్రిన, కర్ధరాజ్య
మమరఁ దనయల కిచ్చినా వమలచరిత. 78

గీ. మనుమ లనియును, మనుమరాం డ్రనియు, భేద
బుద్ధిఁజూపక, సమరస బుద్ధి తోడఁ
భూమినందఱు సమభాగములుగఁ బంచి
కొనఁగ శాసించితివి, చిన్నమ! నయ సరణి. 79

ఆ. పదుగురాడుమాట పాటిఁ దప్పనుగానఁ
జిన్నమాంబ ముక్తి నున్నతిఁగనె
నరులు సురలు బొగడు నాతికి లోపంబు
కలుగ దీధరిత్రి నిలుచుఁ గీర్తి. 80

ఉ. చిన్నతనంబునుండియును శ్రీవిభవంబుల నోలలాడఁగా
నెన్నియొ గుప్తదానముల నీప్సితసిద్ధిగఁ జేసిచేసి, యా
పన్నుల నాదరించి, పరిపాటిగ బీదల కన్నపూర్ణవై
పున్నెము మూటఁగట్టుకొని పోతివి స్వర్గతిఁ జిన్నమాంబరో! 81

గీ. ఆత్మఁ బరమేశ్వరార్పణ మస్తనకను
జేయులే దెట్టిపనినైనఁ జిన్నమాంబ;
మనన మొనరించె భగవంతు ననుదినంబు
మరణ పర్యంతమును దన మనమునందు. 82

ఉ భూతల భోగసంపదలఁ బుచ్చితి వర్ధశతాబ్ద మింకఁ బ్రి
జ్యోతిత స్వర్గలోకముల యోగ్యతఁ గాంచఁగ నేగుటర్హమా;
భౌతిక సాంప్రదాయ పరిపాలన చర్విత చర్వణం బగుఁ
ఖ్యాతియునిల్చెఁ, జిన్నమ! యఖండత సార్వజనీనికంబుగా. 83

—♦ వీడుకోలు ♦—

గీ. అస్తికలను గంగాప్రవాహమున నుంచ
వారణాసికిఁ గొనిపోయెఁ బరమభక్తిఁ
గొత్తపల్లి సుందరరామ కోవిదుండు
నేడు ♦ స్వర్గామివై పొమ్ము నిశ్చలమతి. 84

గీ. అస్తికలను గయఁ ద్రివేణియందుఁ జేర్చి
నీ ద్వితీయమాసికము వన్నెగనునాటి
కిం, ❘ దిరిగివచ్చెఁ గవి యింటికి న్సుఖముగ
గంగఁగొని తెచ్చెఁ, జిన్నమ్మ! కనికరించు. 85

గీ. ఉన్న బిడ్డలు సుఖముగ నున్నవేళ
భాగ్య సౌభాగ్యములు మించి ప్రబలువేళ
ముదిమి పైఁబడి శక్తిని ముంచువేళ
సతి విదేహాజీవముఁగనె సముచిత మది. 86

గీ. వంశవర్ధన కొఱకు సదాశగలిగి
తనరు దౌహిత్రు, భుజగాఖ్యు దత్తుఁగొంటి
వతఁడె నీయుత్తరక్రియ లాచరించె
ధన్యవైతివి, చిన్నాంబ! తథ్య మిదియు. 87

ఉ. పుత్రుఁడు కర్మకాండల నపూర్వముగాఁ బచరింపఁగాఁ, గృపా
పాత్రుఁడు భర్త సన్నిధిని వందురుచుండఁగ, సాధ్వివైన భూ
పుత్రికరీతి స్వర్గతిని బొంటివి, చిన్నమ! ధన్యవై ధరన్
మిత్రులుఁ బుత్రికల్ ప్రజలు మేదిని జింతను మున్గి తేలఁగన్. 88

♦ 21—5—1938. ❘ 11—6—1938.



రాజా భుజంగరావు, 30 వయస్సు.



రాజ దంపతులు, దత్తత కుమారుడు,
రాణీగారి వయస్సు 55 రాజాగారి వయస్సు 63.

సీ. సకల లోకములకు సంజీవకరణములై
తనరారు దివ్యౌషధంబులైన,
సఘటన ఘటనా సమర్థంబులై యుండు
పండితాశీర్వాద ఫలములైన,
నిష్టదేవతలకు నెల్లవేళల మ్రొక్క-
కొనుచున్న భర్త ప్రార్థనములైన,
జనియించుటాదిగా సౌజన్యమున మించి
యనువందఁజేయు పుణ్యంబులైన,

గీ. శ్రేయమని యెంచి, యాశించి, స్థిరతఁగాంచి,
యభ్యసించెడి యోగ విద్యయునైనఁ
బాయు నీప్రాణములకడ్డు వడకపోయె ;
దైవమా! యన్నిగతులు వ్యర్థంబులయ్యె. 89

క. ఉత్తర గౌరీ లోకమె
యుత్తమగతి స్త్రీల, కామహేమోజ్జ్వల సత్సం
పత్తియె చిన్నమకును నుప
పత్తిగ నిట సంభవించె ; భద్రము గాదే! 90

గీ. ఆమయంబుల భర్తకు సామ ముడుగ,
దేహమున రోగములచే నపోహ గొలుప,
భావి జీవిత మింకను సౌభాగ్యమిడద
టంచుఁ జిన్నమ్మ దివికేగె మించుపోలె. 91

క. నయనములారా! మీరిక
నయగుణ సాంద్రయగు చిన్ననారీమణి న
య్యయొ! చూచు నదను చిక్కదు
రయమున దృష్టినెడఁబాసి రక్తిం గనుఁడీ! 92

క. శ్రోత్రములారా ! చిన్నమ
గాత్రము నాలింపలేరు గావున మీకుం
బాత్రత లేదిక బధిరత
సూత్రప్రాయముగఁ గొనుఁడు శోభాస్పదమా. 93

క. రసనా ! చిన్నమ కొఱకై
వ్యసనముఁ గనకుము సతీ స్వభావము పొగడం
బసగలిగియుండుఁ, దద్వ్యధి
మసలుట ధన్యంబునీకు, మతిచెడు వఱకున్. 94

క. హృదయమ్మా ! చిన్నమ సౌ
హృదమును గనఁజాల కాత్మహింసను దిగఁగూ
డను, నరకము ప్రాప్తింబౌఁ
గద ! తలపోయఁగ నధర్మ కార్యంబగుటన్. 95

గీ. పరమ పురుషార్థ సాధనోపాయ శక్తి
కరతలామలకంబుగఁ గాంచినావు
జన్మ సాఫల్యమయ్యె ; జాజ్వల్యమాన
కీర్తి చంద్రిక లలమె నీ మూర్తి, దేవి ! 96

గీ. ధర ననాయాస మరణంబు దయ నొసంగు
మదియె యిఁకమీఁద నేఁగోరునది మహేశ !
తలఁపకు స్మశాన వైరాగ్య ఫలితమిది య
టంచుఁ జిన్నాంబ దైవము నడిగెఁ దుదకు. 97

క ఏవంవిధ గుణములచే
నావృతమై భూతహిత మనాహతి సలిపెన్
స్థావర జంగమ తృప్తిగఁ
గైవల్యము చూరగొనియెఁగద ! చిన్నమ తాన్. 98

గీ. క్షిప్రగతి గల్గు మేధా విశేషకలన
నెట్టి విషయంబులైన నొక్కింతలోన
నెఱిఁగి సార మసారంబు నేర్పరించు
క్షీర నీరంబులను హంస చెల్వుఁ దోఁప. 99

గీ. భూతలంబున విజ్ఞాన పూర్తియగుట
వేఱు లోకంబొ? జన్మమో? చేరఁబోక
బొందితోడనె కైవల్య మందఁ గలిగెఁ
జిన్నమాదేవి పున్నెంబు నెన్నఁ దరమె? 100

మ. జవసత్త్వంబులు కల్గియుండువఱకున్ సాంసారిక వ్యాపృతిన్
ధవునింగూడి స్వశక్తి నిర్వహణ విన్నాణంబుగాఁ జల్పె, సం
భవమై రోగము మంచ మెక్కినను సద్వాగ్ధాటితో సాకెఁ, బ్రా
భవమొప్పం దుదిదాఁకఁ, జిన్నమ మనోవాక్కాయ సంశుద్ధిగన్. 101

చ. పలుకులఁ దేనెలొల్కుగతి భావముల న్వెదజల్లు, స్వాంతముం
గలఁతను జెందనీయదు, ఘనంబగు నాదృతి నేర్పు పెంపునన్
నిలయము స్వర్గతుల్యముగ నించును సర్వసమృద్ధిగా, ధరం
బ్రియమె మాకుఁ జిన్నమ పరాత్పరు సన్నిధి కేఁగుటాదిగన్. 102

## అద్భుత శక్తులు.

గీ. తనకు బాలాగ్రహము సోకెననుచు దేవి
నాలుగేండ్లుగ రాఁబోవు కాలగతులఁ
బల్కుచుండెను ; దత్కాల ఫలము లటులె
పరిణమించుట కాశ్చర్య పడితి మపుడు. 103

ఉ. ఈమె భవిష్యదర్థముల నెంచి వచించుట కబ్రమంది, యీ
భామిని పైత్యధోరణిని బల్కఁగనోపు నటంచు నవ్వ, నీ
కోమలి ! దైవశక్తిఁ గనుఁగొందురుగాక సకాలమం దనున్ ;
శ్రీమతి చిన్నమాంబ జని చిత్రముగుం దలపోసి చూచినన్. 104

ఉ. గాత్రము నిల్వనేరదను కాలమునన్, సుత, సుప్రసూతి, దౌ
హిత్రినిఁ గాంచె, స్నానము రహింగొను నంతకు వేచి, పిమ్మటం
జిత్రముగా మృతింగనెను జిన్నమ, యీస్థితి దైవికంబొ ! యీ
ధాత్రి సతీ మనోద్రఢిమ తత్త్వమొ? సాధ్యముకాదుచెప్పఁగన్.105

గీ. పురిటి నీళ్ళను బోయించి, పొద్దువోవుచు
సరికి మాతా శిశులఁ దన సరసకుఁగొని
ప్రేమ ముద్దాడి దీవించి, తృప్తిఁగాంచి
ప్రాణములవీడెఁ జిన్నాంబ ప్రతిభ యేమొ ? 106

క. దేహత్యాగం బైచ్ఛిక
మైహికముగ యోగశక్తు లమరిన; సత్యో
త్సాహప్రదమగు మరణం
బాహా ! చిన్నమ్మ మరణ మద్భుతము నిజమ్. 107

క. తనమది సంకల్పములను
ఘనముగ నెరవేర్చి మరణకాంక్షన్ స్వేచ్ఛం
దనువును విడిచెను, జిన్నాం
బను యోగినిగాఁ దలంప వలయును గాదే ! 108

గీ. బ్రదుకనేమోయనెడి భయభ్రాంతిఁ గనదు ;
ముందుగతి యేమగుననెడి కుందుఁ గనదు ;
పూర్ణ నిర్లిప్తతను గాంచె ; ముక్తి భద్ర
మైనరీతిని నలరెఁ జిన్నాంబ తుదకు. 109

గీ. చదువుకొనుచున్న పుత్త్రిని, సన్నిధికిని
వడిగఁ బిలిపించుకొనియెను బడి చెడినను
మృతికి సంసిద్ధయయ్యె నెఱిఁగిన పగిదిఁ
జిన్నమాదేవి విజ్ఞాన సిద్ధిఁగనెను. 110

చ. సలలిత శక్తితో మరణశాసనము న్సమకూర్చి స్వేచ్ఛమై
బలువురఁ బెద్దలం బిలిచి వారి సమక్షమునందు ; నెట్టిసం
చలనము లేనికాలమున, సభ్యులు నవ్వరి ; చిన్నమాంబ ధీ
విలసన మెట్టిదో తెలియ విభ్రమఁజెందిరి దేహము న్విడన్. 111

ఉ చిన్నమదేవి దర్శనముచేసి తరింపఁగ వీలులేని నా
కన్నులు దృష్టిమాంద్యమును గాంచుట మేలని వేడుకొంటిఁ, బ్ర
చ్ఛన్నముగా నటుల్ విధివశంబున వెంటనె ప్రాప్తమయ్యె ; భా
గ్యోన్నతి గ్రంథపూర్తి యగుచున్నది; యాతకు నిల్చినం దగున్. 112

గీ. ప్రచుర మగునంతకును దృష్టి వరలునెడలఁ
బూర్తి కానున్న త్వత్కృతి బొలుపుఁగాంచుఁ ;
జిన్నమా ! నీకృతియు వికసించు వఱకు
దృష్టి నిల్పుము ; మనకది తృప్తి నొసఁగు. 113

గీ. బ్రదుకవలెనను కాంక్ష సర్వము నశించె,
మరణమేనాకు సర్వోత్తమమగు నిపుడు,
చూపులేనట్టి బ్రదుకు సంక్షోభ కరము
చిన్నమా ! దైవమునకటు చెప్పవేగ. 114

ఉ. ఈకలికాల మానవుల కేఁబది హాయనముల్ ప్రమాణ మ
స్తోకము ; డెబ్బదేండ్లు దరిఁజూచితిఁ గావున నిర్గమించుటే
నాకు సమంజసంబును, ఘనంబు ; నిరక్షునిదైన జీవితో
ద్రేకము వ్యర్థమౌను జగతిం బరపీడన దుర్భరం బగున్. 115

ఉ. దేవిని గాంచకుండుటను దృష్టిని బాపుమటంచు వేడఁగా
నావిధిఁ జూపుమాసెను ; బ్రియంబగు కావ్యముఁ బూర్తిసేయఁగాఁ
గావలె దృష్టియన్న క్షణికంబున వీక్షణ మబ్బె ; దైవికం
బో? వనితా ప్రభావమొ? మనశ్శక్తి యథార్థము, విశ్వసింపుఁడీ! 116

గీ. బాల్యదశనుండి మిత్రుఁడై వరలెఁ బ్రథిత
యశుఁడు, కొత్తూరి కామేశ్వరాఖ్య ఘనుఁడు,
చరమ దశయందుఁ జిన్నాంబ పరిసరమున
నుపచరించె ; వందనశత మొగి నొసర్తు. 117

గీ. తను మనో దార్ఢ్యము లిల యౌవనము తోడఁ
బుట్టి పెరిగి నశించు ; జీవునకుఁ జెందు
జన్మలో సంక్రమించు విజ్ఞానమెల్లఁ
జిద్విలాసమె యగునిది చిన్న దేవి! 118

మ. తలిదండ్రుల్ ఘనులైన, యోగ్యులయినన్, దాంపత్య సౌభాగ్యమే
కులకాంతామణి జీవితాభ్యుదయముం గూర్చున్ శుభోదర్కమై
ఫలితంబౌ నుభయాన్వయంబు లతుల ప్రాముఖ్యతం గాంచ, భూ
స్థలిఁ జిన్నమ్మకు లభ్యమయ్యెఁ బరమార్థంబౌ సదృష్టంబిటుల్. 119





శ్రీ. శే. మల్లికార్జున కుమారుడు.



శ్రీ. శే. మల్లికార్జున కుమారుడు, 9 ఏండ్లు.    సోదరీమణులు.




ఉ. నవ్వులు, సచ్చకోరక గణంబులకుం గడుదప్పిఁదీర్చు మే
ల్బువ్వులు, దంతముల్ హితసమూహము వెల్గునఁబెట్టు నచ్చపున్
రవ్వలు, నేత్రముల్ మదనురాణికి నింపగు నాటకూటపుం
గవ్వలు, మల్లికార్జును ననారతము న్మది సంస్మరించెదన్. 1

ఉ. చూపులు, సేవ కాప్త హిత సూరి కవీశ్వర దేశికాళికిం
బ్రాపులు, వాక్యము ల్సుమమరందముతో సరివచ్చు గాటపుం
దీపులు, దాతృత ల్సకలనిర్మల పుష్పఫలప్రదంబులౌ
తోపులు, మల్లికార్జున సుతున్ స్మరియించెద నెల్లవేళలన్. 2

ఉ. మాటలు సర్వబంధుజన మానస దుఃఖ హరమ్ము లద్దిరా!
పాటలు సర్వమిత్రజన పద్మదివాకర సత్కరమ్ములౌ,
నాటలు సర్వబాలక జనాళి చరించెడు నుత్తమంపుఁ బెం
బాటలు, మల్లికార్జున కుమారుని మారుని సంస్మరించెదన్. 3

ఉ. బాలకకోటికిన్ హితము బాగుగఁ గూర్పఁగలాఁడు, సర్వభూ
పాలక కోటికిన్ హొయలు బాగుగ నేర్పఁగలాఁడు, సర్వగో
పాలక కోటికిం బ్రభుత బాగుగఁ జేర్పఁగలాఁడు, మేటి, మ
ద్బాలక మల్లికార్జునుఁడు భావజ భావజుఁడెంతు నాతనిన్. 4

ఉ. నీతికిఁగుప్ప, యంచిత మనీషకుఁదెప్ప, దయాప్రచార వి
ఖ్యాతికి లప్ప, సద్గుణ విహార సమృద్ధికి గొప్ప, దుష్టధీ
రీతికి రప్ప, బంధుహిత వృత్తికిఁదిప్ప, మహేశ భక్తిసం
ప్రీతికి విప్పనన్ జగతిఁ బేర్వడి యొప్పవె? మల్లికార్జునా! 5

చ. కలిమినిజిమ్ము నేత్రములు, కాంతులఁ జిమ్మెడు గాత్రముల్, సుధీ
బలమును జిమ్ము బుద్ధి, సురభావముఁ జిమ్ము ప్రసిద్ధి, యెల్లవ్యా
కులమును జిమ్ము నేర్పు, ద్విజకోటుల భక్తిని జిమ్ము తీర్పు, ని
శ్చలమునుజిమ్ము నెమ్మదియుఁ, జాలఁగ నీయది మల్లికార్జునా! 6

చ. కలఁగినవారి దేర్చుటయు, గాదిలి మిత్రులనెల్లఁ గూర్చుటల్,
తొలఁగినవారి వీడుటయుఁ, దోడగువారిని వేడ్కఁగూడుటల్
మలఁగినవారిఁ బిల్చుట; చలంబును బూనినవారి వెల్చుటల్,
చెలఁగిన చిన్ననాట నొనరించితి వాటల మల్లికార్జునా! 7

ఉ. ఈరస నీవుమాకు జనియించి, చతుర్దశ వత్సరంబు, లా
రౌర! సమానులీతనికి నౌదురె యన్యులటంచుఁబల్క, నే
యీరస మేరిపై నిడక, యెంతయు మంతునకెక్కి చక్కనో
యారస పుత్రి! సంతసము నాదలఁగూర్చితి మల్లికార్జునా! 8

చ. ముఖము, విశాల ఫాల శశిముఖ్య కళాన్విత మందహాస స
న్ముఖము, పరాంగనాజన విమోహన రూపదిదృక్షుకుం బరా
ఙ్ముఖము, సుసాధుసజ్జన సముజ్జ్వల తత్వవిమర్శలన్ హస
న్ముఖము, భవన్ముఖంబు, సతము న్మదినెంచెద మల్లికార్జునా! 9

చ. కరముఁబవిత్రభావ సుముఖంబగు విస్ఫురితాత్మశుద్ధి కా
కరము, ప్రశస్త సజ్జన సుఖప్రద దివ్యసమస్త సద్గుణా
కరము, దురాత్ములై ప్రజల గారియవెట్టెడి వారికిన్ భయం
కరము, భవన్ముఖంబు సుముఖంబు స్మరించెద మల్లికార్జునా! 10

చ. వదనము దృగ్విలాస పరిపాలిత హాస వికాస చంద్రికా
సదనము, కుందకుట్మల లసద్ధవళాక్షత మాలికాభ స
ద్రదనము, మన్మథాస్త్ర సువిదారిత మానస తప్తకామినీ
మదనము, మల్లికార్జున కుమారు ముఖాంబుజమున్ స్మరించెదన్. 11

చ. సుతుని సచిత్రలేఖనముఁ జూచుటకైనను వీలుగాక, శో
చితమగు నాహృదంతరము, చిన్నమ పోవుట ఖేదమంది, చూ
చితి సుకుమారు చిత్రము, నిషిద్ధముకాఁబడె నెన్నఁడో, యథో
చిత హృదయాతి శోకమునఁ జిక్కితి, స్రుక్కితి, మల్లికార్జునా ! 12

చ. చిరచిత పుణ్యకర్మ ఫలసిద్ధిని నేటికి నీ సురూప వి
స్ఫురిత పవిత్రచిత్రముఁ దిశుద్ధిగఁ గాంచుట మేటినైతి, నా
నిరయ సమాన సజ్జన వినిందిత జన్మము ధన్యమయ్యె, మ
ద్వర తనయాగ్రగణ్య ! పితృవత్సల మానస ! మల్లికార్జునా ! 13

గీ. చిరము లోన ఘనీభవించిన మహాగ్ని
ప్రజ్వలితమాచు బహిరంగపడి దహించెఁ
బుత్ర రత్నమ ! నీతల్లిపోయిన వ్యథ
విస్మరించితి నీ పట వీక్షణమున. 14

గీ. చిదిమినను బాలుగారు నీ వదనకాంతి,
మిసమిసలఁ జిమ్ము నీ దృగ్విలసనములును,
కుందరదనము, లోచనా నందమయ్యెఁ,
బుత్రికా ! పటముగుటచేఁ బొగులవలసె. 15

గీ. హృదయసీమను నిల్చి నన్నేర్చుశోక
ము, పునరుద్భిన్నమై, తమమునను ముంచె,
నేగతి భరింతు ! జీవన మెటు ధరింతు !
ద్విగుణమయ్యె, సతీ సుత విరహ భరము. 16

గీ. మల్లికార్జున వర సుకుమారుఁడగు కు
మారుఁడు, వసంత సుందరాకారుఁ, డమల
సుగుణ సారుఁ, డాకర్షణ శూరుఁ, డతని
చిత్రపట దర్శనము కల్గెఁ, జిన్నమాంబ ! 17

గీ. తనయ ! నీతల్లి జీవించు దినములెన్ని
వత్సరములైన, నీదుఃఖ భరము పైకిఁ
బ్రచురపరుప కామె కెద, విరాగ మొదవ
లోనడాచితి, దుర్ఘట మైనదయ్యు. 18

ఉ. ముద్దులు మూటగట్టు నగుమోమున వెల్వడు మందహాసమే
ప్రొద్దు ముదావహంబగుఁ, బ్రబుద్ధ మనోరథ సిద్ధిఁగూర్చు, ము
ప్పొద్దులఁ బాఠముల్జనువు ప్రోడవు, మించిన శక్తియుక్తులం
బెద్దలఁజిన్నలన్ విమలనీతిని జూచిన మల్లికార్జునా ! 19

చ. తలఁచెద నీ స్వరూపము నెద న్సుర కిన్నర మానవాళులే
వలనునఁ బోలనేరక దివంబున భూస్థలి నస్రులై సదా
తలలను వంచికొందురు సతంబు, జయంత వసంత కంతులం
జెలువమునన్ జయించితివి, చెల్లు; స్మరించెదఁ బుత్రరత్నమా ! 20

చ. కనుఁగవ మీల, సద్వదన కాంతులు చంద్రుని, మోముదమ్మినిన్,
ఘన రదనచ్ఛదంబు తమకంబున బింబఫలంబునున్, గళం
బనయము శంఖమున్, నుదురు సార్ధ శశాంకుని, నాస చంపకం
బును, బ్రహసించు నీచెలువమున్ మదినెంచెద మల్లికార్జునా ! 21

చ. అనుదిన మీవు విద్యల రయంబున నేర్వఁగఁ బాఠశాలకుం
జనఁ సహశిష్యులందఱు వశంవదులైరట సామరస్యముం
గని, భవదీయ యోగ్యత లగణ్యములయ్యెను జిన్ననాఁటనే;
నెనరున నెల్లరేడ్చి రవనిం, దనయా ! దివికీవు పోవుటన్. 22

ఉ. చిన్నమదేవి తాఁగని, ప్రసిద్ధిగఁ బెంచుటచే గుణాకరుం
డన్న ప్రసిద్ధి చిన్నతనమందె లభించెను, విద్యలెల్ల సం
పన్నత నేర్చి, వంశమునఁ బ్రాజ్ఞుఁడవౌదు వటంచు నెమ్మదిం
గన్న మహాశయంబు లుడుగన్ విలపించితి మల్లికార్జునా ! 23

మ. తనువా స్రుక్కె సతీ సుతు ల్విమలు లాత్మజ్ఞాన విజ్ఞాన సా
ధనఁ జేయన్ దివి కేగి, రే నిచట మిథ్యావాద విజ్ఞాన, చే
తన దారా సుత శూన్యశోక మలినాత్మన్ గ్రుగ్గి, శోషించి, త్వ
ద్గణనాతీత విచిత్ర లేఖనవిధిం గాలంబుఁ దెల్లార్చెదన్. 24

గీ. అశ్వ సద్వాహనారూఢుఁడై సుతుండు
రాజవీథుల విహరించు తేజముఁగని
పౌరు లానంద తన్మయత్వములఁ గనిరి;
కని సహింపక తానెత్తుకొనిచనె విధి. 25

గీ. అద్వితీయుఁడు విమల సంపద్విభూతి
మల్లికార్జునసుతుఁడు, తన్మాత యటులె
యగుట నాఖండలస్థాన మాక్రమించి
యేలుచుండిరి దివి లోకపాలకులను. 26

గీ. సుతసతీ వియోగవ్యథ శోచనీయ
మగును, మల్లికార్జున చిన్నమాంబలార!
ఒకటి రెండును మూఁడౌచు వికటమయ్యె;
మోఁడి ఘటమున కబ్బ దాముష్మికంబు. 27

గీ. ఒల్ల రాజ్యంబు, రాజకీ యోద్యమముల,
వ్యావహారికేతర విషయంబు లొల్ల,
గ్రంథ రచనాదికము సమగ్రముగ నయ్యె;
నైహికము చాలు, నాకు భయంబుఁ గొలుపు. 28

ఉ. మేటిసఖుండవౌటఁ జెలిమిన్ బడిఁజేరిన పిల్లలందఱుం
బాటల నాటల న్వినయ వర్తనతో నినుగూడి యింటికే
పూటనువచ్చినం దగిన భోజన భాజన పాన సత్కృతుల్
పాటవమొప్పఁగూర్చు గతులన్మది నెంచెద మల్లికార్జునా! 29

గీ. జన్మజన్మాంతర సుతపశ్శక్తి వలన
నైన నినుఁబోలు సుతుని నేమానవుఁడును
గాంచలేఁడు, నిన్నంటి భాగ్యవశ మద్ది;
పుట్టిచచ్చినమేలు సత్పుత్రుఁడనఘ! 30

చ. అనువుగ బారసాలసమయంబున సుందరరామ మల్లికా
ర్జున జననంపు సత్కృతిని సొంపుగ నందినవాఁడవౌట, నీ
వును మృతజీవివంచుఁ దలపోయుచుఁ, జిన్నమదేవితోడ, నీ
వును జననీ! భుజంగనృపు భూరికృతిం గొనుమంచుఁ దెల్పుమీ! 31

క. నీతల్లి మహిమ చేతను
మాతనయుఁడ వైతివీవు, మహితుఁడ వెట్లో
భూతల జనిఁగని, త్వరగతిఁ
బోతివి, దివి కాత్మసుత! తపో మహిమమునన్. 32

క. దేవతలు శాప వశమున
నీ విపులను బుట్టి చచ్చు టెఱుఁగమె? తనయా!
నీవటులు వచ్చి పోతివి,
భావించెద నదియె వంశ పావన మనుచున్. 33

గీ. పలికెదరు మెట్టవేదాంత వాక్యములను
జేయునదిలేక సర్వము మాయ యనుచుఁ;
జచ్చి యేడ్చెడివారికి శాంతి యగునె?
నాయనా! నీవె యోజింపు మీయదనున. 34

గీ. మిత్ర పుత్ర కళత్ర నిమీలనంబు
స్వర్గమా? మోక్షమా? యపవర్గమా? య
టంచుఁ జింతింతు నాహృదయంబు నందు,
మల్లికార్జున వర సుకుమార! ధీర! 35

గీ. ఏకపుత్రుఁడవయ్యు మమ్మిమ్మవు విడుట
హృదయశల్య మామరణాంత మదినిఁబట్టు.
నీ జననియును మముపీడి నిర్గమింపఁ
బుత్రి! పుత్రా! సతీ! సతీ! మిత్రభేద
మేలచేసితిరని మది నేడ్వవలసె. 36

గీ. ప్రథమ సంతానమగుటచే వంశవర్ధ
నముచు గావించఁగలవు సక్రమముగ నని
సంతసించితి, నీవటు లంతరించు
వనుచుఁ దలపోయఁ జాలనైతిని, సుపుత్ర! 37

చ. హరిహర నామకీర్తన లహర్నిశమున్ శ్రుతిపేయ మానటుల్
స్థిరతర శక్తి నాలపనజేసెడి యామృదుగాన పూర్ణ భా
సుర వరకంఠనాద పరిశుద్ధత బాలునకెట్లు గల్గెనన్
గురుతరభావ సంస్మరణ గ్రుచ్చి దహించును, మల్లికార్జునా! 38

ఉ. ఇంతటిభక్తి బాలున కహీనముగా నెటుగల్గెనంచు నే
నెంతయొ యబ్బురంపడి, మహేశ్వరు సత్కరుణా కటాక్షముం
జింతనజేసి, నీజనని చెంతను బల్కితి మాతనంబునన్;
వంతకుఁ గారణంబది ధ్రువంబని యెంచెద మల్లికార్జునా! 39

గీ. ఈడునకుమించు బుద్ధు లెయ్యెడ లభించు
నట్టి బిడ్డలు దక్కరం చాడుమాట
నీయెడ యథార్థమయ్యె; శనిగ్రహంబు
నినుగ్రసించెను, మల్లికార్జున కుమార! 40

గీ. పుత్రరత్నమ! నీవు సంపూర్ణముగను
గ్రీడలఁదవిలియుండఁ జక్రి వనుకొంటిఁ
గరతలామలకమగు సౌఖ్యమనుకొంటి,
మాయమైతి వంతటిలో నమాయికముగ. 41

గీ. ఒకరుజ సతికి, సుతున కింకొక్కరుజయుఁ;
జేయఁదగ్గ చికిత్సలఁ జేసినాము,
మాయరోగము మిమ్మటు మాయఁజేసె,
నేమిచేసెనఁదీరు ? మీ లేమితీరు. 42

గీ. ఏమి పాపమొ ? నీ మృతియే మొదలుగ
భ్రాంతి తొడఁగెను, నామనశ్శాంతి యడఁగె,
నీ జననిపోవ సర్వ ప్రయోజనములు
నాశనములయ్యె, బ్రదుకు వినాశ మయ్యె. 43

ఉ. ఎన్నఁగ నెన్నిహాయనము లేగెనొ ? నీవటు లాటపాటలన్
మన్నిలయంబునందుఁ బెరిమ న్మముఁదృప్తులఁజేసి ; యన్నియున్
నిన్ననొ ? నేఁడొ ? యన్నభ్రమ నింపును నెమ్మది ; విస్మరింపలేఁ
డెన్నఁడుఁ, గాలభేదముల నేగతి దాఁటుదు ? మల్లికార్జునా ! 44

ఉ. కాలము నెన్ననేల ? సముఖంబున నీవునటించి మించునా
కాలము, నాటలాడి చిరకాలముక్రిందట మెప్పుఁబొందు నా
కాలము, మామొడిన్నిలుచు కాలము, ముద్దుల సుద్దులాడు నా
కాలము, నవ్వులం బరపు కాలముఁ దీరెను మల్లికార్జునా ! 45

ఉ. ముద్దుల సుద్దులాడి వలపుల్గను కాలము, పాటఁబాడి మా
యొద్దఁజరించు కాలము, మనోహర ఖేలన లాలనంబులన్
హద్దును మీఱుకాలము, విహార వినోద విలాస లీలతే
పొద్దును గాంచు కాలము నిరోధముఁజెందెను మల్లికార్జునా ! 46

చ. కలకలలాడు నీ ముఖవికాసముఁ గాంచెడిభాగ్యమున్, మహో
జ్జ్వలకలభాషణంబుల శ్రవంబులఁ జేర్చెడిభాగ్యమున్, దనూ
విలసనముల్ స్పృశించి తనివింగను భాగ్యము, నాకుఁజెల్లె నీ
కలియుగమందు ; స్వర్గమునఁ గాంచెద భాగ్యము, మల్లికార్జునా! 47

గీ. కాలగతు లాత్మలకిల సంక్రమణఁ జెంద
ననెడు నార్యోక్తి సత్యము ; కన, నిరువది
యైదు హాయనముల్ వోయె నైన నేఁడు
కట్టెదుటనుండె నీ కాలగతులు తండ్రి ! 48

చ నిరుపమరీతి నీ వనుపనీతుఁడవై చను కారణంబునం
దిరపడు వార్షికోత్సవవిధిం బచరింపఁగఁ జాలనైతి, నె
త్తెఱఁగున నద్ది సాగు ? సుగతి న్సురలోకముఁ జేరి నీవు సు
స్థిరముగనుండ మా యుదక సేచనలేటికి ? మల్లికార్జునా ! 49

గీ. సంశయాత్మ నశించు నిస్సంశయముగ
ననెడి వేదాంత వాక్యము నధిగమింప
కేను మిముఁజూడఁగాఁ దలపూనియుంటిఁ ;
జెప్పు మమ్మకు నామాటఁ జిన్నికుఱ్ఱ ! 50

గీ. ఆడుపిల్లలు చెల్లెల లమ్మతోడఁ
బలుకఁజాలరు, భూ నివాసులగు కతన,
స్వర్గమునఁ దల్లితోడఁ బ్రసంగములను
జేయఁగలవీవు సాన్నిధ్య సిద్ధివలన. 51

గీ. శేషు, పసికూన, యేడేం డ్లశేషముగను
నిండకయె సాగె దైవసాన్నిధ్యమునకు,
నీవు పోయిన నెల దాఁటనీయదయ్యొ ;
దాని నాదరింతురె ? నీవుఁ దల్లియు నట. 52

గీ. సుగుణసంపదఁ దలపోసి స్రుక్కువారు,
రూప సౌందర్యముల నెంచి క్రుంగువారు,
వరలు సిరిసంపదల నెంచి వగచువారు,
నైరి నీవు నిర్యాణమునందఁ దనయ ! 53

ఉ. అల్లరి పిల్లవాఁడవని, యాగడముల్ పచరించితంచు, ని
న్నల్లరిపెట్టువార లొకరైనను గన్పడలేరు మచ్చుకుం;
దల్లులుఁ బిల్లలున్ నరవతంసులు నిన్నిల మెచ్చి ప్రీతిసం
ధిల్లఁగఁజేసి రాత్మకుఁ, బ్రీతిక్రియకే యవకాశమీయరే,
దిల్లలిఁబ్రేమముంచి, తుదకీగతి ముంచిచితివయ్య పుత్రకా 54

గీ. జనక పాలక జనకుల సదభిధాన
ములకు సంపుటికుదిరె నిమ్ముగఁ ద్వదీయ
నామకరణమునందు, ఘనంబగునని
యనఁగ నీగతి ముంచితి వౌరస సుత ! 55

ఉ. చిన్నతనంబుచుండియు భజించితి దేవునిఁ జిత్తశుద్ధిగా
నెన్నఁడు నాస్తికంబు మదినెంచను, నీవటు వీగిపోవ నా
కున్న శివప్రపత్తి కలయో ! యన నెంచితిఁ, గ్రైస్తవంబు నా
మన్ననఁగాంచె, నీజనని మ్రగ్గుట నాస్తికమే శరణ్యమై
యున్నది, యేమిసేతు నయయో ! సుతరత్నమ ! మల్లికార్జునా! 56

ఉ. దైవము దైవమంచుఁ గడు దైన్యముగా విలపించి మ్రొక్కినం
గ్రోవఁడు, కష్టకాలముల రూపరు, భక్తుల మాటయే మదిన్
భావనసేయఁ డేమిగతి ? వానిగతు ల్పరికించియుంటివా
నీవట ? మంచిదారిఁ గరుణింపుము, పుత్రిక ! మల్లికార్జునా ! 57

ఉ. కేవల నాస్తికంబు పరికింపఁగ నెమ్మది నిచ్చగొల్పదే
త్రోవను, భక్తిసాధన మధోగతి సేయు నగమ్యగోచరం
బై, విను, కర్మకాండలరయన్ వృథ, బుద్ధికిఁ దోఁప దెద్దియున్,
నీవటఁగాంచఁగల్గిన గణించి వచింపుము మల్లికార్జునా ! 58

ఉ. బల్లిదుఁడైన రామనరపాలుని రాజ్యమె యైన నీగతిం
బల్లదము ల్ఘటిల్లునె? ధరాస్థలి దుష్టయుగంబు నేఁడు వా
టిల్లెను, ధర్మమిట్లు వికటించెను, భక్తుల ప్రార్థనల్ వృథా;
చెల్లునె? మల్లికార్జున! నిషిద్ధ గతుల్ పరిపాలనంబునన్. 59

గీ. ఇలను వాసనా వాసితములగు గతులు
సహజ సాన్నిధ్య సాయుజ్య సహ నివాస
సరణులగు దివిఁ గావున! వరకుమార!
యేకమయ్యెద మచ్చట! నాకమునను. 60

గీ. మనది తాత్కాలిక వియోగ మనఁ దగుఁ గద!
ధర నిరీక్షణమునఁ గాల మరసి యుందు;
మీరు నాగతి నారాకఁ గోరి మనుఁడు,
సుత సతీ వతంసములార! సుఫలమగును. 61

చ. భువిని వసించియుండిన సుపుత్త్రుఁడు, శాంతుఁడు, మల్లికార్జున
ప్రవరుఁడు, కార్యభారముల రక్తిని బూని, విరామ శాంతు లిం
తవఱకె నాకొసంగఁదగెఁ; దద్గతి పృథ్వి లభింపదయ్యెఁగా!
భవభయశూన్యమైన యపవర్గముఁ గాంతు సతీసుతావళిన్. 62

మ. పదునాల్గేండ్లు ప్రవర్ధమానుఁడయి సర్వప్రజ్ఞ వర్ధిల్లుచుం
దుదముట్టన్ దివికేగెఁ బుత్త్రుఁడు పరాత్మం జేరె నట్లాట నా
మొద లీసాధ్వికి భక్తియోగములు సమ్మోదమ్మునంజిక్కె, నా
పద లేముక్తికి మార్గదర్శకములై ప్రాప్తించెఁ జిన్నాంబకున్. 63

గీ. మల్లికార్జున పుత్త్రుఁడు తల్లియొడిని
నిలిచి భర్తృవియోగ సంచలన ముడుపు;
నన్ను మించిన సుతుఁడు, నాకన్న మిన్న;
యంతమాత్రము నిలఁ గల్గదయ్యె నాకు. 64

గీ. భుజగ భూపాల కాగ్ర సత్పుత్త్రుఁడైన
మల్లికార్జునుఁ డుదయించె మహిఁదలంప
† వర విళంబి సమాధికాశ్వయుజమాస
కృష్ణషష్ఠిని, దేవుని కృప దలిర్ప. 65

క. పదితొమ్మిది వందల పైఁ
బదుమూఁడవదైన యేట వరతనయుండా
విధివశమున నే పరమా
వధిఁగని ధరవీడి స్వర్గపదవిం గాంచెన్. 66

గీ. సుత సతీమణు లిలఁ బరిశుద్ధులగుట
జనన మరణములందిన సమముల నిట
బొంనుపఱచితి ; దుఃఖ సంపూర్తి యయ్యెఁ ;
గవులు భువిఁ జేయఁగలిగిన కర్జమిదియె. 67

గీ. పురుషుఁ డీసృష్టిఁ బద్ధతిఁ బుత్త్రురూప
మునఁ బునర్భవుఁడగు, వేదములఁ గలదటు ;
గాన మల్లికార్జునపుత్ర ! నేనె నీవు ;
తనువుమాత్రము కలదిటఁ, దరలు నెపుడొ ? 68

గీ. మల్లికార్జునపుత్ర ! నా యుల్లమునకుఁ
దృప్తి కలుగదు నిన్నెన్ని దీన గతులఁ
దలఁచికొనిన, నచటి కి రాఁ దలఁచియుంటిఁ
గాన నింతట విరమింతుఁ గన్నతండ్రి ! 69

† (5-10-1898)



రాణీ వాడ్రేవు రంగనాయకమ్మగారు,
రాణీగారి మాతామహి.



కస్తూరి నరసింహారావుగారు,
రాణీగారి తండ్రి.



అయ్యగారి ఉమామహేశ్వరశాస్త్రిగారు,
రాణీగారి మేనత్తభర్త.



# 7. రాజకుటుంబము.

## రాజ్ఞీ జనక కుటుంబము

గీ. రమణ కస్తూరి నరసింహరాయ మంత్రి
వర తనూజాత, దౌహిత్రి వాడరేవు
రంగనాయకమ్మ యను పురంధ్రి కీమె ;
చిన్నమాదేవి సుబ్బప్ప చిహ్నఁగలది. 1

## పురవర్ణన

మ. రమణీయద్రుమ వల్లికా విలసితా రామమ్ములన్, దివ్యవే
శ్మములన్, సస్య సమృద్ధ భూములను, గాసారంబులన్, బాహ్మణో
త్తమ సంఘంబులఁ, బండిత ప్రవరులన్, ధర్మాత్ములన్, మించి దొ
డ్డమపేటన్ పురమొప్పు హారావళీ రత్నమై.

వ. ఇది మన చిన్నమరాణికిం బుట్టినిల్లు. ఈరాజ్యమును జిర కాలము దిగంత వ్యాప్త కీర్తి చంద్రికలతోఁ బరిపాలించిన శ్రీరాణీ వాడ్రేవు రంగనాయకమ్మయను వినుపీమణి మన చిన్నమాంబికకు మాతామహి. 3

## రంగాంబాస్తుతి

సీ. అపరాహ్ణకాలంబు నందు మ్రోగెడుగంట
లేతల్లి యన్నదాతృతను దెల్పుఁ
జిలువలు పలువలై చేవదేరిన వాశ
మే యమ్మ బాంధవ హితము సూపుఁ
బ్రిణవస్వరూప సంప్రతిపాదితార్చన
లే మాత యాస్తిక్య మేర్పరించుఁ
బ్రత్యహ పరితృప్త పండితాశీః పుంజ
మే వినుపీజ్ఞాన మెఱుకపఱచు

గీ. బిడ్డలనుబోలెఁ బ్రజఁ బ్రోచు దొడ్డగుణము
లేమె దొడ్డమ్మపేట విఖ్యాతినిఁ జెప్పు
నట్టి దొడ్డమ్మ కలయింటఁ బుట్టినమ్మ
న్యాయముల కమ్మ శ్రీరంగనాయకమ్మ. 4

## —♦ నృసింహస్తవము ♦—

గీ. వర గుణాఢ్యుఁడు కస్తూరివంశ భవుఁడు
దాన రాధేయుఁ డతుల విద్వద్విధేయుఁ
డరిజనసమాజ గంధసింధుర విభేద
సింహసన్నిభుఁడగు నారసింహ విభుఁడు. 5

గీ. అతఁడు వాడ్రేవువంశ శీతాంశుఁడగుచు
నెసఁగు శ్రీసుందరేశ మహీశపుత్రు
నాత్మజ ద్వితీయ నద్వితీయ రుచిగేయ
శ్రీమహాలక్ష్మి గుణలక్ష్మిఁ జెట్టవట్టె. 6

వ. ఈ దంపతులు మన చిన్నాంబాసతికి మాతాపితరులు. 7

సీ. ప్రాయంబు పదునైను వత్సరంబులకు వే
గాయమ్మపేట నిక్కగనొనర్చి
శ్రీరంగనాయికాంబారాజ్ఞి రాజ్యంబు
నందు నల్వదియైదు హాయనములు
ధర్మశీలత నమాత్యపదం బధిష్ఠించి
నయవృత్తిఁ బరిపాలనంబుఁ జేసి
రాజ్యంబునందు సంప్రాప్తించు బహువిధో
పద్రవంబుల నశింపఁగ నొనర్చి



కీ. శే. కస్తూరి రామారావుగారు,

రాణీగారి జ్యేష్ఠ సోదరుఁడు.

గీ. తొంటి యాదాయమునకుఁ జతుర్గుణాధి
కంబుగా రాజ్యమున కుదయంబుఁ గూర్చి
ధైర్య గాంభీర్య ధుర్య చాతుర్యములను
నిరుపమాన యశంబు గణించుకొనియె. 8

గీ. పుత్త్రి పుత్త్రికా పౌత్త్రి దౌహిత్త్రి పౌత్త్రి
కాది రమణీయ సంతతి స్వార్జితంపు
నిండు సిరితోడ మిగుల మన్నించి మించె
నుర్విఁ గస్తూరి నరసింహయోగి భోగి. 9

— కస్తూరి రామారావు —

గీ. ధరణిఁ గస్తూరివంశ వర్ధనుఁడు ఘనుఁడు,
రామరాయాఖ్య వరలు ధర్మ స్వరూపి,
భావుకుఁడు నాకు, నిర్మల స్వాంతుఁ డతఁడు, 10
పరమ పదమునఁ జేరె యవ్వనమునందె.

సీ. అతఁడు నాల్గచ్చరాలంటఁ జేసెను మన
వాని కంచును మోద పడెడువారు,
నతనిఁ జేరియొకదా ఐనబంధుగులు వి
ద్యావంతులైరని యలరువారు,
నతనితో స్నేహము నందియే నిర్ధనుల్
ధనవంతులైరని తలఁచువారు,
నతనికై సఖు లందఱాడఁబట్టియె నాట
కములెల్లఁ జూడఁగంటి మనువారు,
గీ. నతనికంటెను ఘనుఁడు లేఁడనెడివారు,
నతని కీర్తి భువిఁ జాలు ననెడివారు,
నతనియందు నసూయ లేదనెడివారు
నైరి యా రామరావు పుణ్యమది యేమొ! 11

గీ. న్యాయమున దృష్టి బంధువులందుఁ బ్రీతి,
హితులయెడ నాదరమ్ముఁ బండితులయెడలఁ
బరమ గౌరవ భక్తి విశ్వాసములును,
నీతనికి నైజగుణములై యెసఁగె నెపుడు. 12

—* శ్రీ రాజా విశ్వసుందరరావు *—

గీ. ప్రథిత వాడ్రేవువంశ వర్ధనుఁడు, రాజు,
విశ్వసుందరరావు, పృథ్వీధవుండు,
భావుకుఁడు ద్వితీయుఁడు నాకుఁ బరమ హితుఁడు
రాజయోగియుఁ గార్య ధురంధరుండు. 13

ఆ. రంగనాయికాంబ రక్తితోఁ బెంచిన
బాలుఁ డౌటఁజేసి వదలలేక
వేడ్క మనుమఁడైన విశ్వసుందరరావుఁ
బెంచికొనియె, వంశ వృద్ధికొఱకు. 14

సీ. ప్రీతి వేగాయమ్మపేట సంస్థానాధి
పత్యంబుఁ గీర్తిమై వరలఁజేసి
లౌకిక వ్యవహార లాక్షణిక ప్రజ్ఞఁ
బూనికఁ దనయంత వానిఁజేసి
స్వార్జిత ప్రాజ్య పిత్రార్జిత భూవిత్త
సంచయంబులను వశ్యంబుఁజేసి
సకల కళాసార సంపాదన పటుత్వ
మించుకించుక గలిగించి మించి
గీ. యాత్మజుని విశ్వసుందర ఖ్యాతయశునిఁ
బ్రథిత గుణసాంద్రుఁ గావించి ప్రబల యశుఁడు
పుత్రి వాత్సల్యసార పరిపూర్తిఁ గాంచె
మహిత గుణశాలి, నరసింహ మంత్రిమౌళి. 15



శ్రీ రాజా వాడ్రేవు విశ్వసుందరరావు,

రాణీగారి సోదరుఁడు.

గీ. పుత్ర పుత్రికా పౌత్ర దౌహిత్రు లొప్ప,
బహు విధైశ్వర్య సామ్రాజ్య పదవు లొప్ప,
విశ్వసుందరరాయ పృథ్వీధవుండు
ధరఁ జిరంజీవియగుఁగాక ! దైవకృపను. 16

శ్రీ మహోపాధ్యాయ

—♦ అయ్యగారి ఉమామహేశ్వర శాస్త్రి ♦—

సీ. లలిత నాటక రసాలంకార సాహితీ
గ్రంథపాఠకు లయ్యగారి వారు,
నిత్య వైదికకృత్య నిష్ఠాగరిష్ఠతా
ఖ్యాత వర్తను లయ్యగారి వారు,
సకల లౌకిక కార్య సంధాన చాతురీ
కలిత కోవిదు లయ్యగారి వారు,
జగపతిరాజ సంస్థానార్జితాఖండ
ధారుణీవిభు లయ్యగారి వారు,

గీ. వారి వంశంబునందు సర్వజ్ఞమూర్తి
సలలితుఁ డుమామహేశ్వర శాస్త్రి వెలసె,
నఖిల కావ్య పురాణేతిహాస శాస్త్ర
వేత్త, చిన్నమ్మకతఁడు మేనత్త భర్త. 17

గీ. సూత్రభాష్యము, భగవద్విశుద్ధగీత,
లుపనిషద్వాక్యముల కర్థ మొగి నమోఘ
ముగను బోధముల్ జెప్పు శక్తిగలవాఁడు ;
అనఘుఁ డుమ్మన్న బాబు సర్వాధికారి. 18

—♦ అ య్యా గా రి వీ ర భ ద్రి రా వు ♦—

ఉ. ఆతత కీర్తి సంయుతుఁ, డనంత గుణాంచితుఁ డాంధ్ర హూణ భా
షా తత సాహితీ పటు రసజ్ఞుఁడు, నాకును దోడియల్లుఁడుం
బ్రీతిని నయ్యగారికుల మిత్రుఁడు, నైతగు వీరభద్రరా
వేతదహీన సద్గుణ సహిష్ణుత వర్ధిలుఁగాక ! నిచ్చలున్. 19

గీ. మేనమఱఁదియు, దేవి కనూన హితుఁడు,
సోదరీభర్త, మేధావి, శుద్ధయశుఁడు,
మనుమగాలికి మామయు, మాన్యుఁడగుట
నిటఁ బ్రశంసార్హుఁడయ్యె మా కీయదనున. 20

ఉ. చిన్నమదేవి ! నీజనకు చిన్న సహోదరి, మేనయత్త, నీ
సన్నిధి కేగుదెంచెనఁట, స్వాగత మిచ్చితివే దివంబునం ?
గ్రన్నన సోదరుం, బతిని గాంచెనె యచ్చట ? వారిచెంత న
త్యున్నతి నున్నదే! తెలుపు మోసతి! తల్లికి మా నమస్కృతుల్. 21

—♦ పి తృ స్త వ ము ♦—

సీ. ధర్మనిర్ణేత, విద్యాదాత, పండిత
పోషణుం, డమృత సంభాషణుండు,
సత్య సంధుండు, నిస్వప్రజా బంధుండు,
మంత్రాంగవేది, కుమార మోది,
కరుణాంతరంగుండు, ఘనరాజ సంగుండు,
బంధు సముద్రుండు, బహుళభద్రుఁ,
డతులితకీర్తి, యనంగ సదృశ మూర్తి,
పాపదూరుండు, దైవత పరుండు,



అయ్యగారి వీరభద్రరావు,

రాణీగారి సోదరీభర్త.

గీ. మాతృపితృ భక్తి యుతుఁడు, రమా సహితుఁడు,
శుద్ధగుణవప్రి మల్లికార్జున వరప్రి
పాదరాయ బహద్దరు స్మరణసేయ
ననువుపడె నిటఁ బాలక జనకుఁడగుట. 22

—♦ మా తృ స్త వ ము ♦—

మ. తరుణీరత్నము, సాధ్వి, భాగ్యవతి, నిత్యస్తుత్య-సత్యక్షమా
నిరతిప్రాభవ భద్రధర్మరచనా నిర్ణిద్ర ధీముద్ర, సు
స్థిరబంధువ్రజమా, మహావిజయలక్ష్మీ పాలకాం బాద్వయిం
గరముం బ్రీతిస్మరింతు భక్తిగమరన్ శశ్వద్గతిన్ హృద్గతిన్. 23

—♦ బా మ్మ గా రు ♦—

గీ. ప్రకట గుణసాంద్ర శేషమ్మ బామ్మగారు
నాటిపెంచిన వృక్ష మీనాటివఱకుఁ
బెరిగి శాఖోపశాఖలై విఱిగె నిపుడు,
చిన్నమాదేవి తనువుఁ ద్యజించు కతన. 24

ఉ. ఆ వినుశీలలామ సమయంబున గాలిని ద్రోపుజేసి, సం
భావిత వంశవర్ధన సుపర్వులు మెచ్చఁగఁజేసె, శేషమాం
బా విబుధాగ్రగణ్య, పరువంబున నీ సహధర్మచారిణీ
భావనఁగూర్చె, నీ సకలవైభవ మామెదిగాదె! చిన్నమా! 25

ఉ. నీవును జిన్నవృక్షమును నిల్పితి, వామె మనోరథంబు నా
దైవము సానుకూలముగఁ దన్పెను; గోత్రవివృద్ధి గల్గె; సౌ
ఖ్యావహమై ధరాస్థలి నఖండముగా వెలుఁగొందు వంశ, మిం
కీవును నేను నామెయు మహింగడుధన్యుల మెన్నఁ జిన్నమా. 26

శా. ఆలించెన్ బహు సత్పురాణముల నార్యశ్రేణి బోధింపఁగాఁ
గీలించెన్మది వాసుదేవ పదపంకేజాతముల్ భక్తిచే,
లాలించె న్నను బ్రేమమీఱఁగను బాల్యంబాదిగా, దీనులం
దేలించెన్ ధనవృద్ధి నింతులుమహిన్ శేషాంబకు న్సాటియే? 27

## —§ తనయలు §—

చ. ప్రథమ కుమారి హైమవతి, బంధుసువత్సల, సత్యశీల, స
త్ప్రథ వర వర్తనామహిత, భ్రావుక దృగ్విభవాభిరామ, నీ
రధిసమ సద్గభీరతర రంజిత భావ, శుభంబుఁగాంచెడున్
బుధజన మాననీయ గుణ భూరియశోధన సంపదున్నతిన్. 28

గీ. ప్రథమ పుత్త్రికయగు హైమవతి పతిరత
పార్వతీదేవియే యనఁ బరఁగుఁగాదె !
చిరము సౌభాగ్యవతియుఁ జిరంజీవితయును,
గలిగి సంతానవతియగుఁగాక ! ధరణి. 29

ఉ. సూక్ష్మమతిప్రసిద్ధ, బహుశుద్ధచరిత్ర, పవిత్ర, శ్రీమహా
లక్ష్మి, ద్వితీయపుత్త్రి, కమలావర పాదసరోజ చింతనా
లక్ష్మ హృదంతరాళ, విమలప్రకటీకృత భవ్య సద్దయా
పక్ష్మల, సోదరీజన శుభప్రియ, సన్నుతి కెక్కె విమలన్. 30

గీ. శ్రీమహాలక్ష్మి గుణలక్ష్మి, రెండవ సుత
పుత్ర పుత్త్రికా సంతాన భూరిగరిమ
భాగ్యశాలిని, బిడ్డల యోగ్యులనుగఁ
బెంచి పెద్దలఁజేయుచుఁ బ్రీతి మనుత ! 31

ఉ. ధీమతి రంగనాయిక, తృతీయ తనూజ, పురాణసుందరీ
కామ, కవిత్వ తత్వ వరకావ్య సుగాన వినోదచిత్త, ని
త్యామిత కార్యనిర్వహణ హర్ష, సుహృజ్జన కాంక్షితార్థ దా
నామృతహస్త, నిస్తుల ధరామర మోదద, పేరుఁగాంచెడున్. 32

గీ. న్యాయవర్తిని శ్రీరంగనాయికమ్మ
వరతృతీయ పుత్త్రిక ధర వరలుఁగాక !
స్వీయ పుత్త్రికా సంతతిఁ బెంచుకొనుచు
భర్తృరాలయి చిరము సంపద్విభూతి. 33



కీ. శే. శేషయ్మారావు బాయమ్మగారు,
రాజాగారు, మల్లికార్జున కుమారుఁడు.

ఉ. శాశ్వత వంశవర్ధన విశాల, చతుర్థ సుతామతల్లి కా
మేశ్వరి, సత్య శౌచ శుభ వీక్షణజాల, పరేంగితజ్ఞ, కా
మేశ్వరి, శాంతకాంతి వరమేదుర రూప విలాసమూర్తియై
విశ్వజనీన వర్తన భువి న్విలసిల్లునుగాక ! నిచ్చలున్. 34

గీ. ఎంచ నాల్గవ దుహిత కామేశ్వరమ్మ
భద్ర సంతాన సౌభాగ్య వరములొప్ప
ధరఁ జిరంజీవియగుచు గోత్ర ప్రవృద్ధి
సలుపుచును భర్తృసేవలఁ జెలఁగుగాక ! 35

మ. పరమజ్ఞాన ధనాధికార పదవీ మందారు యోషిజ్జన
స్థిరభాగ్యోదయ, పంచమాత్మజ, సతీశ్రేణీ శిరోరత్న, మ
ధుర లావణ్య, సుశీల, సద్గుణ లసత్పుణ్యాఢ్య, యూ నన్నపూ
ర్ణ రమావైభవ పుత్రసంతతులతో రంజిల్లు నెల్లప్పుడున్. 36

గీ. పంచమ తనూజ యన్నమ్మ పరమ యోగ్య
భర్తృ సంతాన సేవల వరలుచుండి
సకల సౌభాగ్య భాగ్య ప్రశస్త సంత
తులను శ్రీదేవితోఁ దులఁదూఁగుఁ గాక ! 37

శా. సారాచార పరాయణత్వమతి, శ్రీ షష్ఠాత్మ సంభూత, వి
స్తారజ్ఞాన కళాకలాప రచనా స్వాతంత్ర్య, సద్వైభవ
స్వారస్యామృత తుల్య వాగ్విభవ, దేవబ్రాహ్మణార్హార్చనా
పారస్వాంత, శకుంతలాభిధ కడున్ వర్ధిల్లు శ్వశ్రూ స్తుతిన్. 38

గీ. ప్రియశకుంతల షష్ఠతనయ, సుసాధ్వి,
పుత్ర పుత్రికా బంధు ప్రపూజ్య యగుచు,
భర్తయే దైవమని సేవఁ బరపుకొనుచు
నెల్లకాలము వసుధ వర్ధిల్లుఁగాక ! 39

శా. న్యాయపథప్రవిష్ట, కరుణారస పూరిత దృగ్విలాస, మే
ధాయుత శాంతరూపిణి, సుధామయ సత్య వచోవిశేష, నా
హాయ వర ప్రమోద, ధనభాసుర, సప్తమపుత్రి, బాలవెం
కాయమ, రాణివాసమునఁ గ్రాలు సుతాళులతో శతాబ్దముల్. 40

సీ. సప్తమ తనయ, వెంకాంబ సాధ్వి, రమణి,
వర పతివ్రత, సౌభాగ్యవతియగుచును
విపుల సంతోషమును గాంచి, విపుల నెపుడు
సిరియు, సంపత్తి గల్గి వసించుగాక ! 41

—§ దత్తపుత్రుఁడు §—

ఉ. మాకుఁ బ్రియుండు, దత్తత కుమార భుజంగుఁడు, మందహాస వీ
క్షా కమనీయ వక్త్రుఁడు, ప్రశస్త గుణాకరుఁ, డార్యసన్నుతా
స్తోక విలాస సత్య పరిశుద్ధ కృపా సహితుండు, శాంత వా
ణీ కలితుండు, మాతృ పితృ నిర్మల భక్తియుతుండు రాజిలున్. 42

ఉ. మాకు ననుంగు పెంపుడు కుమారుఁడు, నాల్గవ బిడ్డబిడ్డ, పెం
జోకగలాఁడు, పూవిలుతు సోయగమున్నగుచెన్ను, జిన్నమన్
సాకినయట్లు నన్ను నరుసంబునఁ జూచెడు తెన్నుఁగల్గి, మా
కీకడ వంగడంబు వెలయించు భుజంగుఁడు, చిన్న యేలికై. 43

గీ. చిన్నమాదేవి సంతాన మన్నిగతులఁ
దల్లిఁబోలుచు ధరణి వర్ధిల్లుఁ గాక !
వర దయామయుండగు భగవంతుని కరు
ణాకటాక్ష సద్వీక్ష ణౌన్నత్యమునను. 44

—♦ అల్లురు ♦—

గీ. వడ్లమన్నాటి సద్వంశ వర్ధనుండు,
ప్రథిత వేంకట సత్య నారాయణాఖ్యుఁ
డగు జమీందారు, మేధావి, యతఁడు మాకుఁ
బ్రథమ జామాత, యోగ్యుఁడు, భాగ్య వశుఁడు. 45




1. వ. వెంకట నారాయణరావు, పెద్దల్లుఁడు. 2. ల. శరభసత్యనారాయణ, ఆఱవయల్లుఁడు. 3. అయ్యగారి చిరంజీవి, మనుమరాలిభర్త.
4 వ. దామోదరరావు, నాల్గవ అల్లుఁడు. 5. రాజా కం. వెంకటసుబ్బారావు, ఐదవ అల్లుఁడు. 6. రాజా కం. బాలసూర్య ప్రసాదరావు, 7 వ. అల్లుఁడు.

గీ. వడ్లమన్నాటి నరసింహ వరుని సుతుఁడు,
ప్రాడ్వివాకుఁడు, దామోదర ప్రధాని,
పట్టభద్రుఁడు, విజ్ఞాని, ప్రాజ్ఞుఁడితఁడు,
మాకు నాల్గవ యల్లుండు మహిత యశుఁడు. 46

గీ. అనఘుఁ డుర్లాంజమీందారులందుఁ బెద్ద,
కందుకూ ర్యన్వయ ప్రభాకరుఁడు, మరుఁడు,
శుద్ధ హృదయుఁడు, వేంకట సుబ్బరావు,
మాకుఁ బంచమ జామాత మాన ధనుఁడు. 47

గీ. సూరి, శ్రీలక్కరాజు స త్సుబ్బరావు
పట్టి, ప్రాడ్వివాకుఁడు, పట్టభద్రుఁడైన
శరభ సత్యనారాయణ శర్మ, ఘనుఁడు,
మాకు నాఱవ యల్లుండు, మంజు గుణుఁడు. 48

గీ. బాల సూర్యప్రసాదరా ట్ప్రభువరుండు,
వరముఁ డుర్లాంజమీందారు, పరమ నీతి
పరుఁడు, శాంతుఁడు, దాంతుఁడు, భద్రగుణుఁడు,
మాకు సప్తమ జామాత, మాన్యకీర్తి. 49

గీ అయ్యగారి చిరంజీవి యన్నబుద్ధి,
పట్టభద్రుఁడు, సోదరీ ప్రథమ సుతుఁడు,
మనుమరాలికి భర్త సౌమ్యస్వభావుఁ,
డతనిఁ జిన్నాంబ ప్రేమించె నాత్మజునిగ. 50

గీ. వసుధ వీరలు షట్చక్రవర్తుల వలె
ధన కనక ధాన్య వస్తు వాహన సమృద్ధి,
పుత్త్రి పౌత్రాభివృద్ధి పరిపూర్ణతరము
గాఁ, జిరంజీవులగుదురుగాక ! సతము. 51

గీ. మాకు రెండవయల్లుఁడు మహిత యశుఁడు,
బ్రియుఁడు, గురుజాడ వెంకట కృష్ణమూర్తి,
కీర్తికాముఁడు, యోగ్యుఁడు, గీర్తిశేషుఁ
డయ్యెఁ బ్రారబ్ధ కర్మ మూయఁగ ధరిత్రి. 52

ఉ. పట్టపరీక్షలో మొదటివాఁడుగఁ దేలిన ప్రాడ్వివాకత,
న్బట్టునఁ జెన్నపట్టణమునన్ హాయికోర్టున న్యాయవాది, సం
ఘట్టన మేటియై ప్రతిభఁగాంచిన ధీరుఁడు, న్యాయమూర్తి యా
పట్టున దేహమున్విడిచెఁ, బ్రాప్తము లేదది బాంధవాళికిన్. 53

గీ. వర తృతీయ జామాతయు, వాడరేవు
జోగరాయాఖ్య వరలు పూజ్యుఁడు, సురూపి,
మిత్తి కెఱయయ్యె ; సుగుణసంపత్తి నతఁడు,
సకల జన లోచనానంద నికరుఁ డకట ! 54

— జనక కుటుంబము. —

— మాతృపితృ స్మృతి —

మ. వర మంత్రిప్రెగడాన్వవాయ కలశీ పాథోధి రాకా నిశా
కరుఁడౌ మల్లయమంత్రి భాస్కరుని వేడ్కల్మిఁ గేల్వట్టి, ని
ర్భర సౌజన్య విధేయ భావమున భర్తన్ దైవ భావంబుతో
స్థిరతం గొల్చి కృతార్థయైన జనయిత్రిం గొల్తు వెంకాంబికన్. 55

గీ. ప్రథమ సహజుఁడు వేంకట రామయాఖ్య
పట్టభద్రుఁడు, మఱి ప్రాడ్వివాకుఁ డతఁడు
సురపురికి నేగెఁ బ్రాజ్ఞుని సుతుని విడిచి
యతని వంశము వర్ధిల్లి యలరుఁగాక ! 56

గీ. సహజుఁడైన మార్కండేయ సదభిధానుఁ
డమల గుణశాలి, బహు కుటుంబాధికారి,
సత్యసంధుఁడు, మేధావి, శాంతమూర్తి,
పుత్ర పౌత్ర ప్రపూర్ణుఁడై ధాత్రి మనుత. 57





ము. వెంకమ్మగారు, రాజాగారు, వెంకట్రామయ్య, మార్కండేయులు,

సం. మాణిక్యాంబ,

**రాజావారి జనక కుటుంబము.**

గీ. వర సహోదరి భర్తృ సేవా పరాయ
ణ యగుసాధ్వి, మాణిక్యాంబ, నమ్రచరిత,
భాగ్య సౌభాగ్య సంతాన వతి, పతియగు
సూరి నండూరి వేంకట సుబ్బరావుఁ
జిరము వర్ధిల్లెదరుగాక ! శ్రీలఁజెలఁగి. 58

గీ. అగ్రజుని పుత్రికారత్న మైనతార
కమ్మ, బహుకుటుంబినియు, సౌమ్య స్వభావ,
వర పతివ్రత, సౌభాగ్యవతి, సుశీల,
ధరణి నూటేండ్లు వర్ధిల్లి వరలుఁగాక ! 59

గీ. చిన్నమాదేవి వీరల స్వీయజనుల
కన్న మిన్నగఁ బ్రేమించె, నెన్నఁడైన
లేవు పొరపొచ్చెములు గన లేశమైన,
సామరస్యంబు పొసఁగఁ బ్రశస్తసరణి. 60

—◆ ఉర్లాము రాజాగారు ◆—

సీ. ఒకచేత శంఖంబు, నొకచేతఁ బుంఖంబు
నే రాజమౌళి ద్విజేడ్యతఁగొనె ?
నొకయెడ రుద్రాక్షు లొకయెడ సద్రాక్షు
యే వరలక్ష్మ ప్రభావతఁగనె ?
నొకకంట నయమును, నొకకంట భయమును
నేసత్ప్రసాద త వాసిఁజూపె ?
నొకచెవి ధ్యానంబు, నొకచెవి గానంబు
నే రాయబహాదరు కోరి నింపె ?

గీ. అతఁడు ధన్యుండు మాన్యుండు హితసుపుత్ర
పుత్రికా పౌత్రపౌత్రికా మిత్ర బంధు
వత్సలుఁడుఁ బండితావన పండితుండు
మేదినీదేవ లక్ష్మీప్రసాదరావు. 61

గీ. తలఁప విద్యాపురాండ్రతి ధన్యతమలు
భర్తలకుమున్నె పోయిరి స్వర్గమునకు;
బావగారైరి ధన్యులు, పడఁతి వెనుక
చనుట ; నేనార్తిఁజెంది యిచ్చటనెయుంటి. 62

గీ. నరుఁడు మధుపాన మత్తుఁడై మఱచు జగము,
మత్తువిడిపోవ జ్ఞానసంపత్తిఁగాంచుఁ ;
బ్రకృతి సంస్పర్శ దైవము బరపుసృష్టి
గ్రహణముడిగిన తఱి నిర్వికల్పుఁడగును. 63

గీ. ప్రకృతి, పురుషునకర్ధాంగలక్ష్మి, యతఁడు
కడు వశంవదుఁ, డీసృష్టికార్య మామె
నిర్వహించుట నీరీతి నెగడె, దేవి !
పాపభూయిష్ఠమయ్యె స్వభావమెల్ల. 64

గీ. పంచభూతాత్మక మగు ప్రపంచకంబు,
వానికిం గర్త దైవము వరలు నేమొ ?
అవి నశింపవు ప్రళయమునందుఁ గూడఁ
జిన్నమా ! సృష్టి విజ్ఞాన మెన్న నిదియె. 65





కీ. శే శ్రీ రాజా కందుకూరి లక్ష్మీప్రసాదరావుగారు,

రాజాగారి విస్వంకుండు.



## 8. దానధర్మములు.

ఉ. జంకు నొకింత గాంచ కనిశంబు నుదార మనఃప్రవృత్తి యం
దంకురమైన సత్కృతుల నట్టెరచించి ముగించు, దీర్ఘమా
శంకను గాలయాపనము సల్పదు, చిన్నమదేవి, తానిరా
తంకముగాఁ బరాత్పరుని ధామముఁ జేరె నసంశయంబుగన్. 1

ఉ. వేలకువేలు రూప్యములు బీదజనంబుల కర్హారీతి ను
ద్వేలత గుప్తదానము లభీప్సితసిద్ధిగఁ జేసెగాని, యే
లీలఁ దృతీయసాక్షికది లేశమునేన్ దెలియంగనీయు, దా
శీలము చిన్నమాంబికకె చెల్లునుగాదె! ధరాతలంబునన్. 2

ఉ. బంగరు కంకణంబులఁ గృపం దన పాణులనుంచి తీసి, పు
ణ్యాంగన చేతులం దొడిగి యంపె నుదారముదంబుతోడ, ని
స్సంగతి నిట్టిత్యాగము ప్రశంసకుఁ బాత్రముగాదె! యీసతీ
సంగముగాంచి ధన్యత నెసంగితిమంచు నుతింపఁజెల్లదే? 3

మ. పసపుం, గుంకుమ, చీరలున్, రవికెలుం, బండ్లిద్ధతాంబూలముల్,
వెస ముత్తైదుల కెల్లవేళలను సంప్రీతిన్సమర్పించు; నే
దెసఁబోసియును రిక్తహస్తముల నాత్మీయ ప్రజావర్గ, ము
ల్లసమందంగను; జిన్నమాంబ గుణజాలం బెన్నఁగా శక్యమే! 4

శా. చూడన్వచ్చిన వారికెల్లరికి నిచ్చుంబో ఫలాహారముల్
వేడన్వచ్చిన యర్థికోటులకిడున్ వేగాంక్షితార్థంబులన్;
వ్రీడాభారముఁజెందు లేదనుట కార్ద్రీభూత చేతస్కయై,
జోడీసాధ్వికిఁ జిన్నమాంబికకు నీక్షోణిం గనంగల్గునే? 5

చ. క్షణగతి వచ్చిపోవుఁ గలుషంబులగుఁ సుఖదుఃఖ సంపదల్ ;
తృణముగ నెంచనోపు; విరతిం గలిగించెడి త్యాగిగల్గు, స
ద్గుణముల నాశ్రయించుటయె కూడును మానవజాతికంచు, నీ
గుణవతి చిన్నమాంబ పలుకుం దొలుకాడు ముదంబు పెంపునన్. 6

చ ధనమును లోకసంపదలు, దార సుతాదిక బాంధవాళియుం
దనువు దొరంగ వీడెదరు, తత్పరతన్ భ్రమఁజెంది, సత్యసా
ధన విధులం త్యజించి, నిరతంబును దుష్కృతు లాచరించుటల్
చెనటితనంబుగాదె ! యని చింతిలుఁ జిన్నమదేవి నెమ్మదిన్. 7

మ. సగుణబ్రహ్మమొ ? నిర్గుణంబొ ? తెలియన్ శక్యంబుగా దేరికిం,
బగసాధింపఁగ నేల ? మానవులిలన్ వాదోపవాదంబులన్ ;
జగతిన్ ధర్మపథానువర్తనము విజ్ఞానానుసంధానమౌ
నొగి, నంచున్ మనచిన్నమాంబ పలుకున్ యోగ్యస్థితప్రజ్ఞచేన్ 8

ఉ. బిడ్డలమీఁది ప్రేమ, పరిభవించిన భూతదయాప్రవృత్తిఁ, బే
ర్వడ్డ పరోపకార బుధరంజన దీక్షయు, దైవభక్తి, మా
రొడ్డని సత్యశీలతతియున్, బుధవర్గము మెచ్చునట్టి దా
దొడ్డమనీష చిన్నమ వధూమణికే తగెఁ జిత్తశుద్ధిగన్. 9

గీ. సమతఁ బ్రత్యక్ష సౌఖ్యంబు సంతరించు
సుజన సంసేవనంబు ప్రస్ఫుటముగాఁగ,
నిచ్చువారును, గొనువారు, నేకఫణితి
సంతసించెద రనిపల్కు సాధ్విసతము. 10

ఉ. చీమను ద్రొక్కిన న్మది విశేషముగా నెగులొందు, నెల్లరున్
క్షేమముఁ గాంచఁగోరు, మది సేగిఁదలంపదుఁ కష్టవార్తలం
గోమలివిన్న సొమ్మసిలి క్రుంగును భూస్థలి నొక్కపెట్టునం ;
దామసవృత్తిలేని వనితామణి చిన్నమదేవి సర్వదా ! 11

ఉ. భావి విధానము ల్వివిధ పద్ధతులన్ గణుతింపవచ్చు సం
భావనజేసి, దానను క్షమున్ ఫలమేమియులేదు ; కావునం
గేవల మాత్మశుద్ధిఁ గలిగించెడి ప్రాకృత సత్ప్రవర్తనం
బావనతన్ గడింపనగు, భవ్యమను న్మన చిన్నమాంబయున్. 12

ఉ. జీవితకాలమెల్ల సుఖజీవనముంది యథార్థ పద్ధతిం
బావన దేశసేవ బుధవర్యులు మెచ్చఁగ నాచరించిన్
దేవుని సన్నిధానమున నిత్య నివాసము చిక్కునంచు శ్రీ
దేవి, దయామయాత్మ, సుమతిం బ్రకటించెను జిన్నమాంబయున్. 13

ఉ. నిత్యపదార్థమొక్క టవనిం గన మన్నినశించునెప్పుడో
సత్యముగా వచించెదము, చావక తప్పను, దేనికీగతిం
బ్రత్యహముం బ్రజాహనన పాతక మంకుట ? కూడదంచు, సాం
గత్యము చేయు చేడెలడుగం బ్రతిబల్కును జిన్నమాంబయున్. 14

చ. తనువు లశాశ్వతంబు, లమృతంబులుగావు ; వియోగ మెన్నఁడో
పనిఁగొనివచ్చు ; దానికయి భ్రాంతినిజెందిన దుఃఖహేతువౌఁ ;
దనివి నొసంగఁజాలిన విధానము దోఁపదు ; సౌమ్య వర్తనం
బునఁజని, జీవయాత్రఁగని, పోవుట మేలను జిన్నమాంబయున్. 15

ఉ. పావన ధర్మశాస్త్రములఁ బండితవర్యులు, శక్తియుక్తి మే
ధావులు, గూర్చ, సత్ప్రభు లుదారత వర్తిలఁజేసె, రట్టిసం
భావన దుష్ప్రవర్తనలు భంగముఁజేయుచునుండి రీర్ష్యమైఁ
దావల మెట్లు కల్గునని తాలిమిఁదూలును జిన్నమాంబయున్. 16

ఉ. ఏగతినైననేమి ? మనమీభువి జన్మను గాంచినందుచేఁ
ద్యాగముఁబూని, స్వార్థపరతంత్రత వీడి, పరోపకార స
ద్యోగమునందు జీవ విని యోగము సేయుట మేలటంచు, నీ
భాగవతాగ్రగణ్య, కలభాషిణి చిన్నమదేవి పల్కెడిన్. 17

ఉ. లోకవిడంబనార్థ మవిలోమ విలోమములందలంప క
స్తోక ధనవ్యయంబుఁగని, సుక్రియ నశింతురు క్రూరకర్ములై;
వేకువఁజెంది ప్రాకృత వివేకముతోఁ బరసేవఁజేసి, సు
శ్లోకులుగాఁ దరింపనగు సుమ్మని చిన్నమదేవి పల్కెడున్. 18

గీ. బ్రదికియుండఁగ జీవుఁడు శ్రద్ధఁజేయు
సుకృత దుష్కృత వాసనల్ ప్రకృతి నిలుచుఁ;
దక్కినవియెల్లఁ దనువుతోఁ దరలిపోవు;
సిద్ధినందుఁడు సత్కృతిఁ జేసియునును. 19

గీ. సర్వ సామాన్యముగఁ బుట్టిచచ్చు వారు
స్వార్థపరులయి తన్మయత్వముఁ గనెదరు;
చిన్నమాంబయు సత్ప్రజా సేవసలిపి
ధరఁ జిరస్థాయియయ్యె నందఱి మనముల. 20

ఉ. భూతల కీర్తిచంద్రిక లపూర్వముగా రుచులీనునంత కా
భూతము లూర్ధ్వలోకమునఁ బుణ్యఫలంబుల నందుచుండుటా
ఖ్యాతము; చిన్నమాంబ లసదాత్మ పరాత్పర సన్నిధాన సం
జాత ఫలంబులందుకొను స్వర్గమునందని చెప్పఁగల్గునన్. 21

గీ. తిట్టువారిని దీవించు, దీనజనులఁ
దృప్తిఁగావించు, మెప్పునుఁ దృణమొ పణమొ
యొసఁగి, దండింప కేరిని బసదలిర్ప;
నని ప్రబోధించుఁ జిన్నమ్మ యనవరతము. 22

గీ. పుట్టినింటను వర్తించునట్టి సకల
దాస దాసీజనంబు లత్యంత దుఃఖ
సాగర నిమగ్నులై కేమె చావువినఁగఁ;
పెట్టి పోషించినదివారిఁ బ్రీతితోడ. 23

ఉ. చిన్నతనంబునందు దరిఁజేరి సుఖంబుగ నాటపాటలం
గ్రన్న మెలంగుబాలికల కష్టసుఖంబుల నాలకించి, పై
సన్నల నాదరించి, తగుసత్కృతిఁ జేసెడి సామరస్యమీ
చిన్నమదేవి పున్నెమునఁ జేరెను బుట్టుకతోడ నున్నతిన్. 24

ఉ. బాల్యమునందు సఖ్యమున వర్తిలినట్టి సఖీజనంబు సా
కల్యతనీమె యాదరణఁ గాంచిరి పూర్తిగ, నిట్టిగొప్ప సౌ
శీల్యము చిన్నమాంబికకె చెల్లె సఖీజనలోకమందునం
దుల్యముగా నిలింపులును దూఁగరు, తూఁగరు తూఁగరంగనల్. 25

చ. కుజనులు, స్త్రీలుఁ బూరుషులుఁ గొందఱు స్వోదర పోషణార్థమై
స్వజనులపోల్కిఁ బల్కుచును జావములంచురు, గుళ్ళుటంచు, భే
షజ విషయంబు మీరలును సాయపడంజనునంచుఁ గోరఁదా
నిజమునెఱింగియు న్నుదతి నెప్పుని దోడ్పడు ధర్మబుద్ధితోన్. 26

ఉ. చింకిరిగుడ్డఁగట్టుకొని చెంతజరించినఁ జూడఁజాల దీ
పంకజగంధి యప్పుడె నెపంబుగ, జీర్ణదుకూలధారియై
వంకఁజరించు మాయికుని భావమెఱింగియుఁ గొంకులేక యా
వంకరదారిఁ గుప్పిమ్మఁరెడు వానికి వస్త్రము లిచ్చు, దాతృతన్. 27

గీ. పురుడు లేకున్న మాయింటఁ బురుడువచ్చె,
జబ్బు లేకున్న మావాఁడు జబ్బుపడియె,
నన్నవారికిఁ బథ్యపానాది వస్తు
జాలమును జిన్నమాంబ విస్తారమొసఁగు. 28

గీ. వెండిచెంబులు, బంగారు గిండియలును,
నెత్తుకొని పోవువారి దానెఱిగియు ధర
నెఱుఁగనట్టు చిన్నాంబ నటించుచుండు;
నిప్పుగలకట్టెయే గాలుఁ దప్పకనుచు. 29

## —। అ న్న దా న ము ।—

సీ. అన్నదానంబునం దారితేరినచేయి
గుప్తదానమునందుఁ గొమరుమించె
నర్ధరాత్రమ్మునం దతిథివచ్చిన స్వయం
పాకంబుఁ గావించి సాధుసాధ్వి
యన్నపానంబుల నమరుచుతజే వారి
కులగోత్రములఁ బాటిగాన దొకింత
పరిశంధిజనముల కిరవుఁగల్పించుటే
మోక్షసాధనమంచు మొనసిపల్కు
గీ. ధరఁ బరోపకారానుసంధానమునకు
మించు ధర్మంబు దలఁప లేదంచు నూథి
నెల్లవేళలఁ జిన్నాంబ పిల్లలకుప
దేశమొనరించు మించు సందేశకలన. 30

మ. ఘనులౌరా ! యనిమెచ్చ నెన్మిది మహాకన్యాప్రదానంబులం
దనియించె న్నిరతాన్నదానముల భూతవ్రాతముం దృప్తిగన్ ;
ధనధాన్యాదిక గుప్తదానము లనంతంబుల్ రచించెన్, ధరన్
వనితాజన్మము సార్థకంబగుట కబ్రంబే మొయున్ లేనుగా. 31

మ. శుభకార్యంబుల సల్పుపట్టుల మహాశోభాస్పదంబౌ నటుల్
విభవోపేతముగా నమర్చు సకలోర్వీభూత సంతాన మా
రభటిం దృప్తినిజెంది మూర్వలుకఁ బారంపర్య మర్యాద లు
ల్లభముంబట్టును జిన్నమాంబిక సుశీలంబెన్నుచు న్నిత్యమున్. 32

చ. క్రమగతి సన్నిధానమునఁ గాగ్రలెడువారికిఁ బెట్టుఁగాని, యీ
యమ నిజపుత్రసంతతికి నైనను బెట్టదొకింత హెచ్చుగా ;
సుమతి స్వకీయు లన్యులను జూపుఘటింపను పెట్టుపోతలన్ ;
క్షమ సమలెవ్వ రీసతికిఁ జారుగుణాఢ్యకుఁ జిన్నమాంబకున్. 33

ఉ. ఇంటికి బంధువర్గమున నెవ్వరువచ్చిన వారికెట్టి దా
వంట రుచించునో యరసి, పక్వముఁజేసి యొసంగు; నట్టి వా
ల్గంటి మహోపకారము జగద్విదితంబగు ముక్తికాంతయై
వెంటనె యుంటియుండును బ్రవీణత వంశపరంపరాప్తిగన్. 34

ఉ. భోజనపంక్తుల న్వినయ పూర్వకదృష్టుల నేరికేరి కే
యోజను మారువడ్డనల నోమఁగ నోపునొ యట్టికీర్తులం
బూజలొనర్చినట్టి పరిపూత సతీమణి చిన్నమాంబ, మా
రాజిత వంశవర్ధన చిరంబుగఁజేసె మహాప్రసాదమా. 35

గీ. పరమ భిక్షాటనము సేయువారలకును
దృప్తిదీరఁగఁ బెట్టించితీరు నబల
బిచ్చగాండ్రకు లేదనకిచ్చు సమతఁ
జిన్నమాదేవి సౌజన్య మెన్న వశమె ? 36

క. అన్నాతురులై వచ్చిన
నెన్నక నేజాతివార లేని సమృద్ధిం
జిన్నాంబిక మృష్టాన్నం
బున్నతి నిడి పంపు వారలోహో ! యనఁగన్. 37

సీ. ఆత్మజనులకు మంచిపదార్థములిడి
యతిథు లగువారి కభ్యాగతార్థులకును
మారుభోజనమిడను సమ్మానగరిమ ;
పంక్తిభేదము గావింపఁ బాలుపడను. 38

గీ, చిన్నిబిడ్డల కావుపా లెన్నియైన;
నెట్టి వేళలయుందైన, నెవరికైన,
సిద్ధముగనుంచి యిచ్చును జిన్నమాంబ
శిశువులను బ్రీతితోడ బోషించు తల్లి.

గీ. ఘనతరావాహనము విసర్జనము లేదు;
బీదసాదలకను పెనువాదులేదు;
చిన్నమాదేవి యత్తింటఁ జేరినట్టి
నవ్య సుముహూర్త భవ్య దినమ్మునుండి. 40

గీ. అతిథు లభ్యాగతులు వచ్చినంతమంది
షడ్రసోపేతముగఁ దిని చనెద రెపుడు;
వారు వీరను మీమాంస లేదుపడవు
చిన్నమాదేవి పరిపాల నోన్నతియిది. 41

గీ. అమ్మగా రాజ్ఞయియ్యవలె దనుట లేదు,
మాటవారలె స్వేచ్ఛగా వచ్చువారి
కన్నపానాదు లొసఁగెద రున్నతముగఁ,
జిన్నమాదేవి యాజ్ఞ విచ్ఛిన్నమగునె? 42

క. బుట్టలతో మృదులాన్నము
లిట్టి పదార్థముల బ్రాహ్మణేతర జనముల్
పట్టుకపోదురు, శుభముల
పట్టునఁ, జిన్నమ్మ దీన వత్సలగాదే. 43

గీ. పండిత ప్రకాండులు, యతుల్, ప్రౌఢ కవులు,
వేదవేదాంత వేత్తలు, విప్రవరులు,
బాంధవశ్రేణి, రయితులుఁ, బరమ హితులు,
నెలల తరబడి బసచేసి నిలిచియుండ
సకల సౌకర్యములఁ గూర్చు నికటముననె,
యన్నపూర్ణమె గాదె! చిన్నమ్మ ధరణి. 44

గీ. ఫలములును, గూరలును, దినువస్తువులును,
గ్రామములనుండి రయితులు కానుక లిడ,
వీధి వారందఱికిఁ బంచిపెట్టు, దాచి
పెట్టదెన్నఁడుఁ జిన్నమ్మ వీతరాగ. 45

గీ. అన్నసత్రముపలెను మహానసంబు
సందడిగనుండు నేవేళ విమలగుట;
నెడ తెరపి యుండదా వంటయింట నెపుడు,
నన్నపూర్ణయె యగు మన చిన్నరాణి. 46

—♦ భూ త ద య ♦—

గీ. భూతదయకంటె నుత్కృష్టమై తనర్చు
వేఱుధర్మంబు లేదెంత వెదకి కనిన
సకలధర్మంబులును దానిచాటునఁ గల
వనుచుఁ జిన్నాంబ పలుకు ననన్యగతుల. 47

చ అవసరమైన వంటల స్వయంబుగఁ జేయును, పిండివంట ల
వ్యవధిగఁజేయు రుచ్యముగ, బ్రాహ్మణవర్యుల దేవతార్చనల్
వివరముగా గణించి, సఫలీకృత పూజలఁ దృప్తిఁగాంచు, వి
ప్రవనిత, చిన్నరాణి, వరవర్ణిని, భూరి కృపాంతరంగయై. 48

ఉ. పిల్లలు పారశాలఁ జను వేళకుఁ గుంపటిమీఁద వంటఁ దాఁ
జల్లఁగఁజేసి, చల్దినిడి సాకును బ్రీత్యహమున్, శరీర వి
ద్యుల్లత వ్యాధిచే నొగిలియున్నను జిన్నమదేవి, పృథ్వి నీ
తల్లినిబోలు మాతల ముదంబునఁ గాంచుట దుర్లభంబెయౌ. 49

గీ. ధరను మాంసాశనులు గాని నరులు కోటి
కొక్కరును లేరు; పాపమానొక్క హింస
పతితులౌదురె యిందఱు ప్రజలు? దైవ
నియతి యెట్లున్నదని దేవి భయముఁజెందు. 50

గీ. ఫలములును, గూరలును, ధాన్యములును, జీవ
జాతములగును; దద్భక్తి పూత మగునె?
భేదమున్నను హింసయే వాదమునకు;
ధర్మ నిర్ధారణయు నసాధ్యమను రాణి. 51

గీ. వీధి మాధుకరపు కేక వినబడినను
బరిజనులబంపి, నిల్పి, సాదరము మీఱ
నన్నపానాదులను వాని కందఁజేయు
భాగ్యశాలిని చిన్నాంబఁ పరమ సాధ్వి. 52

గీ. ఆర్తనాదము చెవిఁబడ నటమటించి
దుఃఖకారణ మరసి తద్దుఃఖ ముడుపఁ
దగుప్రయత్నము జేయు నుదారహృదయ,
విస్మరింపను చిన్నమ్మ విపుల నెపుడు. 53

చ. వెలయగు మేలిధాన్యముల వెన్నుల కట్టలుగట్టి ప్రీతితో
నిలుపఁగ గోరవారములు నింగిని వచ్చితినన్ మనోజ్ఞమౌ
చిఱుకల యార్పులన్ విని హసించెడి చిన్నమదేవి భావముల్
దలఁప సమస్తభూతసముదాయముదావహముల్ ప్రసవంబుగన్ 54

గీ. కాకులెల్లర మేల్కొల్పఁ గావు కావు
మనెడి తరుణమునందు మేల్కనుచుఁ గాల్య
కృత్యములఁ దీర్చికొని గృహకృత్యములకు
దిగిన శయనించు వఱకును దిరుగుచుండు. 55

గీ. మిట్టమధ్యాహ్నమునసైన మితిగ క్షణము
విశ్రమింపక గృహకృత్య విధుల మెలఁగు;
విసువుఁజెందదు సేవకుల్ విశ్రమింపఁ,
దానె సవరించుఁ బనుల శాంతముగ రాణి. 56

గీ. ఇట్లు స్వయముగ శ్రమపడ నేల యనినఁ
దమ దివాణములోన వ్యర్థముగఁ దినుట
తగని పనియని ప్రతిబల్కు ధర్మమూర్తి,
పిల్లలకు సేవఁజేయుట ప్రియతమ మను. 57

క. తిన్నది జీర్ణంబగుటకుఁ
బన్నితి నీ భూత తృప్తి వర్ధక సేవల్
పున్నెములమూట మనకని
చిన్నాంబిక పల్కు-చుండుఁ జిత్త విశుద్ధిన్. 58

క. నవనాగరక ప్రభువులు
జవసత్త్వములుడిగి జీర్ణ శక్తిహరింపం
దవిలెదరు బంతులాటల
జవరాండ్రను నింటిసనులె సరిపడు ననెడున్. 59

గీ. తేలు కనుపింప దానిని దెప్పచేసి
చంపనీయను పట్టించి పంపివేయు ;
సతి దయారస పూర్ణ ప్రసక్తియగుటఁ
జిన్నమాదేవి సౌహార్ద్ర చిహ్నముగద ! 60

గీ. పిచ్చుకలుచేరి గదిలోన విచ్చలవిడి
నద్దముల చాటునను గూళ్ళ నమరఁగట్టి
గ్రుడ్లఁబెట్టుచుఁ గిచకిచఁ గూయుచుండఁ
దోలనీయవు, నీబుద్ధి మేలుదేవి. 61

గీ. ఇంటి నిండను గుమిగూడి యెలుక లెన్ని
వస్తువులఁ బాడు చేసెనఁ బట్ట నీక
ధాన్యముల బోసి పెంచు నీదయను బొగడఁ
దరముగా దేరికైన నీ ధరణి, రాణి. 62

# 9 శ్రీ రాణీ చిన్నమ్మా రావు సత్రము.

సీ. గుంటూరుపురమున కుగ్లరు దొరసాని
యాసుపత్రిఁ జికిత్సనందు సతుల
సౌకర్యకర ధర్మశాలను నిర్మించె
నేబది వేలకు హెచ్చుధనము
వెచ్చించి; ముప్పది విపుల కుటుంబముల్
బససేయుటకు మంచి వసతి కలదు;
ఇరువ దేశములనుండి యెందరెందరో జను
లందు వసించి సౌఖ్యంబుఁ గనుట

గీ. జన్మ సాఫల్యమయ్యె నిశ్చయముగ; నని
స్వయముగాఁ జూచి యానంద సాగరమున
మునిఁగి తేలెను జిన్నాంబ దనివిఁదీర
సార్థకముగాదె! యీజన్మ వ్యర్థమగునె? 1

ఉ. ముప్పదిమంది రోగుల కమోఘముగాఁ బసగూర్చి సంతసం
బొప్పఁగ నెల్లకాలము శుభోదయుత న్ననుకూర్చినావు, నీ
గొప్పను వేనవేలు ప్రముఖుల్ కొనియాడఁగ, మృత్యు వేగతిన్
ముప్పును గూర్చు నీకు! ధర మోహనమూర్తివి చిన్నమాంబరో 2



కీ॥ శే॥ డాక్టరు కుగ్లరమ్మగారు

జననము 19-4-1856 మరణము 26-7-1930

గుంటూరు ప్రవేశము 29-11-1883

ప్రాయము 74 సం॥ లు సేవ 47 సం॥ లు

“ ఆమె శవవిశ్రాంతిలో ప్రవేశించెను ”



కీ॥ శే॥ రాణీ చిన్నమ్మారావు గారు

జననము 1883 మరణము 1938

గీ. రాజకార్యముల కొఱకు రక్తిఁ దిరుగు
వార లన్నవిక్రేతల వసతులందు
గడుపుకొనవచ్చు;రోగార్త కామినులకు
వసతి కుదురదు,చిన్నమ్మ వసతిగాక. 3

చ. ఒకపరి సత్రమందు దిగియుండిన మానవు లెల్లకాలముం
బ్రకటనఁ జేయుచుండెదరు భక్తిని జిన్నమదేవి దాతృతన్;
సకలజనుల్ సుఖింపఁగల సత్కృతి;లక్షలు పొంది రీదయన్;
వికలముగాదు చిన్నమ వివేకము నెంచ జగత్త్రయంబునన్, 4

గీ. అరసి పెద్దమ్మయని పిల్తు రచటిజనులు
కుగ్గరమ్మను; జిన్నమ్మ కూటమందు
జనను గావించి,పెద్దమ్మ వైద్యశాల
కేగెదరు మందుఁగొనుటకు రోగులెపుడు. 5

క. చిన్నమ్మకుఁ బెద్దమ్మకు
సన్నిహితంబైన సూక్ష్మ సంబంధంబై
యున్నది; రోగులు సత్రపు
టున్నతిఁగని, వైద్యశాల నుందురు పిదపన్. 6

గీ. చిన్నరాణికిఁ గుగ్గరు కన్నతల్లిఁ
బోలె నిహాపర సౌఖ్యముల్ పొందుపఱచె;
నామె గుంటూరు వైద్య శాలాధికారి
ప్రతిభ ధన్వంతరిని మించె వైద్యమందు. 7

గీ. ఆంధ్ర రాష్ట్రమునందుఁ జిన్నాంబపేరు
విననివారుండ, రా సత్రమునను వారో?
బంధువులో? యెప్పుడో? దిగి, ప్రతిభఁ గాంచి
యుందు రాగర్త నగరము నందు, నిజము. 8

గీ. తరతరంబులనుండు నీ ధర్మశాల
సుప్రజాసేవఁ గావించుచుండు కతన
శాశ్వతంబుగఁ జిన్నమ్మ సత్రమనఁగ
వరఁ జిరంజీవివైతివి ధరణి, దివిని. 9

గీ. ధర్మశాలను బ్రతియేట నిర్మలముగ
బాగుసేయుట కగుసొమ్ము వచ్చునట్టి
స్థిర వసతినిచ్చి పూర్తిచేసితివి ; దాన
మనఁగ నిటులుండవలదె ! చిన్నాంబ ధరణి. 10

ఉ. పూర్తి నిజస్వరూపమును బోలు శిలాప్రతిబింబ విగ్రహ
స్ఫూర్తిని నీవు సత్రముఖభూమికగా నెలకొల్పినాడ శ్రీ
గర్తపురిన్, ముఖాముఖిని గాంచి తరించుట కద్దిసాధనం,
బార్తిఁదొలంచు మార్గమగునంచుఁ దలంచితిఁ, జిన్నమాంబరో! 11

చ. తలఁపఁ ద్వదీయ విగ్రహ సుదర్శన భాగ్యముగల్గు, నంచుబోఁ
దలఁచిన వారికెల్లరకు ; ధర్మము ధర్మపథంబుఁ జూపు, నం
దలి ఫలితంబు సజ్జన మనఃప్రమదంబగు, భూతతృప్తి కాఁ
గలదని, చిన్నమాంబరో ! జగద్విదితంబగునంచు నెంచితిన్. 12

ఉ నీమహనీయమూర్తి నెదనిల్పితి, నిల్పితి దేశమందు దే
హామయపీడ స్రుక్కుసతులందఱుఁ జూచి ముదంబునంద, నీ
భూమిక ధర్మశాలను ; బ్రబుద్ధ మనోరథసిద్ధిఁ గాంతు, సు
త్రామసుర ప్రసూన వరదామముఁ దాల్చుము చిన్నమాంబరో. 13

చ. తలఁపఁగఁ గుగ్లరాఖ్య వసుధా గలకాలమునిల్చు, నంతకున్
నిలుచును జిన్నమాంబ వరనిర్మల నామము సత్రమందు, మీ
చెలిమియు శాశ్వతంబు, విరచించితి విగ్రహ సుప్రతిష్ఠ, ది
వ్యలలిత కావ్యముం గడురయంబునఁ గూర్చితిఁ జిన్నమాంబరో! 14



Rani Chinnamma Rao's Residential Palace.

రాణీగారి వాస గృహము.



Rani Chinnamma Row's Choultry, Guntur.

రాణీ చిన్నమ్మారావు సత్రము, గుంటూరు.

గీ. మును మతవారసులు ధర్మమును నశింపఁ
జేయ నవకాశమీయక, స్థిరముసుగతి
మిషను వారికదియు సంక్రమింపఁజేసె
ప్రతిభఁగాంచితివటు చిన్న రాణి! తగును. 15

గీ. సత్రములయందు మేటి ప్రశస్తసత్రి
యిది చికిత్సార్థమరుదెంచు మదవతులకు,
వారి చుట్టపక్కములకు, వసతి నొసఁగఁ,
జిన్నమాదేవి నిర్మించె స్త్రీలకొఱకు. 16

— నందిరాజు చలపతిరావు —

ఉ. భూరి పవిత్రసత్రము నపూర్వముగా నెలకొల్పునిచ్చ నా
కోరిమిఁ బ్రోత్సహించి, భవదూర్జిత నామము శాశ్వతంబుగాఁ
గూరిచెఁ, జిన్నమా! వర సఖుండగు నాకు సతంబు పూజ్యుఁడో
పౌరుఁడు, నందిరాజ చలపత్యభిధానుఁడు, ప్రాణమిత్రుఁడై. 17

క. మిత్రుఁడు బాల్యమునుండి, ప
విత్రుఁడు, మేధావి, సుకృత వేద్యుఁడు, నుతికిం
బాత్రుఁడు, ప్రకృతిక మానవ
మాత్రుఁడు, కార్యాభిలాష మహితుఁడు, దేవీ! 18

చ. హితుఁడు, స్వమిత్రబంధుతతి కెప్పుడు, నాకుఁ బ్రియంబుఁగూర్చునే
హితుఁడును, సాహితీపటిమ హెచ్చినవాఁడును, స్వస్వరూప మో
హితుఁడును, బాల్యమిత్రుఁడు, మహింబ్రతిభాయుతుఁ, డెప్డు నాపురో
హితుఁడగు నందిరాట్చలపతేంద్రుఁడు కీర్తిసముద్రుఁ డెన్నగన్. 19

— * పారమ్మగారు * —

క. పారమ్మయనెడు క్రైస్తవ
నారీమణి సచ్చరిత్ర నయవినయ మహో
దార స్వభావయు సదా
చారానూనపరిచార సక్తయు వెలయున్. 20

సీ. కుగ్లరు మి: సమ్మగారితోఁ గూడి ద్వాద
శాబ్దములు స్త్రీల కారోగ్య మలరఁ జేసి,
ఘన దిగంత విశ్రాంత కీర్తిని గడించెఁ;
బారమాంబిక ధర్మప్రవర్తనమున. 21

ఉ. పారమదేవిగర్తపురి వైద్యముఁ జేసిన ద్వాదశాబ్దముల్
భూరికృపాంతరంగ పరిపూరిత చిన్నమతోడ మైత్రి సిం
పార వహించి మించె, తనయాంబును క్రైస్తవ సాంప్రదాయ స
త్సార విరాజమాన గుణసంపద నెన్నికఁ గాంచె మిన్నయై. 22

చ. ప్రభువగు క్రీస్తునందు గల భక్తికి సూచనగా సతీలలా
మ భువిఁ దదీయ సేవకుల మాదిరి చిన్నమ ధర్మశాల స
న్నిభముగఁ గట్టియిచ్చె నవనిన్ తరుణీజన వాసయోగ్యమై
శుభద మగున్ చిరంబు పరిశుద్ధ వరాత్మకు స్థానమై సదా ! 23.



# 10. ఆశ్రితాదరము.

## —♦ 1. విద్యార్థులు. ♦—

ఉ. వేలకొలంది బాలురకు విద్దెల నేర్పఁగ మూఁడువేళలం
జాలిన భోజనంబులిడి, చక్కని దుస్తుల, వేతనంబులన్
లీలనొసంగె; నట్టి సతిలేని కొఱంతను దీర్ప శక్యమే?
బాలుర భావిభాగ్యముల పట్టుగఁ జిన్నమదేవి యుండదే? 1

క. విద్యార్థుల సౌకర్యము
లాద్యంతము నరసి ప్రోచు నార్థికముగఁ, దా
విద్యుల్లతవలెఁ జిన్నమ
సద్యోఫలదాయి యనఁగ జాలదె ధరణిన్. 2

క. ఎందఱి విద్యార్థులనో
మందిరమునఁ జేర్చి సుతుల మాదిరి సాకెన్
వందలు వేలుగ నుందురు
సందియమా! యామె వృద్ధి సలిపిన యువకుల్. 3

ఉ. చిన్నమదేవి పోషణ వసించి సమస్త కళా ప్రపూర్ణులై
మన్ననఁగాంచినట్టి గుణమాన్యులు నేటికి నర్హరీతి న
త్యున్నత రాజకీయ పరమోచ్చదశల్ గని మించుచుండి, రీ
చెన్నుఫలంబు దాతకెటు జెందకయుండు? ధరాతలంబునన్. 4

గీ. ఆంగ్లమునఁ బట్టభద్రులై యలరి గొప్ప
గొప్ప యుద్యోగముల నందుకొనిన ఘనులు
విస్మరింతురె చిన్నమ్మ విద్యనేర్పఁ
దమకు నిడిన సహాయ సంతతుల నెపుడు? 5

గీ. న్యాయమూర్తులు, డాక్టర్లు, న్యాయవాదు,
లున్నతోద్యోగు, లాధ్యాత్మికోత్తము, లయి
వృద్ధిఁజెందిరి చిన్నాంబ పెంపకమున
నెందఱో బాలు; రదిచాలదే! తరింప. 6

చ. పొలఁతి గృహంబునందు నెలవుంగని విద్యలునేర్చు బాలురా
నిలయము స్వీయగేహమని నిల్తురు; వారలఁ జిన్నమాంబ, పి
ల్లలవలె సాకుఁ, బ్రేముడిని లాలనసేయును, వారలెంచ వం
దలకును మించియుండు రది తథ్యము శ్రీమతిభాగ్య మెట్టిదో. 7

గీ. వచ్చు విద్యార్థులకు భుక్తి వసతు లిచ్చి
స్వీయగృహమున విడియుఁగఁజేసి సాకు;
నెందరైనను లెక్కలే దీమె కెపుడుఁ,
జిన్నమాదేవి పున్నెంబు నెన్నఁదరమె? 8

మ. చదువేమూలము సర్వసాధనల విజ్ఞానంబు నార్జింపఁ, బ్రా
జదువు ల్వేదము, లట్టివిద్యలన భాషాసేవఁ గావింప నె
మ్మది సంకల్పము గల్గుబాలురను సమ్మానించి, చిన్నాంబ సా
కు దయన్, భుక్తిని వస్త్ర పుస్తకములం గూర్మి న్సమర్పించు దున్. 9

ఆ. చదువులేనివానిఁ జవటయందురు జనుల్,
భార్యగూడ నలసభావ యగును;
జదువుకొనుఁడని యువజనుల కుద్బోధించుఁ
జిన్నరాణి ప్రకృతి చిహ్నముగను. 10



ముందుప్రక్క,- రాజా భుజంగరావు, వాడ్రేవు నరసింహారావు, నందిరాజు చలపతిరావు, దేవరకొండ మాణిక్యం, ఆదిపూడి ప్రభాకరరావుగార్లు.

వెనుక,- ఉళిక్కి, ఉస్మాన్, సుందరరామయ్య, శోభనాచలం, ప్రకాశంగార్లు.

# 2. పండితులు.

## 1. క్రొత్తపల్లి సుందరరామయ్యగారు.

ఉ. సుందరరామ పండితుఁడు, సూనృతవాది, కవీశ్వరుండు, మా
మందిరసీమ నల్వది సమంబులనుండియు నుండె నాత్మసు
ద్బృందమునందుఁ, జిన్నమనుఁ బ్రీతిఁ బురాణ సమస్తగాథలన్
బంధురరీతి శ్రావ్యరచనం బఠియించెడి కోవిదుండగున్. 11

గీ. గ్రంథముల మాకుఁ గృతినిచ్చి ఘన కవీంద్రుఁ
డమల మాన్యబహుకృతు లందుకొనియె;
నస్మ దాస్థాన విద్వాంసుఁ, డాంధ్ర భాష
కరతలామలకంబను ఘనతఁ గాంచె. 12

గీ. చెప్పెనాబిడ్డలకు విద్యఁ జిన్ననాఁట
నుండి నేర్పెఁగవిత్వంబు నొప్పుమీఱ;
మనుమలకు మన్మరాండ్రకు ననుదినంబు,
నేటికిం జెప్పుచుండె మన్నిలయమందు. 13

## —♦ 2. శొంఠి భద్రాద్రిరామశాస్త్రిగారు. ♦—

గీ. శొంఠి భద్రాద్రిరామశాస్త్రిలను కవియుఁ
జాలకాలము మద్భవ్య పాలనమున
నుండె; నావేదమూర్తి నఖండగతుల
సాకెఁజిన్నమ్మ, దైవమే సాక్షి యనఁగ. 14

## —§ 3. కూచి సత్యనారాయణశాస్త్రిగారు §—

గీ. కూచి సత్యనారాయణాఖ్యుఁడు, కవీశ్వ
రుఁడును, వేదవేత్తయుఁ, బండితుఁడుఁ, బ్రబంధ
రాజమును గృతిగ నొసంగెఁ, బూజనీయుఁ
డతఁడు మాన్యబహూకృతు లందుకొనియె. 15

—। 4. ఆదిపూడి ప్రభాకరరావుగారు ।—

చ. సరసకవిత్వ సంపదఁ బ్రశంసకుఁ బాత్రుఁడు, పూర్వసత్కవీ
శ్వరులకుఁ దీసిపోఁడు, రసభావపటుత్వ పదప్రయోగ సం
భరితుఁడు, సుప్రభాకరుఁ డభంగురవర్తన నాదిపూడి వం
శ రవిసమానుఁ డూర్జితఘన ప్రతిభాయుతుఁ డెంచిచూడఁగన్. 16

గీ. వర పరాశరస్మృతి నాంధ్ర పద్యకావ్య
ముగ రచించి, మాకంకితముగ నొసంగె;
ధర్మశాస్త్రమగుట శాశ్వతముగ నిలుచుఁ;
జిన్నమాదేవి మన్ననఁ జెందె నితఁడు. 17

గీ. కంద రామాయణము వ్రాసి ఘనతఁ గాంచెఁ,
బెక్కు గ్రంథముల రచించి పేరుఁ గాంచె
నాదిపూడి ప్రభాకరఖ్యాత యశుఁడు
నాశ్రితసమూహమున ముఖ్యుఁడనఁగఁ జెల్లు. 18

—* 5. చిల్లరిగె యోగానందకవిగారు. *—

గీ. మధ్వమత సుప్రసిద్ధ ధర్మస్వరూపి
చిల్లరిగె వంశసోముఁ డంచిత కవీంద్రుఁ
డాంధ్ర రామాయణము వ్రాసి నట్టిఘనుఁడు
యోగధనుఁడు యోగానందుఁ డుత్తముండు. 19

గీ. ఈకవీంద్రుఁడు మాకిటఁ గృతినొసంగ
నొక్క సత్కావ్యరాజము నుత్సహించి,
యుభయ తారకమయ్యె నీయుద్యమంబు;
రామచంద్రుని భక్తుఁడు, రాజయోగి. 20

### 6. అన్నమరాజు సుబ్బరాయకవిగారు.

మ. వినుతఖ్యాతుఁడుఁ బండితోత్తముఁడు, సద్విద్యా వినోదుండు, కా
వ్యనిభుం, డన్నమరాజువంశ జలధి ప్రాలేయ భానుండు, బ్రా
హ్మణ వర్యుండగు సుబ్బరాయకవి, యత్యంతాను రాగంబునన్
హనుమజ్జీవిత సత్ప్రబంధకృతిని, దా నంకితంబిచ్చి మా
ఘన సత్కారములంది, చిన్నమకు వేడ్కల్పించె యోగ్యస్థితిన్ 21

### 7. కోన వెంకటరాయశర్మగారు.

గీ. కోన వేంకటరాట్ఛర్మ మానితకృతి
మాకొసంగి చిన్నాంబిక మన్ననలను
గాంచెఁ బండిత సుకవి శిఖామణి గద !
సరస సాహిత్య విద్యా విశారదుండు. 22

### 8. దామరాజు శోభనాచలముగారు.

గీ. తగు నియోగియు, బాంధవోత్తముఁడు, దామ
రాజు శోభనాచలము, ధురంధరుండు,
బాల్యమున నాంధ్రభాషా ప్రభావ పటిమ,
నాకుఁ గూర్చిన గురుఁడు, వివేక ధనుఁడు. 23

గీ. చిన్నమాందేవి మాయింటఁ జేరుటాది
పితృ సమానుఁడుగను సర్వవిధములఁ దుది
వఱకుఁ గాచియుండిన జ్ఞానపరుఁడు, మమ్ము
విడువకుండెను బ్రాణము ల్వీడుచుదనుక. 24

### 9. దేవరకొండ మాణిక్యశాస్త్రిగారు

గీ. నియతి దేవరకొండ మాణిక్య కవియుఁ
జిన్నతనమున గీర్వాణ శిక్షణము నొ
కింత నాకొసరిచిన నియంతయగుటఁ
జరమదశయందుఁ దత్స్మృతి చాలియుండు. 25

—§ 10. గాంధీ మహాత్ముఁడు §—

గీ. పరమ పురుషోత్తముఁడు గాంధి, వర మహాత్ముఁ
డాతని ప్రబోధములఁ జిన్నమాంబ యధిక
భక్తి విశ్వాసములతోడ శక్తికొలఁది,
యాచరణయందు నిల్పెఁ బ్రత్యహముఁ గరము! 26

—♦ 11. కందుకూరి వెంకటసుబ్బారావుగారు. ♦—

గీ. అశ్వినీదేవతల భాస్వ దంశ గలిగి
తరతరంబులనుండి వైద్యమును జేయు
కందుకూరి సుబ్బారావుఘుచునిసంప్ర
తించు చిన్నమ్మ బిడ్డల దేహ రుజల. 27

క. కృతులను మాకొసఁగిన పం
డితులను, గవిచంద్రులను, గడిందిగ సాకెన్
సతి చిన్నాంబిక, తత్త
ద్గతులకు సత్కృతులఁ జేయుఁదగున ట్లెపుడున్. 28

క. పండిత పామర సజ్జన
మండలి నెవేళఁ దా, సమంజస గతులన్
దండిగ సాకుటఁ జిన్నమ
యండను నిల్చెదరు వారలాదృతిఁ గనుచున్. 29

—♦ 12 కొప్పరపు కవిసోదరులు. ♦—

క. కొప్పరపుం గవిసోదరు
లెప్పుడు వచ్చినను వారి నుత్ఫుల్లమతిన్
మెప్పించు నుచిత సత్కృతు
లొప్పిదముగఁ జిన్నమాంబ యురుగతి సేయున్. 30

గీ. నెలలతరబడి వారు మా నిలయమందు
నిలుకడగ నుండ, వలయు నన్నింటిని గూర్చి
స్వగృహమునవలె వారలు సంతసించు
పగిదిఁ జిన్నాంబ సాకె సంభ్రమము మీఱ. 31

ఉ. పండితవర్యు లుర్వర సుపర్వులనాహత వాగ్వివాదముల్
చండతరంబుగాఁ జలుపఁజాలిన ప్రాజ్ఞు లఖండ సత్సభా
మండలిఁ బూజనీయు, లసమాన సుశోభను, లాత్మశక్తి నా
ఖండల తుల్యులయ్యెదరు గాకని పల్కును జిన్నమాంబయున్. 32

చ. చదువుల నారితేరిన ప్రశస్త సమస్త కళాప్రభావ కో
విదులను జిన్నమాంబ ప్రభవించిన విశ్రుతధర్మశాస్త్రి సం
పద నిధులంచు మ్రొక్కి, తగుపద్ధతి సత్కృతిఁజేసి పంపు నే
యదనుననైనఁ, బ్రాజకవులన్న సుధామధుకోక్తులే యనన్. 33

శా. ఏదేశంబున నేజనాంగములయం, దేకాలమందైన, వి
ద్యాదానంబన లోకసమ్మతము, విద్వాంసుల్ సుధామాధురీ
వాద ప్రజ్ఞల నారితేరినవారు దైవజ్ఞాన సంపూర్ణులై,
వేదాధ్యాపకు లట్టివారెయని పృథ్విం బల్కు చిన్నాంబయున్. 34

ఉ. విద్యలమెచ్చి భూపతు లభీప్సితసిద్ధిగ సత్కరింతు, రీ
విద్యలమెచ్చి కాంతలు నవేద్య సుఖంబుల సంతరింతు, రీ
విద్యలమెచ్చి దేవతలు ప్రీతి వరంబుల నిత్తురెంతయున్,
విద్యలఁబెంచకున్న నవివేకము ముంచును జిన్నమాంబరో! 35

క. విదుషీ కవయిత్రుల స
మ్మదమునఁ బూజించుఁ జిన్నమసతీమణి, కో
విదలగు సుందరులను నను
పదమున సేవించుఁదా నపార ప్రేమన్. 36

గీ. సానఁబట్టినరాయి సమ్మానమునకుఁ
దగుట రాజాధిరాజుల తలల కెక్కు,
నటులె విద్వాంసు లమల వాక్పటిమఁగాంచి
లోకసంసేవ్యు లగుదు రాలోకనమున. 37

— 13. శ్రీ గుడిపూడి యిందుమతీదేవి. —

మ. ప్రమదంబొప్పఁగ మాతనూజలకు శోభంజేయు పెండ్లిండ్లకుం
దమి నాథుంబడివచ్చి నూత్నవరులం దత్పుత్త్రులన్ హృద్య ప
ద్యములన్ శ్రీగుడిపూడి వంశజయశద్మాదేవినాఁబోలు నిం
దుమతీదేవి మనఃప్రపూర్వకముగ నొసంపారఁదీవించి, చి
న్నమకు న్హర్షముఁగూర్చి మన్ననల నెన్నంగాంచె నత్యంతమున్. 38

క. గుడిపూడి రామరాయని
పడఁతుక సౌభాగ్యవతిగ బహువత్సరముల్
కొడుకులు, కూఁతులు, మనుమలుఁ
గడువేడుకసేయ వృద్ధిఁగాంచుచు నుండున్. 39

## 3. అమాత్యులు.

చ. సచివులు సత్యసంధులయి సర్వవిధంబుల రాజ్యపాలనం
బ్రచలిత ధీవిశారద పరాయణులై నెరవేర్చి మించిరన్
శుచిదనరార నుర్వర యశోధను లౌదురు మంత్రిపుంగవుల్,
ప్రచురణఁగాంచుఁ దత్ప్రతిభ రక్తి దిగంతముదాఁకఁ జిన్నమా! 40

ఉ. మంత్రులు మంత్రులన్నను సమర్థతఁగల్గి నిమంత్రిణోక్త దు
స్తంత్రములం ద్యజించుచు, స్వతంత్రతఁ గాంచి, విరోధికోటి దు
ర్యంత్రములెల్లఁ గూల్చి, హృదయంబున సత్ప్రభుభక్తి వీడకా
మంత్రిణ సంచరింపఁదగు, మాన్యతఁ గాంచఁదగుం బ్రబుద్ధులై. 41

—♦ 1. వల్లూరి శేషాచలంగారు. ♦—

గీ. లలిత వల్లూరి శేషాచల ప్రధాని
రాజ్యపాలన మొనరించెఁ బ్రిధమముంను
వర గవర్నమెంటు సుపరిపాలనమున
నిషధయోగ్యుఁడు,బంధువు,నీతిపరుఁడు. 42

ఉ. ఆతఁడు రాజకార్యములయందు దసమాన కుశాగ్రబుద్ధి; ప్ర
ద్యోతిత ధర్మవర్తనుఁడనూన యశోధనుఁ, డాత్మసంతతిన్,
భ్రాతల,శాస్త్రవేత్తలుగ,బండితులౌనటు బెంచె, బాంధవ
ప్రీతియుతుండు, సజ్జనుఁ డరిందముఁ, డిద్ధవిశుద్ధుఁ, డెంచగన్. 43

—♦ 2. చోడవరపు నరసింహముగారు ♦—

గీ. అనఘుఁ డేజంటు తాతగారనెడు, చోడ
వరపు నరసింహ మంత్రి,యుర్వర నుమంత్రి
పుంగవుఁడుగనుండి ప్రతిభఁబూజ్యుఁడయ్యె
బంధువర్గములోని ధురంధరుండు. 44

—♦ 3. కంభంమ్మెట్టు శోభనాచలపతిగారు. ♦—

చ వలగొని ముప్పదేండ్లు పనువంబునఁ గంభముమెట్టు శోభనా
చలపతిరాయమంత్రి సరసంబుగ మంత్రిగ రాజ్యపాలనన్
సలుపగ నొక్కరీతిగను సౌఖ్యముతగ్గెను వార్ధకంబుచే;
నిలిచెను స్వీయగేహమున నిర్మల కర్మనిరూఢ గాఢతన్. 45

—§ 4. నందూరి వెంకటసుబ్బారావుగారు. §—

గీ. అరసి నందూరి సుబ్బరాయాఖ్యు, భావు
కుని దివానుగ మీరు చేకొనుఁడు, చక్కఁ
జేయు నన్నిపనులనని చెప్పెనాకుఁ
జిన్నమాదేవి, బుద్ధివిశేషకలన.

గీ. సూరి నండూరి వెంకట సుబ్బరావు
బావగారిప్డు మంత్రిగాఁ బ్రాజ్యరాజ్య
పాలనముచేయుచుండిరి ప్రజ్ఞమీఱఁ
జిన్నమాదేవి యెన్నికఁ గన్నఘనుఁడు. 47

—( 5 ఈమని భీమశంకరముగారు )—

ఉ. ఈమని భీమశంకర మహీన గుణాఢ్యుఁడు, బుద్ధిశాలి, మా
ధామమునం జిరంబు ప్రమదంబునఁ జిన్నమదేవి కాశ్రితుం
డై మసలెం బ్రధానిఁ, గ్రమాగత వృద్ధిని ముదరిణాలయుం
బీ మహితాత్ముఁ డిచ్చఁగొని హెచ్చె స్వశక్తి విశుద్ధ జీవికన్. 48

—♦ 6. దుగ్గిరాల రామదాసుగారు. ♦—

గీ. ప్రాజ్ఞుఁడగు దుగ్గిరాల శ్రీరామదాసు
మంత్రసామర్థ్యమున నసమానుఁ, డిరువ
దోడ్లు లేఖరిగానుండి యేగెదివికిఁ
బరమ విశ్వాస పాత్రుఁ డాప్తజనుఁ డితఁడు. 49

—§ సే వ క పో ష ణ ము. §—

గీ. అడిగినవి యెల్ల నిచ్చుచు నన్నపాన
ములకు లోటులేకుండ నిమ్ముగను బ్రోచు,
బిడ్డలనుబోలెఁ బోషించి పెంచు కతన
సేవకులపాలిటికి మాత చిన్నమాంబ. 50

గీ. జీతములుగాక సేవక శ్రేణి కెపుడు
మూఁడుపూటల భోజనములును బత్తె
కర్చులిచ్చి పోషించెను గన్నతల్లి
పగిదిఁ జిన్నమ్మ ; మరతురె ! వారలెపుడు. 51

గీ. జబ్బుచేసిన వైద్యుల సంతరించి,
సముచితాహారములఁబంపి, సాకు సకల
విధులఁ జిన్నాంబ సేవక వితతి నెపుడు,
శోచనీయము వారికా సుదతిచావు. 52

చ. ఇరువది ముప్పదేండ్లుగ నీసతిచెంగట సేవఁజేసి, రెం
దఱొపరివార ; మందఱునెదం బరితృప్తినిబొంది రెల్లెడం
ద్వారగతిఁ దల్లిపోయిన విధంబున నేడ్చిరి, జీవితంబు దు
ర్భరమని, చిన్నమాంబ జనరంజని, వారు సహింపనేర్తురే! 53

గీ. ఐదు గృహదానములఁజేసె నాదరమున
సేవక జనంబులకు, వారిసేవ మెచ్చి ;
అందఱకుఁ బెండ్లికర్చుల నామె యిచ్చెఁ;
బరిజనులు ప్రీతిపైకిఁ గన్పరుపరొక్కొ ? 54

గీ. ప్రీతిగల సేవకులు సర్వరీతులొప్ప
నుపచరించిరి చిన్నమ్మ యుర్విఁ బ్రబల
వ్యాధి బాధితయై ప్రక్క వదలనపుడు
పరమ విశ్వాసపాత్రులై పరిజనులిల. 55

గీ. నలుబదేండ్లు మాసేవ సలిపి వార్ధ
కమున నిమ్మయేల్ డఫెదారు గాంచ మృతిని,
జిన్నమాదేవి శోకసంభన్న యగుచు
బంధుమరణము రీతిగా వగచె నపుడు. 56

చ. ఋణములఁజిక్కి సేవకులు హింసల నొందఁగ, జాలిఁజెంది దా
రుణ ఋణబాధకు న్వగచి ప్రోచె, ఋణంబులు మాపుజేయ కా
రణములఁ జిన్నమాంబ యనురక్తిఁ దఱొంగని నాకుజెప్పి; పూ
రణములుగాక యుండునె ధర న్సుభటాళుల కోర్కులన్నియున్. 57




చ. ఇలఁగల దద్వితీయమగు నీశ్వర తత్వమొకండు, దానిచేఁ
గలుగుచుఁ బోవుచుండుఁ గలకాలము సృష్టివిధానమంతయుం;
దెలిసి తరింపఁగావలె మదిన్, మతసారము లిట్టివంచుఁ దాఁ
బలికెను జిన్నమాంబ విధివాక్కులరీతి ధ్రువంబు సేయుచున్. 1

శా. నాదబ్రహ్మ మనాదియై, ప్రకృతి శూన్యంబై, స్వయంవ్యక్తమై,
వేదబ్రహ్మ సమీక్షసేయ మది సంవేద్యంబ యీసృష్టి ; భా
వోదంతంబిది, మానసోల్లసనమై యొప్పంగ, బరంజ్యోతి కీ
భేదాభేదము లెల్లఁబోవుఁ బ్రళయోద్భిన్నంబులై, చిన్నమా ! 2

శా. నాదబ్రహ్మము తన్మయత్వముచు సంధానంబుఁ గావించు, వ్యా
నోదానాచ్ఛ సమాన వాయువుల నత్యుచ్చస్థితిం గూర్చెడిన్,
వేదాధ్యాపన యట్టిదే యగును, సాన్నిధ్యంబు తాత్కాలికం
బై దైవారు నటంచుఁ బల్కఁగద ! చిన్నాంబా వధూరత్నమున్. 3

శా. ధర్మాధర్మ విచక్షణా పటిమ సూత్రప్రాయమై యుండు, నా
నిర్మాణక్రియ లెల్లవారలకుఁ బూన్కిఁజిక్క, వట్లాట నా
కర్మౌచిత్యము లట్లెయుంచి, నిజభక్తవ్రాతముం జేరుచే
నైర్మల్యంబుఁ ద్యజించు మార్గమని యెన్నంబల్కుఁ జిన్నాంబతాన్. 4

ఉ. ధీవరు లాత్మశక్తిఁ బ్రకృతిం దలదన్ని శమింప, సర్వలో
కావన రూపమైన పరమాత్ముని మంగళ దివ్యదృష్టి యు
జ్జీవసమాను, సర్వపరిషేచన యోగ్య రసంబు చిక్క, సం
భావిత సద్విభూతులు శుభప్రదముల్, తనరారుఁ జిన్నమా ! 5



రుజాడ వేంకట కృష్ణమూర్తి,
2 వ. అల్లుఁడు.



డ్రేవు జోగారావు,
3 వ. అల్లుఁడు.

గీ. హృదయ సంకల్ప సంక్షయం బొదవెనేని
జీవితాపేక్షయే వీగిపోవును గద !
ధర్మమా యిట్టి వ్యర్థ సాధనము సేయ !
నిట్టి మోక్షము గోర రహీన మతులు. 6

గీ. బురదలోమున్గి కుమ్మరపురుగు పంక
మంటకయె నిర్మలినముగ నాడురీతి
నరుఁడు సంసార పంకమున మునిఁగియును
స్పర్శఁగాంచక చిన్నమ్మ పగిదిఁ దేలు. 7

గీ. కఠినశిక్షకు లోనగు శరముఁదాల్చి
యింద్రియ వ్యాపృతులను జయించ వలయుఁ,
జిత్త చాంచల్యమును బాపి సిద్ధిఁగాంచ
నగును, భక్తి చేకొనుట చిన్నాంబ మతము. 8

గీ. భక్తి వైరాగ్యములఁ బరాత్పరుని హృదయ
పీఠమునఁ బ్రతిష్ఠించి సంప్రీతి ధ్యాన
ధారణ సమాధులను సాంప్రదాయ సరణి
నడిపెఁ జిన్నాంబ సంసార నౌక నెక్క. 9

గీ. సచ్చిదానంద పదవు లొసంగఁ గలుగు
భక్తిమార్గము, వాదోప వాదములకుఁ
దార్పు దములంబు, మంత్ర తంత్రము లడుగదు,
సులభ సాధనమని బోధసలుపు రాణి. 10

గీ. వేద వేదాంగ పరతత్త్వ వేత్తలెవరు
సృష్టివైచిత్ర్య మిదియని చెప్పరైరి ;
అస్మదాదుల కేరీతి నలవడు నని
చిన్నమాంబిక భక్తి సంధన్న యయ్యె. 11

గీ. దైవ యోగంబుఁ దప్పింపఁ దరము గాదు
ధాత కైనను వాని ముత్తాతకైన ;
జరుగఁ దలఁచిన వన్నియు జరిగితీరుఁ
జింత వలదంచు వచియించుఁ జిన్నమాంబ. 12

గీ. కలదు దైవము, లేదన వలదు పడదు ;
శూన్యముననుండి యుత్పత్తి శూన్యమగును ;
సత్యమునఁ బుట్టినట్టి దసత్య మగునె ?
వ్యర్థ వాదములని చిన్నమాంబ పలుకు. 13

గీ. సర్వదేవ నమస్కార సాధనములు
సచ్చిదానందమూర్తి కాసక్తిఁ జెందు ;
నామ రూపములన్నియు నామహేశ్వ
రునకె కలవని చిన్నమ్మ రూఢిఁ బలుకు. 14

మ. కులభేదంబులు దేశకాలముల వ్యక్తుల్ గూర్చు చందంబులన్
లలి నిర్మాణముఁ జేసి రార్యులు సముల్లాసంబు పెంపొందగన్ ;
విలసద్దైవ విధాన సంఘటన నీభేదంబు లెప్పట్టునన్
గలుగన్నేర వటంచుఁ బల్కు నెపుడున్ గంజాక్షి చిన్నాంబయున్. 15

గీ. సఫలమైన నహంకృతి, విఫలమైన
దైవ సంఘటన మనుట ధర్మమగునె ?
యఘటన ఘటనా సామర్థ్య మా ప్రభునకె
చేర్పఁదగునని చెప్పుచు జిన్నమాంబ. 16

చ. మెలఁకువఁ గన్నవేళ నెలమిన్ మనచిత్తము వచ్చినట్లుగా
వెలయఁగఁ జేయఁ జాలుదుమె ? వింతగదా! పురుషార్థసిద్ధి ; వ్య
ర్థులము, సమస్తకార్యములు రూఢిగ నీశ్వర నిర్మితంబులై
విలసనమందు, సత్యమని ప్రీతివచించును జిన్నమాంబయున్. 17

చ. అనుదినముం బురాణముల నాప్తులసన్నిధిఁ బండితోత్తముల్
తనివిఁగొనంగ సత్కథల, ధర్మములం, బఠనంబు సేయుఁ, దా
ననవరతంబుఁ జిత్తమున నంబుజనాభుని హత్తఁజేసి, ప్రా
క్తనవిధి పూజసేయు సతతంబును జిన్నమదేవి నెమ్మదిన్. 18

చ. జలమున బుద్బుదంబు లనిశంబును బుట్టి క్షణంబులోపలన్
విలయముఁజెందు, నిందు బ్రభవించునదేది ? నశించు నేది ? భూ
తలమున జీవకోటుల విధంబులు నిట్టివె : దైవ మాయ లీ
కలుములు లేములున్; ప్రళయకారణ మంచును జిన్నమాంబయున్.

గీ. పంచభూతము, లింద్రియపంచకమును
బంచతన్మాత్ర, లఖిల ప్రపంచములును
జేర్చి, పంచీకరణ యుక్తిచే సృజింప
నోపు భగవానుఁడని రాజ్ఞి యొప్పుకొనును. 20

చ. తనయుల నెల్లవేళల సుధామధురోక్తుల భక్తికీర్తనల్
దనియఁగఁ బాడఁగోరు, నిరతంబును భక్తుల సచ్చరిత్రలన్
వినుతిఁ బఠింపఁగోరుఁ. బరివేదనఁజెందు నధర్మ వార్తలం,
గను బరమాత్మ నెల్లెడ నగణ్యముగా ధరఁ జిన్నమాంబయున్. 21

మ. ఒకయింటం దగఁ బెండ్లివారు కడుధైర్యోత్సాహులై త్రుళ్ళ, వే
ఱొకయింటన్ మృతదేహముంగవిసి యయ్యో! యంచు నేడ్వంగ నా
నకటా! యేమని చెప్పవచ్చు ? విధిమాయల్ దారుణంబు ల్గదా!
వికలోత్సాహతఁ జిన్నమాంబ యడఁకన్ స్వీతాంతరాగాత్మయై. 22

ఉ. ఎట్టులునైన సత్యము గ్రహింపఁ బ్రయత్నము సేయుచుండుఁ, దాఁ
బట్టిన పట్టువీడనని పల్కక నెమ్మది నాప్తవాక్కులన్
దిట్టము సేయు, సజ్జన వినిర్మల మార్గముఁ ద్రొక్కు, ధర్మసం
ఘట్టన దిట్టయై నిలుచుఁ, గామిని చిన్నమదేవి యొంచఁగన్. 23

గీ. బుట్టి పోయినను నన్నృతంబును వచించి
యెఱుఁగ దెన్నఁడు జన్మలో నెంచిచూడ ;
సత్య వాక్పరిపాలనా సక్తిఁ బరమ
పావనంబని యెంచు స్వభావ గరిమ. 24

గీ. సకల మతసార సంగ్రహ స్వాంత యగుచు
ఘనత రాత్మానుభవమును గాంచి మించె ;
ధర నిరీశ్వర వాద సంస్మరణఁ గనక
భక్తురాలయ్యెఁ జిన్నాంబ వ్యక్తిగలిగి. 25

చ. ఉపనిషదర్థముల్ దెలిసి యొప్పెడి సన్ముని సత్తమోత్తముల్
విపులముగా వచింప నవిశ్వకుల మేమియుఁ దోఁపదాదు శే !
కృపణులమైన మా కెటులు గ్రోలఁగను సత్త్వము?భక్తియోగమే
నిపుణత నాత్మశాంతి మదినిల్పునను గద! చిన్నమాంబతాన్. 26

గీ. సత్య వాక్పరిపాలనా సక్తయగుట
హాస్యమునకైనఁ గల్లలనాడ దెపుడు ;
మాటవరుసకైనను మాయమాట లనదు
సత్యసంధత చిన్నమ్మ సాటి గనము. 27

గీ. నిజము పలికిన పిమ్మట నిష్ఠురమగు
నన్న సామ్యము చిన్నమ్మ కనుదినంబు
స్మృతికి వచ్చును బంధు సమీపముననును,
గాని వెరువదు దృఢబుద్ధి గాంచు కతన. 28

గీ. మహిమచే మించునట్టి "నమశ్శివాయ"
యనెడి పంచాక్షరీ మంత్రమును జపించి
జన్మసాఫల్యమొనరింపఁ జను నటంచు
రాణి చిన్నాంబ సఖులతో రక్తిఁబలుకు. 29

ఉ. ఇంతటి చాకచక్యము వహించిన దేవుఁడు జీవకోట్ల న
త్యంతము దుఃఖభాజన విధంబున ముంచునె? యుక్తమార్గ మా
వంతయుఁ దోఁపదే? జనుల కర్మముకాని ప్రభావమిందు సం
క్రాంతము కాఁగ నోపునని ఘర్షణసేయుచు జిన్నమాంబయున్. 30

గీ. పాహి రామప్రభో యని పలువరింప
వాని చెవికెక్క దీమొర, పగులు గొంతు;
కంఠశోషయె యగును, సత్కార్య కలనఁ
గాలమును బుచ్చుఁడని దేవి కసలి పలుకు. 31

గీ. క్షుత్పిపాసలు, నిద్రయుఁ గూడలేని
బ్రతుకు వ్యర్థము, నిత్యజీవ మగునెడల
వర జరామరణ రహిత వర్తనంబు
హేయమగునని, చిన్నాంబ ! హెచ్చరింతు. 32

గీ. చావులేకట్టి దివిజుల సంతుపెరిగి
విరుగకుండిన స్వర్గము పిక్కటిలదె ?
తావుచాలునె వారికందఱికి దివిని ?
ననుచుఁజిన్నమ్మ విభ్రాంతి నందుచుండు. 33

గీ. నరులమించిన పాపముల్ వర మహేంద్రుఁ,
డెల్లదేవతల్ చేయంగఁ జెల్లునొక్కొ ?
కీడు నరులకు, సురలకు క్షేమమగునె ?
పక్షపాత మగుననుచుఁ బలుకు రాణి. 34

గీ. ఆలమందలఁ బోషించు నవసరములఁ
జేతిమీఁదుగ మేపి రక్షించుఁ బసులఁ
బ్రాణపదముగఁ బెంచు నపారభక్తి
గోవులను జిన్నమాంబ సంకోచపడక. 35

చ. మతముల త్రోవఁబట్టి మతిమాలిన వాదము లాశ్రయింప, దు
ర్గతి కవి హేతువల్లద! పరాత్పరు నెల్లెడ నాశ్రయించుచో
సతము సమంజసంబు; పరసాధన కీశ్వర భక్తిమార్గమే
వ్రతమని సాటుఁ జిన్నమ శుభస్థితిఁ జేరిన తోడివారికిన్. 36

చ. మతముల మంచిచెడ్డల క్షమం గనఁజాలము, సర్వసన్మతో
న్నత విధులం బరామరిక నర్మిలిఁ గూర్చుట యుక్త మంచుచే
వ్యతికర మేమి యుండదు, భయంబును గాంచమటంచుఁబల్కు నీ
సతి, వర చిన్నమాంబ, సరసంబుగ సర్వ మతానురక్తయై. 37

గీ. పీర్లపంజాల కెలమిని బిండివంట
ల నటనైవేద్యములకు బంపు సతిభక్తి;
క్రైస్తవాలయోపదలను గట్టఁబంపు,
సకల మతములఁ జిన్నమ్మ సమతఁ జూచు. 38

మ. సగుణుం డీశ్వరుఁ, డట్లుకానియెడ స్వేచ్ఛన్ సృష్టిఁగావింపఁ డీ
జగతిన్; నాస్తిక శూన్యవాదమునకున్ శక్యంబుగా దివ్విధిన్;
జగదాధారుని కార్యయోగ్యతల నెంచంజాల మెప్పట్టునం;
దగదేమైన భరించుటే జనుల కర్తవ్యంబగుం జిన్నమా! 39

ఉ. దేవుఁడు లేఁడటన్న జగతిన్ సృజియించెడి వ్యక్తియూహ్యము, నా
దైవము నిర్గుణుండనిన స్థాణుఁడు శక్తివిహీనుఁడౌఁ గదా!
భావన కంద వావిభుని భవ్యగతుల్, సగుణుండు, తానె యీ
జీవుల రూపమంది, వికసించి, నశించును, జిన్నమాంబరో! 40

గీ. కలుష పూరితమైన లోకమును సృష్టి
చేసి, పాప పుణ్యవిభేద శిక్షణముల
మునిఁగి తేలుటయది దైవమునకు హితము
కావలయుఁ జిన్నమా! చెప్పఁగలమె మనము. 41

గీ. సృష్టి వైచిత్ర్యములను యోజింప లేక,
కార్య కారణ గతుల సంకలనఁ గనక,
కర్త నిర్గుణుఁడనరా దఖింపుఁ డతఁడు ;
మనమె కించిజ్ఞులము నసమర్థులమును. 42

చ. తెలియనివారమన్న మన నీ కది న్యాయతఁగూర్ప దంతలోఁ,
దెలియఁగ సాధ్యమౌనె జగతింగని పెంచి నశింపఁజేయు ధీ
విలసన మస్మదాదులకు? వేద్యమగుం బరమాత్మకద్ది;తా
వలమగు దైవభక్తియె శుభప్రదమౌ,మన కెన్నఁ జిన్నమా? 43

గీ. తలఁప నద్వైతగతి జీవతత్త్వము పర
తత్త్వలేశ మౌనెః లీలఁదనరు వఱకు
నెన్ని జన్మల నెత్తిన నెత్తవచ్చుఁ
జిక్కు లేదేరికిని దానఁ జిన్నమాంబ ! 44

గీ. జీవ పరమాత్మలను వేఱుచేయు నెడలఁ
బూర్వ జన్మస్మృతిని జీవి పొంద వలయు
వృద్ధినంది తరింపఁగ; స్మృతి హరింపఁ
జిన్నమా ! పరిపూర్ణతఁ జెందుటెట్లు ! 45

గీ పూర్వజన్మస్మృతియె లేకపోయెఁగాన
జీవి కర్తృత్వసిద్ధిని జెందఁ డెపుడు;
వ్యక్తిగతముకాదిట్టి జీవకళఁ దలఁపఁ;
దప్పకాభాసమే యనఁదగును, దేవి ! 46

క. ద్వైత విశిష్టాద్వైతము
లైతనరిన సృష్టికర్త కదిలోప; మ్మ
ద్వైతమయినఁ దీరెను నది;
తన్మతలజీవాత్మ హింస చయ్యన నుడుగున్. 47

గీ. పాపపుణ్య విభేదమేర్పఱచునెడల,
స్వేచ్ఛ జీవికినొసఁగి శాసించ వలయు;
మానవుని స్వేచ్ఛ ధర నామమాత్రమె కద !
చిన్నమా ! ధర్మమేరీతి సిద్ధిఁగాంచు ? 48

గీ. దేశకాల పరిస్థితుల్ తీవ్రముగను
సంకుచిత మొనరించు స్వేచ్ఛను సతంబుఁ ;
దత్త దాభాసముల జీవతతికిఁ జుట్ట
ధర్మమే ! చిన్నమా ! యిది దైవమెఱుఁగు. 49

గీ. వర్తులాకార మండల వ్యాప్త మగుచు
భూ నభోంతరముల నిండి పొరలు దివ్య
తేజమే సచ్చిదానంద తృష్ణఁదీర్చుఁ ;
జిన్నమా ! జీవ సృష్టి వైచిత్ర్య మిదియె. 50

గీ. దైవ నిర్మిత చిత్ర ప్రదర్శనంబు
సృష్టి, జీవులు ప్రేక్షకుల్, చిత్రసరణిఁ
గాంచి పోదురు, దైవాంశ గలుగు కతనఁ ;
జిన్నమా ! చిద్విలాస వైచిత్ర్య మిదియె. 51

గీ. భగవ దవతారుఁడగు రామభద్రు జనని
ధరణి వైధవ్యమందక తప్పదయ్యె ;
జనకునకుఁ బుత్రశోకము, సతికిఁ జెఱయుఁ
గలిగెఁ ; జిన్నమా ! తప్పవు కాలగతులు. 52

గీ. వటుని బ్రదికించి బ్రాహ్మణ వరున కిడిన
ప్రతిభ యేమయ్యె నిచట శ్రీరాఘవునకు ?
మృతుల బ్రదికించఁ గలిగిన క్రీస్తు సిలువ
కప్పనముఁ జేసెఁగద ! తనయాత్మఁ దుదకు ! 53

గీ. సర్వ సామర్థ్యములుగల చక్రధరుఁడు,
సకల జీవులయందుండు సర్వసాక్షి,
ధర నవతరించ వలయునే ధర్మసిద్ధి
కొఱకు? నజ్ఞుఁడే? చిన్నమా! కూడునె యిది? 54

గీ. సృష్టిపథకము నల జగద్స్రష్ట కూర్ప,
నందులోపముల్ పొసఁగ వేచందమునను!
పాపపుణ్యములేల సంభవము లగును?
జిన్నమా! నరుల్దీని యోజింపఁగలరె! 55

గీ. నాటకంబుల నాడెడు నటకులకును
స్వేచ్ఛలేనట్లు సృష్టిని జీవులకును
గనముఁ గర్తృత్వసిద్ధి నెక్కారణమ్మైనఁ;
జిన్నమా! కూలివాండ్ర మీక్షితిని మనము. 56

గీ. తోలుబొమ్మల నటనతోఁ దుల్యమగును
జీవ పరమాత్మల గతుల్ విచిత్రముగను;
సూత్రధారుఁ డాడింపఁగఁ జోద్యగతుల
నాడి, విరమింప బొమ్మలు నాడ మాను. 57

ఉ. నాటక మాడునట్టి తరుణంబున నందలి వేసగాండ్రు స్వే
చ్ఛాటనఁజేయ నాటకమె యాగు; నదేగతి జీవకోటి, భూ
వాటికఁ దత్తదుక్త విధి వచ్చి చరించి చను న్పురాసరిం;
దాఁటఁదరంబె? యీశ్వర విధానము నేరికి, ధాత్రిఁ జిన్నమా! 58

గీ. ప్రభుని మర్మము తెలియక భ్రమసి, యెన్ని
మతములం గూర్చిన నవి సమ్మతము లగునె
ధరణి సృష్ట్యాదిగా దీనిఁదరచి, విఫలు
లైరి; ధీమంతులని చిన్నమాంబ పల్కె. 59

గీ. గోడ కభిముఖముగ బంతిఁ గొట్టఁ దిరిగి
వచ్చి మనకది తాకెడి పగిది, దేవి !
చెడు తలంపులు మనమీఁదఁ బడును మఱుడి ;
కార్య కారణ గతుల సంస్కార మిదియె. 60

గీ. జలము లింకిన శూన్య కాసారము గతి,
రాజులేనట్టి భూతల రాజ్యము గతి,
శాద్వలము లేని గోభూమి సరణి, నీళ్లుఁ
బడఁతి లేనట్టి పురుషుని బ్రతుకు దేవి ! 61

గీ. చెరువు తూమును దెరువఁ బ్రసిద్ధ జలము
సస్యముల నింపి పెంచుఁ బ్రశస్తముగను ;
జీవ జలధార చైతన్య సిద్ధిఁ గూర్చుఁ,
దలుపు మూయ జీవ జలము నిలిచిపోవు. 62

గీ. తలఁప సర్వాధికారి యాదైవ మతని
మంచిచెడ్డల మనము విమర్శఁ జేయ
నగునె ? చిన్నమా ! సేనాని యాజ్ఞ వీర
భటులు శిరమున వహియింప వలయుఁ గాదె ! 63

గీ. వేద వేదాంగ సంహితల్ వెదకి వెదకి
దైహి కాముష్మిక సువిషయంబు లెల్లఁ
జర్చ సల్పిన ఫలము లేశమును లేను,
చిన్నమాదేవి ! సృష్టి వైచిత్ర్య మిదియె. 64



## 12. మతములు.

### — 1. క్రైస్తవ మతము. —

శ్లో. శ్రీ మధ్యాయామి మిథ్యాచకచక వికచత్
చైత్యసత్య స్వరూపమ్
హృద్యం సన్మానివేద్యం శ్రుతిమహితసతీ
భాగ్య సౌభాగ్య కందమ్
సిద్ధంసర్వాను షిద్ధం పరమ శివమయం
భవ్యదివ్య ప్రకాశమ్
యేసుక్రీస్త్వాఖ్యదైవం సతతజనసుఖదం
భాగధేయం మదీయమ్. 1

ఉ. మానవ జీవయాత్రను క్రమంబుగ నుత్తమ నీతిరీతి సం
ధానముఁజేసి పామరజనంబుల కాదృతి బోధయౌనటుల్
పూనికఁ గ్రీస్తుయేసు, పరిపూత చరిత్రుఁడు బోధఁజేసి స్వ
ప్రాణము లిచ్చె నందుకనిపల్కును జిన్నమదేవి సర్వదా! 2

మ. ధరణిం గ్రీస్తు వచించినట్టి పరతత్త్వప్రోక్త వాక్యంబులం
బరలోకంబున జీవరాసులు సదావ్యాపార సంసక్తమైఁ
బరిపూర్ణత్వమునందఁ బాటుపడు భావంబుల్ ప్రకాశించు,ను
త్తరలోకస్థితి సార్థకంబనెడి వార్తంజాటుఁ జిన్నాంబతాన్. 3

మ. క్రీస్తుని జీవితోక్తులఁ దరింపఁగ వ్యక్తులు విశ్వసించుటే
వాస్తవభక్తి; తక్కినవి వార్యములౌఁగద! చిత్తశుద్ధిచే
నిస్తుల భక్తిఁ జేకురు గణింపఁగ; నేను విశుద్ధమైన దై
వస్తవ సంపదం బడసి, వర్ధిలుఁడంచను జిన్నమాంబయున్. 4

గీ. నవ నిబంధనగ్రంథ మనవరతమును
జదివి, తత్తదంశములను మదిని జేర్చి
ప్రభువు నాదర్శముగఁ గొని, రక్తిజీవ
యాత్ర సాగించెఁ జిన్నాంబ పాత్రగతిని. 5

గీ. పరమపావన మాతృ సంభవుఁడు, శివుఁడు,
పాపరహితుఁడు, నిర్మల స్వాంతుఁడేసు ;
వెదకిచూచినఁ దప్పు గాన్పింపదెచట,
ననుచుఁ బేర్కొను మఱిచిన్నమాంబ సతము. 6

క. మానవ సౌభ్రాతృత్వ ము
నూఁనముగా నిర్ధరించి నుడివెను గ్రీస్తే
మానిత గుణశీలుఁని స
మ్మానము సేయుంగఁజనదె! మానవులెపుడున్. 7

గీ. పాపమతులను దిద్ది తీర్పఁదగు ననుచు ;
దుష్టశిక్షణ మొనరింపఁ దఁష్టిఁగనదు ,
క్రీస్తుమతమున నుత్కృష్ట రీతి యిదియె
యని వచించుచు, సతముఁ జిన్నాంబ ప్రతిభ. 8

గీ. దుష్ప్రవర్తన గలవారితో వినమ్ర
గతుల బోధించి నీతిసంయుతులఁ జేయ
వలెను ; క్రైస్తవాదర్శ మీకలనఁగలద
టంచుఁ జిన్నాంబ తా వచియించుచుండు. 9

గీ. పాప పతితుల సన్మార్గ వర్తనులుగ
మార్చుటయె ధర్మమగుఁ ; బరిమార్చు టరయ
ఘనత కానేరదనుచుఁ గ్రీస్తునువదించె,
నని ప్రబోధించిమించుఁ జిన్నాంబ సతము. 10

గీ. క్రీస్తునంతటి నిర్మల ప్రేమమూర్తి,
దైవభక్తుఁడు, పరిశుద్ధ తత్త్వవేత్త,
సకల కష్టంబులనుజెంది చచ్చెసిలువ,
నస్మదాదుల గతియేమి? యనును రాణి. 11

గీ. సాధ్య మగునంత వఱకుఁ బ్రశస్త గతులఁ
బ్రజల కామోదమును గూర్పవలయు, నదియె,
ముక్తిదాయక, మైహికాముష్మికముల
కని యనువదించు నెప్డుఁజిన్నాంబ ద్రఢిను. 12

గీ కష్ట సుఖముల రాకపోకలకుఁ గార్య
కారణవిధుల యుక్తసంకలనఁ గనుము;
జన్మ కర్మాంతరోక్త ప్రసక్తియేల?
బుద్ధిచేతను సాధింపఁ బొసఁగదనును. 13

గీ. పొరుగువారిని దనవలెఁ బూర్ణశక్తిఁ
బ్రేమఁగనువానిఁ బరమాత్మ ప్రీతిఁగాంచు;
నని జగద్రక్షకుండు క్రీస్తనువదించె
నదియథార్థమనును జిన్నమాంబ సతము. 14

చ. అనయము దేవదానవ మహారణరంగములం దనేకసా
ధనముల రాక్షసుల్ జయముఁదాల్చిరి, వైష్ణవమాయచేఁ దుదిన్,
ఘనత సురాళికబ్బె; నిదికర్జమె! క్రీస్తు వధించువారి ర
క్షణకయి ప్రార్థనల్సలిపెఁ గాంచుఁడు వీరల తారతమ్యముల్. 15

గీ. ప్రబలు లవతారపురుషులు పామరగతి
నాగ్రహానుగ్రహముల సమగ్రులైరి,
కాని ద్వేషించువారి రక్షణనుగోరు
క్రీస్తుఁడద్వితీయుఁడను నారీమణి ధర. 16

శా. శ్రీమంతుల్ ఘనులైనమానవుల నీసృష్ట్యాదిగానెంచినం
గామక్రోధములన్ జయించిన మహాత్ముండటంచు గాన్పింపఁడా
ప్రేమాకారుఁడు లోకరక్షకుఁడునౌ క్రీస్తొక్కఁడేకాని యీ
రామారత్నము చిన్నమాంబ హృదయారామంబు పుష్పింపఁగన్.

గీ. తమ్ము భూషించువారలఁ దనుపుటయును
సతముదూషించువారలఁ జంపుటయును
ధరణి నైసర్గికములు సాధారణముగఁ ;
గ్రీస్తురక్షించె వైరులఁ బ్రీతి ననును. 18

ఉ. నీతులఁజెప్పువార లవనిన్ సుమతుల్లలరెందఱెందఱో
భ్రాతలు,వార లాచరణభావములం దలపోయరింతయుం;
బ్రీతిని గ్రీస్తుచెప్పి తగురీతిని జేసెనటంచుఁ, జిన్నమాం
బా తరుణీలలామ తనవారలకున్ వివరించిచెప్పెడున్. 19

గీ. పరుల సేవించు పనియందుఁ బ్రాణములను
విడువ నిత్యజీవముకల్గు విధికృతముగ;
నాత్మరక్షణార్థము డాగునతఁడు చచ్చుఁ ;
గ్రీస్తు శాసించెననిచెప్పుఁ బ్రీతి నతివ. 20

క. చిత్తస్వాస్థ్యముఁగని పురు
షోత్తము సచ్ఛాసనముల నొనరించుట స
ర్వోత్తమ పద్ధతియని ప్ర
త్యుత్తరమిడుఁ జిన్నమాంబ యోగ్యప్రతిభన్. 21

గీ. క్రైస్తవాదర్శముల ననురక్తి హృదయ
రంగమున నిల్పి సత్ప్రవర్తనము సలిపె ;
వర్తనమునందుఁజూపని వాక్యసరణు
లప్రయోజనములని చిన్నమ్మ పలుకు. 22

ఉ. ఖ్యాతినిగూర్చు ధర్మము లఖండముగాఁ బ్రకటింపలేవిలన్,
స్వాతిశయంబునందక రయంబునఁ బాత్రతనెంచి, సత్కృతుల్
నీతియుతంబుగా సలుపు నిత్యము నుత్తమ గుప్తపద్ధతిం;
బూతచరిత్ర చిన్నమ ప్రభుండగు క్రీస్తుని యానచొప్పునన్. 23

గీ. నమ్మ- "పాపాయపరపీడన"- మ్మనియును,
ధరఁ- "బరోపకారార్థమిదంశరీరం"-
మనియుఁ గ్రీస్తువచించెఁ; బరార్థసేవఁ
జేయుమన్ని బోధఁజేయుచు జిన్నమాంబ. 24

గీ. క్రైస్తవాదర్శముల మదిఁగాంచునెడల
లోప మిసుమంతయైనను జూపలేము;
చెప్పినంతయుఁజేసెఁ బ్రసిద్ధమతఁడ
టంచుఁజిన్నమ్మ ప్రకటించు ననుదినంబు. 25

గీ. క్రీస్తుని జీవిత చరితము
వాస్తవమని చిన్నమాంబ ప్రథితప్రేమం
బ్రస్తుతిఁజేసెను, దద్విధు
లాస్తిక్యత ననుసరించె నాత్మీయముగా. 26

క. మృతులను బ్రదికించెను, ఘనఁ
బతితుల రక్షించె, రోగ భారములుడిపెం
గ్రతువుల నిందించెను గద!
ప్రతియెవ్వఁడు క్రీస్తుయేసు రారాజునకున్. 27

క. పరహింస సేయకుము, పర
తరుణీరత్నముల పొందుఁ దలఁపకు మెపుడుం,
బరధనము నపేక్షింపకు,
పరము లభించునని క్రీస్తు ప్రవచించె ననున్. 28

క. ధనమును వనితను గోరని
మనుజుఁడు ధన్యాత్ముఁ డార్యమతమిది, సత్సా
ధనమునఁబరమాత్మునిఁ గనుఁ
గొనుఁడని క్రీస్తనుపదించెఁ గూర్మిననియనున్. 29

గీ. జీవిత విధానమును శుద్ధిజేసినయెడఁ
గల్మష రహితమై జీవకళ చెలంగు;
భక్తి విశ్వాసములఁబూని ముక్తిఁగాంచుఁ;
గ్రీస్తుపలుకని చిన్నమ్మ ప్రీతిఁబలుకు. 30

ఉ. విద్యలనేర్చి జ్ఞానమభివృద్ధినిజేయుట సాధ్యమైనయ
ట్లు ద్యమమూన మానస నియోగముచేతను, బ్రేమతత్త్వసం
పద్యుతిచిక్కు; విశ్వమున వర్తిలఁచేసిన భూతతృప్తినై
వేద్యముగల్గుఁ, గ్రీస్తుని వివేక రహస్యము చిన్నమాంబరో! 31

మ. ఉదక క్షాళన దేహ కల్మషము బాయుంగానఁ దద్రీతి, నో
విమలా యూహలు జీవులం గడిగి దుర్వ్యాం, గ్రీస్తు శుద్ధాత్మ సం
పదఁబ్రక్షాళనజేసి ముక్తినొసఁగెం, బాపంబులంగాల్చె, ని
వ్విధి శుద్ధోదక మజ్జనంబులను మాన్పెన్ మోక్ష చిహ్నంబుగన్ 32

గీ. ఆమయంబులఁ బాపెడి యవసరముల
యేసునుండి తపోబల మేగుచుండె;
నదియె తార్కాణమగు పాపహరణశక్తి
కలదు క్రీస్తునాథునకని తెలుపురాణి. 33

చ. ప్రభుఁడు వరుండు, సంఘమిలపై వధువందురు క్రైస్తవోత్తముల్;
శుభగతిఁ గృష్ణుఁడేవిభుఁడు, సుస్థిరభక్తులు గోపికాళి స
న్నిభమని యందుఱు హైందవులు; నీచముకాదిది, సాదృశంబెయా;
నభయముకాదె? జీవపరమాత్ముల నేగతి సంస్మరించినన్. 34

గీ॥ కృష్ణుఁడును గ్రీస్తు నామసదృశు లగుదురు,
ధరఁ బ్రబోధంబులును దుల్య సరణినుండు;
దేశకాలానుగతపరిస్థితుల వలనఁ
బూర్వపురుషుల గాథలఁ బొసఁగుమార్పు. 35

గీ. కల్పితములగుచర్యలఁ గడకుఁ దోసి
తత్వసారంబు విడఁదీసి తరచిచూడ
జీవ పరమాత్మల కభేదసిద్ధికలుగు;
మధ్యవచ్చిన మాయయే మాయమగును. 36

గీ. శివుఁడనంగ సర్వము మేలు చేయువాఁడు,
క్రీస్తు శబ్దార్థమును బరికింప నదియె;
యగుటఁ బంచాక్షరీమంత్ర మనువగు గతి
రెండు మతములకు నమరి యుండునేమొ? 37

గీ. తనకు మనకును దైవము తండ్రియనెను,
నిర్మలినవర్తనమె ముక్తి ధర్మమనెను,
జనకసుతుల కభేదంబుఁ జాటెఁ గ్రీస్తు,
పాప పరిహార మొనరింప వచ్చితిననె. 38

గీ. స్వార్థమెల్లఁ ద్యజించిన సాధుమూర్తి,
జీవ పరమాత్మల కభేద సిద్ధిఁగూర్చె,
మాయ సైతాను కోరలఁ దీయఁ గలిగెఁ,
గ్రీస్తు సచ్చిదానంద మూర్తియె, ధ్రువంబు. 39

ఉ. సర్వసమత్వమబ్బినఁ బ్రసక్తి నశించు సమస్త సంస్థలన్,
నిర్వహణేచ్ఛ వీగు, నవనిం బరమేశ్వర తత్వనిష్ఠచే;
చర్విత చర్వణంబయి, ప్రశాంతము గల్గును, గ్రీస్తు జీవమీ
యుర్విని గాంచె నిర్వ్యధి మహోన్నత సిద్ధి, నమూల్య భ- 40

గీ. దైవము త్రిగుణాత్మికమగు తత్వమగుట
నార్యులుం గ్రీస్తు మూర్తిత్రియంబె యనిరి ;
యద్వితీయత నిర్గుణుం డగు సమాధి,
సుగుణుఁడగుఁ గాదె! సృష్టిబ్రసక్తియందు. 41

గీ. జీవజాతము లన్నియు దైవకళలె
యగుట దైవమే పారిశుధ్యతను గూర్చు
విశ్వసించిన యని, క్రీస్తు విధిగఁ బలికె,
దేశికునివలె శిక్షించి దిద్దుకొనును. 42

గీ. ఈశ్వ రావతారంబని విశ్వసింప
కున్నఁ బురుషోత్తముండని యెన్నియైనఁ
గ్రీస్తు నాదర్శముగఁ గొని ప్రేమగనుర
జీవయాత్రను సాగింపఁ జెల్లు నరులు. 43

గీ. అద్దుకాగిత మెటు సిరా నంటఁ బీల్చు
నటులు క్రైస్తవప్రేమ జీవాత్మ నంటు
పాపములను హరించు స్వభావికముగ,
జీవ పరమాత్మ లైక్యతఁ జెందు నటులు. 44

—: క్రీస్తు నేర్పిన ప్రార్థన :—

సీ. స్వర్లోకవాసి మా జనక నీనామంబు
నిర్మలంబగుఁగాక! నీదు రాజ్య
మరుదెంచుఁగాక! నీ స్వాంతంబు పరలోక
విధమున భువి నెరవేరుఁగాక !
అస్మదీయంబగు ననుదినాహారంబు
నీవేళను ననుగ్రహింపు మాకు
మాఋణస్థుల మేము సైరించినట్లు మా
ఋణముల నీవు సైరింపుమయ్య !

గీ. మమ్ము శోధనపాలుగాఁ జిమ్మఁబోక
కిల్బిషజను బారికిని దొలఁగింపుమయ్య!
స్వర్గరాజ్యంబు, బలమును, సకల మహిమ
నీవశములౌచు నిరతంబు నెగడు దేవ! తథాస్తు. 45

గీ. చకుముకిని ద్రిప్ప నగ్ని సాక్షాత్కరించు
పగిదిఁ గ్రైస్తవ స్పర్శ పాపములఁ గాల్చు;
యజ్ఞమియ్యది, ప్రభుఁడగు యాగపశువు,
ప్రాప్తమగుఁ బరిశుద్ధాత్మ ప్రస్ఫుటముగ. 46

## —! బౌద్ధమతము. !—

ఉ. గౌతమబుద్ధుఁడెల్లరకు గౌరవనీయుఁడు, కీర్తిఁ బ్రి
ఖ్యాత దయామయుఁడు, నరకంబగు స్వార్థమె; ప్రేమతత్త్వమే
భూతల సర్వభూత సమబుద్ధిని గూర్చెడి సత్యమన్న మాం
ధాత, నిరీశ్వరుఁడు, పరతంత్రుఁడనన్, మన చిన్నమాంబయున్. 1

గీ. దైవవిషయముఁ దలపెట్టఁ దగదు మనకు,
ధర్మవర్తన ముఖ్యసాధన, మదియును,
ప్రేమతో నిండినది యద్భుతమ్ముగను,
ప్రేమ త్యాగంబువలన లభించు నదియు. 2

గీ. ప్రాజ్య సామ్రాజ్యమిలఁ బరిత్యాజ్యమనుచుఁ
దృణమువలె విసర్జించెను క్షణములోన;
బుద్ధభగవానుఁ డిద్ధప్రబుద్ధుఁడనుచుఁ
బ్రస్తుతించును, జిన్నమ్మ విస్తరించి. 3

గీ. తాను నమ్మిన విధికి బుద్ధభగవానుఁ
డతుల సామ్రాజ్యమునువీడె నలఘు గతిని;
ప్రాణముల ధారవోసెను ద్రాణఁగ్రీస్తు.
తరతమము లిట్టివని మదిఁదలఁచు రాణి. 4

గీ. బుద్ధునకుఁ గ్రీస్తునకు భేదబుద్ధియొకటి
కలదు, దైవభక్తి నిరూపించె ఘనతఁగ్రీస్తు
బుద్ధుఁడీశ్వరు నటు తలపోయలేదు ;
కనఁ బ్రబోధంబు లోకరీతి వనును సాధ్వి. 5

గీ. దైవ విశ్వాసమును బ్రజా సేవయునను
రెండుసాధనలగుఁ గ్రీస్తుమండలమున ;
భూతదయ యొక్కటియెచాలె బుద్ధునకును ;
జిన్నరాణి విమర్శ యీచెలువుఁ గనెను. 6

గీ. క్రైస్తవప్రేమ నరులకే కలిగెఁగాని
జీవకోటికి వర్తింపఁజేయ లేదు ;
బుద్ధదేవుని దయ యెల్లభూత తతికిఁ
జెందెనని పల్కుచుండును జిన్నమాంబ. 7

గీ. కాంక్షలఁ ద్యజింప నిష్కామ్యకర్మచిక్కు,
శాంతియుచు మనోనిగ్రహశక్తి కలుగు,
జన్మ సాఫల్యమగుటకుఁ జాలు, బుద్ధ
మతమిది యనును జిన్నమ్మ మాన్యచరిత. 8

గీ. కాంక్షలను పొరల నొకటొకటిగఁ బూన్కి
నొలువ శూన్యమైపోవు నీరుల్లిపాయ
పగిది, జన్మంబు లీనమై తగుచు ; బుద్ధ
మతవిధి యనుచుఁ జిన్నమ్మ సతముఁ బల్కు. 9

గీ. కలఁడు దేవుండనంగ నొకానొకండు,
లేరు పెక్కురు దేవులు, లీల నతఁడు
జగము లన్నింటి సృజియింప సంహరింప
నాది హేతు వటంచు మహమ్మ దనియె. 1

చ. అలఘుతర ప్రవక్తలు మహాత్ములు దేవుని శాసనంబులం
దెలుపుచు నిమ్మహీజనుల దివ్య పథంబునఁద్రిప్పి నీతి సం
కలితులఁ జేయుచుందు రటుగాక పరేశున కొక్క పుత్త్రుఁడున్
గలిగి జనాళి పాపముల గైకొని మోయుట కల్ల యంచనెన్. 2

క. పాపములు గలుగ వానిం
బాపఁగ జపముం దపంబుఁ బశ్చాత్తాపం
బోపును గానీ, యన్యము
లేపగిదిని జాలవని వచించె ఖురానన్. 3

గీ. జన్మమొక్కటె మఱి పునర్జన్మ లేదు,
పాప పుణ్య విచారణ పరగు నాఁడు
శాశ్వతంబుగ నరకంబొ ? స్వర్గసుఖమొ ?
తెలుపు నల్లా సమాధి జీవులకు నెల్ల. 4

గీ. పూర్ణుఁ డైనట్టి యల్లాకు బొమ్మ పెట్టి
యర్చ లొనఁగుట యవమాన మగును, గాన
విగ్రహారాధన మొనర్చు విధముఁగూడ
దనె మహమ్మ దటంచుఁ జిన్నమ్మపలుకు. 5

గీ. ఆత్మ పరమాత్మలకు నైక్యమబ్బ దెపుడు,
మానవులె దేవతలుగ, సైతానులుగను,
బరగుచుందురు పుణ్యపాపములఁ బట్టి
యని మహమ్మదు బోధించె నధికదీక్ష. 6

క. కూడఁగ వడ్డీబేరం
బాడుంగాఁ బాపహేతువై యధ- ర్ణుం
బాడొనరిచి ఋణదాతకుఁ
గీడుం జేకూర్చు నధిక కిల్బిష మనియెన్. 7

గీ. ఆత్మ యనునది మనుజుల కలదుఁ గాని
కనఁగఁ బశుపక్షులకు లేదు, గాన మనుజు
లలఘు విజ్ఞాన వంతులై యఖిల సృష్టి
నధికులగు వారలంచు మహాత్ముఁడనియె. 8

మ. ఉపవాసంబులు తీర్థయాత్రలును సత్యోద్గాత్ర సంప్రార్థనల్,
జపముల్ భూరి తపంబులున్ సలుపుమన్ సత్కార పూర్వంబుగా
నెపముల్ వెట్టక సేవనాత్మ నయినం జేయుమన్ విలోకించుచుం
చు పదేశించె మహాత్మ సత్త్వను విధానోద్య త్సుధా లాపుఁడై. 9

తే. ఏక పత్నీవ్రతనియతి నెగురఁగొట్టి
జనుఁ డనేక సతులఁ బొంద ననుమతించె;
జీవ హింసను భుక్తికై చేయనొప్పె,
సున్నతిని బొందు పురుషులు సోదరు లనె. 10



# 13. అద్వైతము.

గీ. భక్తి సన్నదీ ప్రవాహంబు ప్రబలి పాఱి
వర పరబ్రహ్మ భవ్య సాగర నిమగ్నుఁ
డగును జీవుండు, జీవేశ్వరైక్య మిదియె;
యిదియె యద్వైతమని వచియించు రాణి. 1

క. సాలోక్యము, సామీప్యము,
సారూప్యముఁ గాంచి పిదప సదమల విజ్ఞా
నాలోకనమున నద్వై
తాలంబనుఁడగును జీవుఁడను రాణి తగన్. 2

క. ద్వైతంబు, నల విశిష్టా
ద్వైతంబును, దేవలోక వాసమునకుఁ బ్రో
ఖ్యాతంపు మెట్లుగా, న
ద్వైతులు తలపోయఁ జెల్లుఁ దగ నను సతియున్. 3

మ. వర విజ్ఞానముచేత మాయను దోలంపంగాఁ బరబ్రహ్మ వి
స్ఫుర దోజోనిధి భవ్యదృష్టిఁ గనవచ్చున్; ఏమన న్నీవ ను
ద్ధుర ధూమంబు దొలంగి వాయుసఖుఁడొందన్ దివ్యతేజంబు వెం
పిరివోవం గనవచ్చుఁగాదె! యను సాధ్వీరత్న మొప్పట్టురన్. 4

గీ. ఘటముచెడ ఘటగగనము, ఘనగగనముఁ
జేరుగతి, ఘటము చెడిన, జీవుఁడా ప
రాత్పరుం జేరు టేమి యబ్బురంబటంచుఁ
జిన్నమాదేవి, పలుసారు లన్నమాట. 5

ఉ. అద్దపు రంగుఁబట్టి జగమంతయు రంగుగఁదోఁచుచుండు న
ట్లద్దిర ! బుద్ధిమాంద్యమున నంతయు సుస్థిరమట్లుతోఁచు నా
బుద్ధి ప్రకాశమైన విడిపోవును మాయ, జగంబుశూన్యమై
శుద్ధపదార్థ మీశ్వరుఁడు శోభిలు నెల్లెడఁ జిన్నమాంబరో ! 6

ఉ. పాపపతిత భూతల నివాసమగు న్నరకంబు ; దానఁబూ
ర్వాపర రీతులేమి తెలియంగనఁజాలము ; దైవశక్తి పల్
రూపములంది, లీలఁగని, రోసి, తిరోహితమౌను ; దీనినా
ధ్యాపకులందురి మాయయని,యట్లె వచించును జిన్నమాంబయున్.

గీ. దైవ నిర్మాణ సృష్టిని దరచి చూడ
వర దయాసత్య శౌచ సంపదలఁ గనము ;
పనికిరా దంచుఁ బుణ్యపాపముల మాట ;
లని యనువదించుఁ జిన్నమ్మ తనివిదీర. 8

గీ. పరమ చైతన్యమునకు నుత్పత్తి లయము
లుండ వఖిలాండకోటి బ్రహ్మాండములను
నిండియుండును, లీల కుద్దండ రూప
నామములఁదాల్చి వీగుఁ, బ్రణయ సమృద్ధి. 9

గీ. దైవమాయల నిజముని తలఁచి జీవి
మాయలోమున్గ నింద్రజాలాయితముగఁ ;
దలఁప హాస్యాస్పదంబైన పలవరింత,
మాయలో మాయగాదె ! యమాయికులకు. 10

గీ. కడఁగి లీలావిహారార్థ కలన నామ
రూపములఁదాల్చి విరమింపనోపు ప్రభుఁడు ;
దాన సృష్టిస్థితిలయ విధాన మమరు,
జీవులెవరని యనవచ్చు ? చిన్నమాంబ ! 11

గీ. తత్త్వమసియను నద్వైత ధర్మమిదియె,
జీవపరమాత్మల కభేద సిద్ధిగలుగుఁ;
బుణ్యపాపము లెచ్చటఁ బోదలు? నెవరి?
కనుచు జిన్నమ్మ; కష్టసుఖాదు లటులె. 12

గీ. బ్రహ్మసత్యం జగన్మిథ్యరా? యనునది
కన యథార్థమై తనరు నిక్కరణిఁ దలఁప;
క్షణములో నంతరించు సంసారమునకుఁ
జీవు లెటుకర్త లౌదురు? చిన్నమాంబ! 13

ఉ మానవ జాతికెల్లను క్షమంగల జీవులకంటె నెక్కుడౌ
జ్ఞానముకల్గు; దానివలనన్ దరిగానని పాపపుణ్యసం
ధానము గోచరంబగు; వృథాయది; దానిని విస్మరించి, వి
జ్ఞానము శైశవంబుగతి శ్రద్ధ ధరింపుమనున్ యథావిధిన్. 14

క. బాలోన్మత్త పిశాచో
ల్లీలన్ విజ్ఞానవిషయ లేశములుడుపం
జాలుచు, మోక్షము కల్గును
దాలిమినని జిన్నమాంబ తగవచియించున్. 15

గీ. జీవపరమాత్మ లద్వైతసిద్ధిఁ గాంచ
జీవి విరమించు, వ్యక్తిత్వ భావ ముడుగు;
మూలవిచ్ఛేద మొనరించు ముచ్చటలివి
చింత లన్నియు భ్రమలను జిన్నమాంబ. 16

గీ. తలఁప మనమే మనముకాదు, తదితరములు
తనర మనవెవ్వియునుగావు, దాని కొఱకుఁ
బ్రబల సవ్యాపసవ్య దుర్వ్యాపకములఁ
దగులఁదగదంచుఁ జిన్నాంబ తగవచించు. 17

గీ. జనన మరణంబులందున్న, నీ జన్మమునను,
మనస్ప్రపంచ మేమియు నిటఁ గనము నిజము;
ధర నహంకార మేటికి? పరమపురుషు
చిద్విలాసము; కనుఁడను జిన్నమాంబ. 18

గీ. నిర్గుణ బ్రహ్మమను వాచ నియతి తగదు,
సృష్టి కాధారమగు దాన; బృథ్విఁ బ్రకృతి
యెటులు ప్రభవించె? పౌనఃగనీ నటన మనుచుఁ
గొందఱు హరనుచుఁ బల్కుఁగన్నమ్మరాణి. 19

గీ. తనువు స్మృతిఁదప్పియుఁడిన తరుణములను,
నిద్రయందును, జరుగు నన్నిటికిఁ గర్త
జీవియా! లేక దైవమా! చెప్పవలెను!
యనుచు శంకించుఁ జిన్నమ్మ యనవరతము. 20

గీ. దేహ మున్నంతవఱకుఁ దదీయ సహజ
కృత్యములు జరుగుచునుండు నిత్యసరణి
జీవికందునఁ గర్తృత్వసిద్ధి లేదు
చేయుటకు మానుటకు నను జిన్నమాంబ. 21

గీ. కలనుగాంచిన సుఖదుఃఖములను వ్యక్తి
గాంచినవెనుకఁ గల్లని యెంచుకేతిఁ,
దనువు విడిచినవెనుక నంతయునుగల్ల
యని గ్రహించిన, జీవిపొందిన శ్రమలవి
వ్యర్థమగునని చిన్నాంబ పలుకు సతము. 22

గీ. తలఁప సాంసారికేతి బాధలు సతంబు
వదల కామరణాంతము నొదవియుండు;
నొకటివిడిచిన వెనుక నింకొకటి వచ్చు;
నెన్నఁబరిపాటి యదియును జిన్నమాంబ. 23

గీ. జీడివలె నంటుకొన్నదీ శిథిలతనువు
విడువదెంతటి వైరాగ్య విబుధునైన,
బట్టిపల్లార్పుఁ గ్రూర సంభవము భవము;
శత్రువునకైన వలదని చాటుఁబల. 24

గీ వలదనినఁ బోవునే భవబంధ మకట!
వదల దక్షమణ్ణిగతి సర్వము గ్రసించు;
దుఃఖభాజన మొనరించుఁ, దోలుచు వేరు
పురుగుగతి నను జిన్నాంబ పుణ్యచరిత. 25

గీ. ప్రకృతి వైచిత్ర్య మజ్ఞానవశము దాని
పట్లు విడిపించుకొన మన వశముగాదు;
దేహ పాశము వఱకు దస్సిరి విఱువక,
చిన్నమాదేవి వాక్రుఁది సిద్ధాంతము. 26

గీ. ప్రకృతి పురుషులునుం, బుణ్య పాపములును,
గ్రీస్తు సైతానులు, చిదచిద్రతు, లరయ
ద్వంద్వములు, సుఖదుఃఖ విధములనఁదగు,
ననుచుఁ జిన్నమ్మ వాదించు నప్పుడెపుడు. 27

గీ పార్వతీ పరమేశ్వర ప్రభృతులనఁగ
స్త్రీ పురుష సదృశులు, సృష్టిఁజేసిరవని,
ద్వంద్వములులేని యద్వైత ధర్మమెంచఁ
జెల్లదని నొక్కి చెప్పును జిన్నమాంబ! 28

గీ. స్రష్టకును సృష్టికి నిట విశిష్టధర్మ
ము, నుపపాదించు వైష్ణవము, నటుక్రైస్త
వమును; సగుణమందురు, నిర్గుణమును విడుతు,
రంచుఁ జిన్నమ్మ క్రోడీకరించుచుండు. 29

గీ. పాజిటివు, నెగటివు, కరెంట్లో జ సత్త్వ
మేళనమున, నెలక్ట్రిసిటీలు కలుగుఁ ;
బ్రకృతి పురుషుల వలనను బరగుసృష్టి ;
యటులె యగునని చిన్నమ్మ యనువదించు. 30

గీ. తగ సమాధి తాత్కాలికమెగద ! పిదప
జీవి సాంసారికావస్థఁ జెందుఁగాదె !
శాశ్వతముగాని యోగ సంచలనమేల !
యనుచుఁజిన్నమ్మ వాక్రుచ్చు నాత్మఁగనలి. 31

గీ. ధరణి నేకాగ్రచిత్తము తనరఁగను, స
మాధి చిక్కును,దానిచే నైకమొదవు ;
భ్రమను జెందెన రదియె సంభ్రమ మటంచు,
భంగు గంజాయిలను ద్రాగు వారిపగిది. 32

గీ. పాలు, పెరుగు, మీగడలును, మేలివెన్న,
ఘృతము, గోసారమై తగురీతిఁ బృథ్వి
దేహి దేహములును, సృష్టి, దేవునుండి
వచ్చి పోవును, జిన్నమ్మ పలికెనిట్లు. 33

గీ. ఏకమేవాద్వితీయ మాత్మేతి వాక్య
మున జగన్మిథ్యయను సూత్రమును లభించె ;
శూన్యము సశూన్యమును జేరి శుద్ధమయ్యె ;
ననుచుఁ జిన్నాంబ వచియించు ననుదినంబు. 34

గీ. దర్పణమునందుఁ బ్రతిబింబిత మగును రవి,
దర్పణముఁబోవ ఛాయయుఁ దరలుగాదె !
జీవ పరమాత్మ లీగతిఁజెందుననుచు
రాణి చిన్నాంబ పలుకు నిరంకుశముగ. 35

ఉ. రూపము కంఠనాదమును, రూఢితలంపులు, హావ, భావముల్,
దీపిత చిత్తవృత్తులును, దేహవ వేఱువిధంబులై తగన్,
రాపిడిఁ బుట్టుజీవులకు, రాగములేగతి నుద్భవిల్లునో ;
తోఁపదు సాధనంబని వధూమణి చిన్నమదేవి పల్కెడిన్. 36

గీ. తనరఁ బరమాత్మ జీవాత్మతనువుఁ దాల్చు
పగిదిఁ దలిదండ్రులును బునర్భవులగుదురు ;
ఆత్మజాతులయుం దనాహూతముగ, నని
హెచ్చరించును జిన్నాంబ హితజనులకు. 37

గీ. సకలభూతజాలము నాత్మసదృశముగను
జూచువారలు పరమాత్మఁజూడఁగలరు ;
చిత్కళనుబట్టి చైతన్యసిద్ధి గలుగు,
నద్వితీయ మనుచుఁ జిన్నమాంబ పలుకు. 38

గీ. తరచిన శూన్యవాద మద్వైత మతము,
మానస నిరోధ మాత్మనాశాను మతము,
బౌద్ధమత తుల్యములు, దైవభక్తి రహిత
ములని చిన్నమ్మ వాదించు కలఁతఁ జెంది. 39

ఉ. కుమ్మరివాఁడు చేయు పలుకుండల నొక్కటి పానపాత్రయా,
నిమ్మహి నౌను గుంపటిగ నెన్నిక నొక్కటి, కీసమేళ్ళకై
దొమ్మిమొనర్పఁ జెల్లునొకొ ! తొల్లిటి నీశ్వరుఁడిచ్చు స్థానమీ
సమ్మతినంది జీవితము సల్పుట మేలగుఁ జిన్నమాంబరో ! 40

గీ. స్త్రీ పురుష చిహ్నలేక శరీరమునను
వెలయు కీటకములు గల విలను గొన్ని ;
యేకముగఁ బుట్టి మృతినందు నేకముగను ;
ధన్యములుగావె యాజీవ తతులు, దేవి ! 41

గీ. దర్పణములోని ప్రతిబింబ దర్శనమున
బ్రిమసి పిచ్చుక పోరాడు పగిది, జీవి
లేని సుఖదుఃఖముల మాయ లీన మగును;
మాయ విడిపోవ సృష్టియు మాయమగును. 42

గీ. దైవమే లీల భువి నవతారమెత్తి
కోర్కె లన్నిటి నిటఁ దీర్చుకొను వఱకును
జన్మ జన్మాంతరంబుల జరుగుచుండి
తుదకు నిష్కామియై దివ్యపదము నందు. 43

గీ. భూత సమ్మేళనమున నుద్భూత మగును
దనువు, జీవముఁగూడఁ జైతన్య మగుచు;
స్థిరము లివి రెండు, దేవి! నశింప వెపుడు
శాస్త్రవేత్తల సిద్ధాంత సార మిదియె. 44

గీ. నరుఁడు చేరనుకొనఁ బరాత్పరుఁడు కుంచ;
మెట్టు లిముడును చేరులో? నింద్రియముల
బ్రహ్మదైవ జీవి కతీత శుద్ధ తత్త్వ
మెటులు గోచరంబగు! దేవి! యెంచిచూడ. 45

గీ. సూది బెజ్జము మన మనస్సు, మద గజము
దైవ, మెటుజొచ్చు? నిది యసాధ్య మగుగాదె!
బ్రదికియుండఁగఁ దేలదీ పథక మిలను
నరుని బుద్ధి కతీత మీశ్వరుని మహిమ. 46

చ. ప్రళయమగుం బరాత్పరుని గ్రిమ్మ సుషుప్తి, ప్రబుద్ధుఁడౌ నెడం
జెలఁగును సృష్టి కాలసరణిక్ రథచక్ర గతిక్ నిరంతరం
బలయక జీవకోటులు రయంబున వచ్చుచుఁ బోవుచుండు, ని
క్కలన స్వభావమా యుగయుగంబులఁ జర్విత చర్వణంబుగన్. 47

చ. ఇన కిరణ ప్రసారమున నెల్ల జగంబును గాంతిమంతమౌ
నినుఁ డపరాద్రిఁ గ్రుంక జగమెల్లను గాఢ తమో మయంబగున్ ;
ఘనతర జీవ సంకలనఁ గాయము మించి ప్రవర్ధమానమౌ
తనువు నశించు జీవము యథాస్థితి చయ్యన నిర్గమించినన్. 48

గీ. రేడియో గ్రామఫోనులు రెండు నాద
మును దిగంత పరివ్యాప్తముగ నొనర్చు,
శబ్ద మాకాశ వీధి నశ్వర మటంచు
ఋజువు చేసెను చిన్నమా నిజము నిజము. 49

గీ. జీవి పలికెడి వాక్కులే స్థిర మగు నెడ
జీవమును శాశ్వతంబని చెప్ప వలదె ?
విశ్వమున నవి వ్యాప్తమై వెలయు నెపుడు ;
శక్తి గలవారు కన వినఁ జనుట దేవి ! 50

గీ. భూతయద్దము సూర్యుని ఫోకసు నిడ
నగ్ని పొడము నందుండి యనాహతముగ ;
నట్టు లేకాగ్ర చిత్తమే యలవడు నెడ
జీవి సర్వాధికారియై సిద్ధులఁ గను. 51

గీ. మత్తు మందున, యోగ సమాధి యందుఁ,
గోసినన్ స్పృహ జీవికి కూడు కొనదు ;
మృతికిఁ దుల్యమె యైనను బ్రతికి యుండు ;
దాని నానందమని యనఁ దగునె ? దేవి ! 52

గీ. అవయవము లెల్ల దేహమునందె యున్న
పటులె జీవులు దేవునియందుఁ గలవు;
వ్యక్తి గతములు కావు, కృత్స్న ఫలములు స
మిష్టి కనుభూతములగు, శమింప వెపుడు. 53

గీ. కార్య కారణ విధులు తాత్కాలికములు,
వ్యక్తు లొనరించు కర్మ ఫలానుభవము
లందఱకు సమిష్టిగఁ జెందు, నందు వలన
నెవరి గతి వారిదే యన నెట్టులొప్పు? 54

ఉ. వ్యక్తులు చేయు కర్మలు ధ్రువంబుగ నెల్లరకున్ ఫలంబు లా
సక్తిని గూర్చుఁ; గర్తల వశంబులు కావు, సమిష్టికే యగున్;
వ్యక్తు లుపాధి మాత్రములె యౌఁగద! వానికి జీవ మొక్కటే;
ముక్తుల కద్వితీయము; ముముక్షులు ద్వైవమనంగఁ జెల్లదే! 55

గీ. దేహమును గాల్చిన, నిల బ్రాతినను, శల్య
ములు నశింపవు, శాశ్వతములగు, దేవి!
శల్యములకంటె నాత్మ ప్రశస్తము గద!
మార్పు లేనైన మనకు క్షేమంబె యగును. 56

గీ. తను మనో బుద్ధి జీవ భేదము లతుకవు,
వేఱు చేసిన వ్యక్తిత్వ మేరుపడదు;
మరల విడఁదీయ గడియారము రహించెను,
యేమియును లేని జీవాత్మ కేమి దిక్కు. 57

గీ. ప్రకట మగునది శూన్య మద్వైత రీతి,
ద్వైవమును రిక్తుఁడయ్యె నాధ్యాత్మికముగ;
మధ్య నటనకు గతియేమి? మాయ యేమి?
సగుణ నిర్గుణ సామరస్యము పొసఁగునె? 58

క. జ్ఞానుల కద్వైతం, బ
జ్ఞానుల కిల ద్వైత మన నసంభవము కదా!
జ్ఞానాజ్ఞానము లాత్మ
స్థానము నేర్పరుపఁ గలవె? సత్యమొకటియే. 59

క. ఒకయెడ సగుణుండని, వే
ఱొకయెడ నిర్గుణుఁడని, యన నొప్పునె? దైవం
బొకఁడేయగు; లేఁడనినన్
సకలశ్రమ లుడుగు, వాద సంభ్రమ మడఁగున్. 60

గీ. చిత్ర పటమున మనరూపు చేరియుండు
నటులు పరమాత్మ జీవాత్మయందు పొత్తుఁ;
బటము చెడినను మనకు లోపము గలుగదు;
జీవి పడుపాట్లు చెందవు దైవ మునకు. 61

ఉ. జీవులు జీవజంతువులఁ జేరి భుజించి ప్రవర్ధమానమౌ;
జీవము లేనివానిని భుజించిన జీర్ణముకాదు, పుష్టియున్
వావిరిఁగూడ, దియ్యది స్వభావము; ప్రేమ యిఁకెట్లు లబ్బుఁ? ప్ర
స్తావన నద్వితీయమని చాటుట యెట్లను జిన్నమాంబయున్. 62

గీ. జనకుఁడే సంతతిని బుత్రజన్మఁగాంచ
దైవమీసృష్టిరూపముఁ దాల్చెననఁగ
సంశయంబేల? నద్వైత సంజ్ఞయిదియె;
జీవపరమాత్మల కభేద మేవిధియను. 63

గీ. ఆత్మ భవబంధముడిపి, స్వయంప్రకాశ
ఘనతరానంద మిడు ముక్తి కాంతవోలెఁ
జిన్నమ జనించెనన్నుబోషింప నవని
మణులలోపల వజ్రంబుమాడ్కినహహా! 64



# 14. మతాంతర్భాగములు.

## —§ 1. జన్మకర్మలు. §—

చ. నరులు ఫలంబుఁ గోరుచు నొనర్చిన కర్మము జన్మహేతువై
దరిఁగనరాని సంసరణ దావమునం బడఁద్రోయుఁగాన, ధీ
వరుల కకామ్యకర్మ లపవర్గముఁ జేర్పఁగ సాధనంబు లీ
తరతమ భావముందెలిసి ధన్యులుగండను జిన్నమాంబయున్. 1

చ. భువనమునందు లక్షలుగ భూతములెల్లను బుట్టు, కొన్ని నా
శ్యవనిఁ బ్రవృద్ధిఁజెంది, విలయంబును బొందుట నైజకర్మ, సం
భవముగఁగాదె! యా హరి శివ ద్రుహిణాదులకైనఁ గాల క
ర్మవశత తప్పునే! జని తిరంబగునే యను జిన్నమాంబయున్. 2

చ. పలుమఱు జన్మకర్మముల వాసన యుండిననేని జీవికా
తెలివి యొకింత యుండవలదే! యభివృద్ధినిఁ జెంద; నీధరా
స్థలి జననంబు నందు శిశు సంతతి క్రొత్తగ నేర్వనేల? యీ
నిలువని వాదమేలయని నేర్పుగఁ బల్కెను జిన్నమాంబయున్. 3

గీ. కర్మ సన్న్యాసమైన, నిష్కామ్య కర్మ
మైనఁ, బొసఁగదు దేహమున్నంతవఱకు,
సహజకర్మను మాన వశంబు గాదు,
కర్మ కాధార మడుఁగు నిష్కామికిలను. 4

గీ. అరయ సర్వజ్ఞుఁడగు దైవ మఖిలసృష్టి
కాముఁడై కర్మలను సల్పఁగా నరుండు
కర్మసన్న్యాస నిష్కామ్యకర్మఁ గనునె!
సృష్టికర్తను మించునే జీవుఁడనును. 5

గీ. దేవునకు లేని వైరాగ్య ధీ చతురత
జీవునకుఁ గల్గనేర్చునే క్షితితలమున ?
వృత్తిలేకున్నఁ గ్రియ కుపపత్తి లేదు
వ్యర్థ వాదములనును జిన్నమ్మ సతము. 6

గీ. పూర్వ జన్మకర్మఫల మిపుడు గుడువఁగ
జీవి క్రొత్తగ నిఁకఁ గర్మ సేయుటెట్టులు ?
ముందు జన్మకుఁ గారణ మెందుఁగలుగుఁ ?
దలఁప నాగామి సంచితంబులు పొసఁగవు. 7

ఉ. జీవితకాలమందుఁ గను చిత్రతరానుభవంబు లన్నియున్
జీవుని వెంటఁబోయి పరజీవమునం గలియు న్సమిష్టిగం,
గావున జన్మకర్మలనఁగా నిల వ్యక్తిగతంబుగాదు, సం
చిత పూర్వ జీవకళఁ జెందు విధంబను జిన్నమాంబయున్. 8

గీ. నాస్తికంబైన దైవనిర్ణయమె యైన
నరక మేటికి సృష్టి సంకరము జేయు !
కార్యకారణగతు లైహికముగఁ దీరు ;
మిగుల వెయ్యేడజన్మ శమించు వఱకు. 9

ఉ. చేయఁగరాని కార్యమని చెప్పిన దిద్దుకొనంగవచ్చు నా
ప్యాయముగా ధరాస్థలి, నయంబునఁ జెప్పక, జ్ఞానమీయ, కే
దో యపచారమంచుఁ గడు దుఃఖములం బడఁద్రోయ ధర్మమే!
మాయయొ? మర్మమో? తలఁప మత్సరమౌనను జిన్నమాంబయున్.

గీ. దైహి కాత్మీయ బంధముల్ తర తరముల
వఱకు సంతానరూపమై వరలుచుండు,
నదియె జన్మపరంపర యనఁగఁజెల్లు,
నని వచించును జిన్నాంబ ఘనతరముగ. 11

గీ. కష్టసుఖముల రాకపోకలకు గతిని
గనక, జన్మకర్మల నంటఁగట్టఁ దగునె ?
అన్నియు ననాద్యములైన, ననంతము లనఁ
జెల్లదే! యని వాదించుఁ జిన్నమాంబ. 12

గీ. ఈషణత్రయముల రోసి, హెచ్చు నుడిపి,
రాజయోగినివగుచు విరక్తినంది,
బంధములఁ ద్రెంచితివి ; దేహబంధము విడి,
జీవ పరమాత్మ లైక్యముఁ జెందెరాణి ! 13

ఉ. దైవము భక్తులం గడుముదంబునఁ బ్రోచు నటంచు మిథ్యయౌ
భావనఁగూర్చి రార్యు లది వ్యర్థము, హానికరంబునయ్యె ; స్వా
భావిక బుద్ధిమార్గమును బాపి, దురాశల ముంచెఁ జిన్నమా !
యేవిధి నిర్గుణుండు మనకీప్సిత సిద్ధులఁ గూర్ప దక్షుఁడో ? 14

ఉ. జీవుని సృష్టిజేసి, క్రమశిక్షఁ బ్రపూర్ణునిఁ జేయఁబూనినన్
దైవము, పూర్వజన్మ ఫలితంబుల వ్యక్తిగతంబు చేయునౌ;
నావిధి వృద్ధిగాంచి, పరమాత్మునిఁ జేరఁగ వీలుగల్గు ; నే
త్రోవను జూపకుండిన నధోగతి యౌఁగద ! సృష్టి చిన్నమా ! 15

క. చదువులఁ దరగతు లెక్కెడి
విధమున జ్ఞానాభివృద్ధి పెరుగవలెఁ గదా !
విదితముగ జన్మజన్మకు ;
నది కలుగని జన్మకర్మ లపమార్గములౌ. 16

ఉ. ఉత్తరలోక వాసముల నొప్పుచు, జన్మలఁ గూడ నేల న
య్యుత్తము లంటఁగట్టవలె ? నొక్కటి చాలదె ! జీవి ముక్తిసం
పత్తినిఁగాంచఁ ; జిన్నమ ! క్షమన్ సమకూడునె రెండుశిక్షలున్ ?
హర్త దనేకజన్మలను న్యాయ్యము మానవ జీవకోటికిన్. 17

మ. భగవల్లీలకె సృష్టియౌనెడల జీవంబుల్ విలాసార్థమీ
జగతిం బుట్టి, చరించి, చచ్చునెడలం జాలుంగదా ; నిత్యతం
బగ జన్మాంతర బాధలంగుడుప భావ్యంబెట్లగున్ ; బుద్ధినెం
చఁగ ధర్మంబనలేము ; దైవమెటు లిచ్చం గూర్చెనో ? చిన్నమా !
గీ. భార్య భర్తను స్వీయ గర్భమునఁ దాల్చి
రక్తి సంతానముగఁ బునర్జన్మ నొసఁగు ;
గాన మాతయే యనఁదగుఁ గాదె ! దేవి ;
పురుషుఁడే పుత్రుఁడుగఁ బునర్భూతుఁ డగుట. 19
గీ. చిద్విలాసంబె యగునెడ సృష్టి, జన్మ
కర్మలును బాపపుణ్యముల్ కలుగఁబోవు ;
నిత్యజీవులుండరు, వచ్చినిర్గమించు
చుందు, రంతటితోఁ దీరుచుందు దేవి ! 20

---

## —♦ 2. వైరాగ్యము ♦—

ఉ. యాత్రలఁ జేయువారలు రయంబున దారిని ధర్మశాలలం
దాత్రముగా బసల్విడిసి యాదట నేగెడిరీతి నిద్దరం
బాతురి లపాతురిలుం గలిసి ప్రాక్తన పద్ధతిఁ గూడి వీడుటల్
చిత్రములంచుఁజిన్నమ వచించును సృష్టివిధాన మట్టిదే ! 1
ఉ. భూరుహమే జగంబు, దలపోయఁగ దాని విశాల శాఖలం
జేరు ఖగంబులే నరులు, చేరి సుఖంబుగఁ గొంతవట్టు సం
సారము నిర్వహించి, మతి సారవిహీనత లేచిపోవు ; నీ
తీరున కార్తిఁజెంది విరతిం గనఁబోలదు చిన్నమాంబనో ! 2.
చ. సలిల నిధి ప్రవాహమున సంగతిఁ జెందిన ప్రమాకులట్టు లీ
కలుష భవాంబురాశిఁ బడి కర్మవశంబునఁగూడి క్రమ్మరం
దలఁగుచు నుండుఁ దల్లియును దండ్రియుఁ బుత్రి పుత్రుఁడక్క చం
చలతర బంధు భావముల సంగ వియోగము లిట్టివేయగున్. 3

గీ. పుట్టుటాదిగఁ దుదముట్టి గిట్టుదనుక
శ్లేష్మమునఁబడ్డ యీఁగల లీల నమిత
కష్ట సుఖముల నాభాస కలనఁ గనలి,
దేహి మరణించుఁ, బైమాట దేవుఁడెఱుఁగు. 4

గీ. మతము లెన్నైన మాకు సమ్మతమె కాని
తమిని సుఖదుఃఖ సమ్మేళనము నుడుపని
గతులను బ్రయోజనంబేమి కలదు చెప్పుడ
టంచుఁ జిన్నాంబ వాదించు నమల మతిని. 5

గీ. సకల దుర్గంధ మలమూత్ర సంకులమగు
తనువు క్షణభంగురము, హేయతమమును గద !
దీనిఁ బ్రేమించి, పాపభీతిని ద్యజించి ,
నిరయమందుట బుద్ధిలేని పని యనును . 6

గీ. రూప యౌవన సంపత్తి కేపు దొరఁగు ,
లచ్చి చంచల, నిలువదు, వచ్చి పోవు ;
ధర రసాభాసములకు సాధనము లివ్వి ,
పాప హేతువులని సతి పలుకు నెపుడు . 7

గీ. ధన కనక వస్తు రమ్య వాహనముల యెడఁ
బ్రీతిఁ గాంచక, వైరాగ్య రీతి నెగడి ,
మోక్షగామిని యయ్యె నిమ్ముగఁద మిన్న ;
ప్రకట గుణ పేటి చిన్నమాంబా వధూటి . 8

గీ. కోరిక లనంతములు, సమకూర్చు కొలఁదిఁ
బెఱుఁగు, నుపసంహరింప దీపింప కరుగు ;
ధర నివృత్తియె తగిన సాధన మటంచుఁ
బలుకుఁ జిన్నాంబ వైరాగ్య మలము కొనఁగ . 9

గీ. భక్తి వైరాగ్యములు రెండుఁ బరమ పదముఁ
జేర్చు సోపానముల నధిష్ఠింప వలయు;
వర దయాసత్య శౌచ సంపదలఁ దవిలి,
యనుచుఁ జిన్నాంబ సతులతో ననువదించు. 10

గీ. ఐహికాపేక్షలెల్ల శూన్యములు, దేవి!
లేదు లాభంబు, సంసార లీల లనఁగ
నెండ మావులు; కలపోల్కి నుండి, యరసి
కాంచఁబోవంగ రిత్తలు గావె! యెందు. 11

గీ. ఐంద్రజాలికుఁ డాత్మవిద్యా విశేష
మునఁ గనంబడఁ జేయు నద్భుతము లెల్ల;
మిథ్యయే యనఁ, గనవచ్చుఁ; దథ్యమనఁగ,
నిలువఁ బడ; వట్లె సంసార విలసనములు. 12

ఉ. ఈశ్వరుఁ డైంద్రజాలికుఁడు; నీ పరిదృశ్య చరాచరాత్మమౌ
విశ్వమె యింద్రజాలము; వివేకముమాని తదేక రక్తితో
శాశ్వతమంచుఁ బ్రేముడి నెసంగుటయే కనికట్టు; సర్వమున్
నశ్వరమంచు నెంచుచు మనంబుఁ దగుల్పమియే ప్రబోధమౌ. 13

గీ. భవము రాజ్యంబులును క్షణ భంగురములు;
శ్రీవిలాసంబు మరుమరీచికను బోలు;
సతులు సుతులును దటిదభ్రగతుల మెఱతు,
రక్కటా! వీనిమది నమ్మునా! బుధుండు. 14

గీ. హృదయ నైర్మల్యమును బాపుఁ, డదియె ముక్తి
మార్గమును జూపు, వైరాగ్య మహిమఁ గొలుపు;
సచ్చిదానందములు నిత్య సాధ్యములగు
ననుచుఁ జిన్నరాజ్ఞీమణి యనువదించు. 15

మ. అనుబంధంబులు శృంఖలంబులగు నాహా! వాని భేదించు టె
వ్వని కేనిం దరమౌనె? దుఃఖములు సంప్రాప్తించు; వైరాగ్యమే
మనకాధారము; దానిఁబట్టుకొనిన న్మర్యాదఁ గాపాడెడుం,
దనువే నిత్యముకాదు, వ్యర్థమని యెన్నంబల్కుఁ జిన్నాంబయున్. 16

ఉ. మాదిగమించ మీ ప్రకృతిమార్గము, దూష్యము, నేహ్య మాత్రిసం
పాదన సాధనం, బసుర వర్ధనమౌట సుఖంబు శూన్య, మా
వేదనఁ బెంచు, మోహమద విస్మృతి ముంచు, ఫలంబు సున్నయాఁ
జీదర బుట్టఁజేయునని చిన్నమదేవి వచించు నెప్పుడున్. 17

గీ. ఐహికాముష్మికముల పై నాశ లుడుగ
నదియె వైరాగ్య మనఁదగు; నందువలన
భక్తియును బోయి మొండియై రక్తుఁడగును
జీవుఁ, డదియె నిష్కామమౌఁ, జిన్నమాంబ! 18

గీ. ఏడ్పుతోఁ బుట్టి, జీవుఁ డట్లేడ్చుఁ జచ్చు
వఱకు, దైవమే యీదురవస్థఁ బడుట
లీలయా? చిద్విలాసమా? యోలిఁగనఁగ,
రాక్షసాధిపత్యమే జన రంజకంబు. 19

---

## —§ 3. న ర క ము. §—

గీ. యుక్తి సర్వజ్ఞుఁడును, సర్వ శక్తి యుతుఁడు,
నరకమునఁ ద్రోయు సృష్టిని బరపునొక్కొ?
శక్తిలేకున్న విరమింపఁ జాలఁడొక్కొ?
చింత వలదని పల్కును జిన్నమాంబ. 1

చ. నరకము మాటయే తలఁప న్యాయ్యము కాదు, మహానుభావుఁడౌ
పరముఁడు సృష్టి సేయుటయు వాని పరంపరఁ గొందఱైన సు
స్థిర నరకాగ్ని మ్రగ్గుటయుఁ, జెల్లునె? యాతఁడు శక్తిహీనుఁడే!
సఁపడదద్ది దేవునకు సభ్యము కాదను జిన్నమాంబయున్. 2

ఉ. ఎంతటిక్రూరుఁడైనఁ బరమేశుఁడు తా సృజియించినట్టి యీ
సంతతి, జీవకోటులను శాశ్వతమౌ నరకంబునం దిడం
బంతమువట్టునే! తనకుఁ బ్రాభవమేమి ఘటిల్లు దీనిచే
వంతను జెందఁగూడదని పల్కును జిన్నమదేవి సర్వదా! 3

గీ. నరకముల గాథమౌ గర్భ నరకమరయ,
గర్భమునఁ బదినెలలు వ్యగ్రముగ నుండి
రక్తమున మున్గి జీవుఁడు రభస పడు న
టంచుఁ జిన్నమ్మ వ్యాకుల మందు మదిని. 4

## 4 అరిషడ్వర్గములు.

ఉ. కామము ధర్మబద్ధమగు కార్యములందు సుఖంబుఁ గూర్చు, సం
గ్రామముఁ గూర్చు దుష్టమగు కార్యములం బ్రసరింపఁజేయు, ని
ష్కామము దౌష్ట్యమం, దుచిత కామము సత్కృతులందుఁ, జూపనౌఁ
గామియె మోక్షగామి యగుఁగాకను జిన్నమరాణి యెప్పుడున్. 1

ఉ. క్రోధము దుర్వికారములఁ గూర్చు, స్వపక్ష విపక్ష హానికిన్
సాధనమౌను, బుద్ధికి విషాదముఁ గొల్పు, మహార్తిఁ బెంచు, దు
ర్బోధలఁ జేసి దుర్గతులఁ బుచ్చు విరోధి, త్యజింప నర్హమౌ
సాధులకంచుఁ జిన్నమ ప్రశంస యొనర్చు సఖీజనంబుతోన్. 2

ఉ. లోభము బ్రహ్మరాక్షసియె, లోంగినవారలఁ జుట్టుపట్టి, సం
క్షోభమువెట్టు, యోగ్యతల శూన్యము జేసి పరాభవించు, స
త్ప్రాభవమెల్ల డించి ధనరాసులఁ గట్టును బ్రాణ మానముల్;
శోభనమేమి దాన? విడఁజూడుఁడను న్మనచిన్నమాంబయున్. 3

ఉ. మోహమగుం బరార్థముల ముచ్చటఁజెందుట, లట్టి కాంక్ష లీ
దేహికి మృత్యుతుల్యములు, తీవ్ర దురాసద కారణంబులై
దాహముఁబెంచు, నెప్డు పరదార ధనాదుల నంటఁగోరు, సం
దేహమువీడి దీనిఁగడతేర్పుఁడనున్ మన చిన్నమాంబయున్. 4

చ. మదమున సర్వ దుర్వ్యసన మాంద్యముగప్పు, సదాశయంబులన్
సదమల సాధు వర్గవచనంబుల మాడ్చును, దుష్ప్రవర్తనల్
కదిలముసేయుఁ గ్రౌర్యములఁ బర్వ యడావిడి సేయు, నెల్లయా
పదలకుఁ బుంజమౌట విడువందగు నంచను జిన్నమాంబయున్. 5

శా. మాత్సర్యంబును జెందఁగూడ దెపుడున్ మర్త్యాళి, తత్సంగతిన్
వాత్సల్యంబు నశించు, సర్వజన దుర్బాధా విధానంబగున్ ;
సత్సాంగత్యమె దీనికౌషధము, గానన్ మిత్రబృందంబులం
బ్రోత్సాహం బొనరించుఁ దద్విధికిలం బూతాత్మ చిన్నాంబయున్.6

గీ. కేశ నఖములు లజ్జావినాశహేతు
వు, లరిషడ్వర్గములవలె నలము కొనుచు,
నెన్నిసారులు నరికిన నెమగుచుండు ;
విధి నిషేధము లెఱుఁగవు పృథ్వి నెపుడు. 7

గీ. కడలి కెదురీదఁ దలఁచిన వడిఁకి వెనుక
కొట్టుకొనిపోదు, మట్టులే గుణ గతములు
బట్టి దేహాత్మలను బఁడగొట్టఁగలవు,
వానితోపోరు దుర్ఘటంబౌను దేవి !

చ. కలిగినదానిఁ దృప్తిఁగొని కాలముఁబుచ్చిన జీవయాత్ర యే
కలఁతలులేక సాగుఁ గలకాలము ; చూచినదెల్ల నాకుఁ గా
వలెనని పట్టుఁబట్ట నది ప్రాప్తముగాక, మనోవ్యథల్మహా
ప్రళయముగా మథించు, నని వాకొను జిన్నమదేవి సర్వదా.

గీ. నాదియను నహంభావమే పాదు సకల
కష్టములకును, దాత్కాలికముగ లబ్ధ
మగు సుఖంబులఁగుడిచి కాలగతి నడుమ
నటమటలు గల్గవనుచుఁ జిన్నమ్మ పలుకు. 10

—: 5 జా గ్ర త్స్వ ప్న ము లు :—

గీ. సకల జాగ్రదవస్థల జరుగుచుండు
నట్లె, స్వప్నంబులను జీవి యనుభవించుఁ;
గర్మ పరిపక్వమగుట కీ గతు లలవడె,
జనన మరణంబులీరీతి సంభవమగు. 1

గీ. మిథ్యయందు రనిత్య సమ్మేళనముల,
జాగ్రతయు స్వప్న మారీతి జరుగుచుండుఁ,
గన సుషుప్తియె ధర నిత్యగతిని దనరు,
జీవిఁ బోషించునదియె సుస్థిర మనఁదగు. 2

గీ. మెలఁకువను జేయు చర్యలవలెనె స్వప్న
గతములగు చర్యలును జీవి గాంచునవియె;
కలుగుఁ గర్మానుభవము లిక్కరణి ధరణి;
మిథ్యయగు నివ్వి కర్మ శమించి నపుడు. 3

గీ. నిత్యుఁడగు జీవునకుఁ గర్మనియతి వలనఁ
గలుగు నీజన్మ ధరణిఁ దాత్కాలికముగఁ;
గాల మాదిమధ్యాంతముల్ కలదికాదు
గాన జన్మప్రసక్తి దుఃఖపడఁ జనదు. 4

ఉ. కర్మ ఫలానుభూతికిలఁ గారణదేహముఁగాంచు జీవుఁ, డా
కర్మల స్వప్న జాగ్రత లఖండముగాఁ బరిపూర్తిఁ జేయు, నా
ధర్మము లొక్కఁడే, తను మనంబులు నవ్వియె; సత్యమిట్టులే
నిర్మలతన్ గడించి, చను, నిర్జరభూమికి జీవి చిన్నమా! 5

## 15. ఉత్తరలోకము.

క. పితరుల విగతాత్మలు మన
గతులను బరికించుచుండఁ గలవనునది, స
మ్మతిఁగని సమ్మానించును
సతతముఁ జిన్నాంబ వేదసమ్మత భక్తిన్. 1

గీ. ధరణి మరణంబు నందిన నరుల యాత్మ
లన్నియును, నూర్ధ్వ లోకమునందు, సూక్ష్మ
దేహములతోడ నణిమాది దివ్యశక్తు
లమరి, యభివృద్ధిఁగని, ముక్తినందు నను. 2

గీ. తనరు నష్టాంగ యోగ సాధనము వలన
నష్ట సిద్ధులఁ బడయుచు రమల మతులు;
వారు పితరులతోడ సంభాషణములఁ
జలిపి చూచి వచిండెడి సత్త్వయుతులు. 3

గీ. తరుణమున వారు పెక్కు నిదర్శనములఁ
జూపి నమ్మించుచుండిరి, సూక్ష్మ దృష్టి;
వారి బోధన లెట్లపవార్యములగు?
విశ్వసింపఁగఁ దగినవి; విడువఁ దగదు. 4

గీ. దేశ కాలాను సారమై తేజరిల్లు
నల జగద్రష్టలు, బ్రీవక్త లమల మతులు;
వారి ప్రవచనము లిల దబ్బరలె; యనుచుఁ
జిన్నమాదేవి వచియించు వన్నెవెట్టి. 5

మ. పరలోకంబున నున్న జీవులు మహిన్ వర్తించు మర్త్యాళితో
గరిమ న్భూరి సువక్తలంగలిసి యోగ్యప్రక్రియం బల్కను
ద్ధుర వాక్యంబులు ముక్తిసౌధ వరపంక్తుల్జేరు మెల్లొ, నిలిం
ప రమా వైభవ దాయకంబు లనుచు న్వాదించుఁ జిన్నాంబయున్.

మ. పరదేశంబులఁ దీర్ఘయాత్రల కిలన్ వర్తించు బంధుల్, మహా
ద్ధురులై చచ్చిరటంచు నేడ్చెదమె ? తత్తుల్యంబు గాదే ! కనం
బరలోకంబున కేగువారలును ! సంప్రాప్త స్థిత ప్రజ్ఞులై
పరిపూర్ణత్వముఁ గాంతురంచను మహా ప్రజ్ఞాఢ్య చిన్నాంబయున్. 7

ఉ. ఉత్తర సత్యలోకముల నుండురు భౌతిక దేహ ముక్తు, లా
యుత్తమ మూర్తులం గలియనోపు నొకప్పుడఁటన్న, మిత్తికై
చిత్తమునందు వ్యాకులతఁ జెందఁగ నోపదటంచుఁ బూర్తిగా
హ త్తిన చిన్నమాంబ దరహాసము సేయును త్యక్త భీతయై. 8

గీ. గూఢ శక్తులు కలవారు కోరినపుడు
చూచి మాటాడఁగలరు యథోచితముగ
వర విదేహ జీవులతోడ; భ్రమ యనుటకు
వలను పడదని చిన్నాంబ పలుకు చుండు. 9

ఉ. భూత భవిష్య దర్ధములఁ బొల్చెడి శక్తులు భూత పైతృక
వ్రాతమునన్ స్వశక్తులగు; భక్తి పరాత్పరు సన్నిధానమున్,
సీతియుఁ, బారిశుధ్యతయు, నిశ్చల బుద్ధియు, నింతలోన, వి
ఖ్యాతముగాఁ దరింతురని యాడుచు జిన్నమదేవి సర్వదా ! 10

గీ. అనశనులు, ననిమేషులు, నస్పృశులయి
ఘనతర విదేహ జీవాత్మ లనవరతము
జీవనోపాధులకు శ్రమఁ జెంద రగుట ;
మానసిక పారిశుధ్యంబు నూనఁగలరు.

గీ. త్యక్త భౌతిక దేహు లత్యంత నిష్ఠ
భగవ దారాధనము సల్పి వరలఁ గలరు ;
వారలను శరీర విషయ వాంఛలుండ
వనుచుఁ బ్రకటించు మనచిన్నమాంబ సతము. 12

గీ. పాప పుణ్యము లైహిక వాసనలు, న
శించువఱకును బిత్రులోక శిక్షణమును
గాంచి జీవాత్మలును ముక్తిఁగనెద రనుచుఁ
జిన్నమాదేవి సక్తి వచించు నెపుడు. 13

గీ. దైవశోధనల సహించి ధన్యులైన
జీవు లఖిల జీవుల బాగుసేయు కొఱకుఁ
గామహాపులై కృషిసల్పఁ గలరటంచుఁ
జిన్నమాదేవి పల్కు, యోజించి సతము. 14

గీ. సంఘమును గూర్చుకొనియె మోక్షమున కేగ
సరసమగు, నొంటరిగఁ బోవ సమ్మతింప
రామహాత్ములు, లోక సేవాభిరతులు,
వరలెదరు పృథ్విఁ జిన్నమ్మ పలుకు నటులు. 15

గీ. దేవదూతలును, విదేహజీవులు నటఁ
జేరి, భూతల వాసుల క్షేమమునకుఁ
బాటు పడుచుందురని రాణి పలుకుచుండు,
దివ్యవిజ్ఞాన సంఘంబు దీర్చె నిటులు. 16

క. దివ్యజ్ఞానసమాజము
భవ్యాత్మల సూక్ష్మగతులఁ బ్రకటించెను, గ
ర్తవ్యము సాధనయే ; గం
తవ్యము స్వర్గంబు ; రాజ్ఞి తథ్యంబనియెన్. 17

గీ. ఆనిబీసెంటు దొరసాని యధికభక్తి
సాధనముజేసి శక్తుల సక్తిఁ గనెను;
నమ్మఁదగినది, విజ్ఞయు, నక్రమ చరిత,
యనుచుఁ జిన్నమ్మ పల్కుచుండును సతంబు. 18

మ. అల మంత్రిప్రగడాన్వవాయుఁడు, నృసింహాఖ్యుండు, జిల్లాకల
క్టరు, మేధావియుఁ, బండితుండు, సకలోద్గ్రంథంబులం బూర్తిగాఁ
బరిశోధించి, విదేశ శోధనల సంభావించి, లోకాంతరం
బుల జీవాత్మలు వృద్ధిఁగాంచునని విస్ఫూర్తిం బ్రబోధించెనో. 19

గీ. సోదరుండగునతని తచ్ఛోధనముల
యందు నాకును విశ్వాస మలముకొనియె;
వ్యర్థవాక్కుల గ్రంథస్థ పరుపఁ డతఁడు;
సకల సద్గుణ సాంద్రుండు, సత్యమూర్తి. 20

గీ. వ్రాసె గ్రంథద్వయంబు నాంధ్రమున నతఁడు,
సులభమగుశైలి, వచనము, ఫల మధికము;
ప్రతిజనుండును జదువ సంభ్రమముఁ గొలుపు,
నుత్తర సులోక విషయు ప్రకృత్తిఁ గూర్చు. 21

వ. ఉత్తరలోకము కలదని ఋగ్వేదము తెలిపినది. ఆఋక్కు నీ క్రిందఁ బొందుపరచి దానియర్థమునుగూడఁ బద్యరూపముగఁ జూపితిమి. మృతినందిన పురుషుని ప్రేత, భార్య నుద్దేశించి పలుకు సంబోధన.

"మైమాగ్స్తాప్రియే హం దేవసతీ పితృలోకంయదైషి
విశ్వవారా నభసాసంవ్యయం త్యుభౌనోలోకౌపయసాభ్యావవృత్స్వ"
( తై. ఆ. 6–1–2 )

మ. అతివా! నేఁ జనిపోతినంచుఁ దలపోయం జెల్ల దేమన్న దే
వతలం బోలిన దానవై పితృజగ త్ప్రాప్తంబునుం గాంతు, వం
చిత నాకంబును నావరింతువు కడున్ క్షీరామలన్నించు న
ట్లు తగంజేయుము, నీవునేను గలయా లోకంబు లెల్లప్పుడున్. 22

# 16. నాస్తికము.

గీ. ధర స్వభావవాదులు సృష్టితత్త్వ మరసి
కారణము గోచరింపదు, కలిగి విరుగు;
నైజమగుటను దేవుని నామమెత్త
పనియె లేదందురని రాణి పలుకుచుండు. 1

గీ. జన్మ కర్మలు, దుర్భర స్వర్గ నరక
ములు నెగఁడు, నిట్టి సంవాదమున ధరిత్రి
పుట్టి చచ్చుటయేకాని పూర్వ పరము
లుండ వీకదైవ భీతియు నూడి పోవు. 2

గీ. ఆత్మసౌఖ్యము మరణపర్యంత ముడుగ
దెన్ని వాదములాడిన నేమిఫలము ?
భక్తివైరాగ్యములు దేహ బాధలుడుపఁ
జాలవను జిన్నమాంబ యే లీలనైన. 3

గీ. వృక్షము ఫలించు విత్తుల, విత్తులీను
వృక్షముల, నీవిధంబునఁ బెరిగి విరుగుఁ
దరతరంబుల జీవు లుత్పత్తి లయము
లని వచించును జిన్నాంబ యహరహంబు. 4

గీ. బ్రహ్మ లేకున్న సత్యము, వరలు జగము
మిథ్య యనివిశ్వసింప నసాధ్యముగద !
కలిగినది లేదు, లేనిది కలదటండ్రు ;
శాశ్వతముకాని దనిన సంశయము లుడుగు. 5

గీ. అటవి యందున్న సౌధ మధ్యమున నున్న
వచ్చు సుఖదుఃఖములు జీవికిచ్చుట నట ;
రిక్తులును ధనికులును నుర్వి నశియింత్రు,
జ్ఞాను లజ్ఞానులును నిలఁ జచ్చువారె. 6

గీ. పంచ భూతాత్మకంబైన వపువు భూత
తతిని జేరును, జీవంబు తరలి పరమ
జీవమునఁ గలియును, సృష్టి చిత్రమిదియ
యనుచుఁ జిన్నాంబ ప్రకటించు ఘనతరముగ. 7

క. మతములు పరలోకపు సం
గతులే యగునెడల నైహికస్థితికై, ప్ర
స్తుతము పరిశ్రమఁ జేయుఁడు
క్షితినద్దియె చాలుననుచుఁ జిన్నమ పలుకున్. 8

ఉ. వచ్చుచుఁ బోవుచుండు పరివర్తనలంగని యూరకుండుటే
పొచ్చెము ; చేయఁగల్గినది పూజ్యము, సృష్టికి సూత్రధారుఁడౌ
సచ్చరితుం బ్రసన్నునిగ సల్పుప్రయత్నము వ్యర్థమే యగున్
ముచ్చటకైన సాగదని మ్రొక్కివచించును జిన్నమాంబయున్. 9

ఉ. ధాత విచిత్రవస్తువుల ధాత్రి సృజించియు, మానవాళికిం
పై తగురక్తిఁగొల్పి, తగ దంటకు మంచు విధించునే ? మహా
పాతకమౌనె ? చిత్రమిది, పంతమె ? తక్కిన జీవకోటికీ
నైతిక ధర్మవర్తన ఘనంబుగ నక్కఱలేదె యెంచఁగన్. 10

గీ. శక్తిచాలని వారు ప్రశస్త ధర్మ
పన్నముల నేకరువుపెట్టి భయముఁ గొలుపఁ
జూతురని తోఁచు నిహలోక రీతిఁగాంచ ;
ధర్మమెచ్చటఁ గలదని తలఁకు నబల. 11

గీ. శిశుశరీరము క్రమవృద్ధిఁ జెందిఁ, తరిగి,
విరుగు, నట్లెజీవియుఁదనూవిలసనములఁ
బెరిగిజ్ఞానియై, ఘటమునువిడుచు, దేవి !
దేహిదేహములగతుల తీరులివియె. 12

చ. జననమునందిశైశవదశంగ్రమ వృద్ధినిగాంచు జ్ఞానమున్
ఘనముగ, వార్ధకంబునను జ్ఞానముతగ్గు శరీరకార్శ్యతం ;
దనువును నాత్మయేకపరతంత్రత నీగతి హెచ్చుతగ్గుటల్
గన, నవినావిధానముచెలంగును జీవికి దేహమందిలన్. 13

గీ. దేహ మంతరించిన పైన దేహిమాత్ర
మేల విఁగులవలయు ? నిత్య మెట్టు లగును !
దేహి దేహములకు వేఱు తీరు లేల ?
రెంటి కినిమూల మొకటియే రెండు కావు 14

ఉ. చచ్చినవారివెంటఁ జనఁజాలరు బంధువు లెంత యాప్తులై
వచ్చిన, జీవయాత్ర తరుణంబునఁ దప్పరు, బంధముక్తి కా
వచ్చును, తెంపు తెంపెయగు, స్వార్థ పరార్థములెల్లఁ బోవు ; ని
కెచ్చటిముచ్చ టచ్చటికె యేగుననుంగద ! చిన్నమాంబయున్. 15

చ. మతముల నన్నిటిం దరచి మర్దనజేసినఁ గష్టదుఃఖసం
తతులను బాపు సాధన విధానముఁ జూపవు ; వ్యర్థ వాదముల్ ;
వ్రతములు నట్టివే ; రభస, లాభము లేకఁ వృథా ప్రసక్తి, స
త్కృతులనుజేసి కాలమును గడుపుట మేలను జిన్నమాంబయున్. 16

చ. క్రతువుల నాశ్రమంబుల నఖండ తపస్సులఁ జేసిచేసి, సాం
ప్రతము ఋషీశ్వరుల్ కడు విరక్తిని జెందిరి సచ్చిదాత్మ సం
గతిఁ గనలేక ; యేమియును గాంచఁగ లేదని, రట్టిదానికై
మతిచెడనేల ? సత్కృతుల మార్గము మేలను జిన్నమాంబయున్ 17

మ. పశు పక్ష్యాది సమస్త జీవులకు సంప్రాప్తంబుగా నట్టి తా
దృశ సాంసారిక ధర్మము ల్విధికృతాత్మీయంబు లెట్లౌనొకో ?
విశదం బీపరమార్థ లౌకిక విధుల్ ప్రేరేచు వేర్వేఱుగా ;
వశమే చెప్పఁగఁ బుణ్యపాప విభవాల్ప ద్వంద్వముల్,మోసముల్.

ఉ. నైతిక ధర్మశాస్త్రము లనాహత మానవ కల్పితంబు, లా
ఖ్యాతము లయ్యె ; సాంఘిక మహత్తర వృద్ధికి హేతు భూతమై
ఖ్యాతి వహించినన్, భగవదర్థము కాదని చెప్పనొప్పు ; నీ
రీతి గ్రహింపనొప్పు నను లీల వచించుచు జిన్నమాంబయున్. 19

గీ. ఎంత వెదకి చూచినను రవంతయైన
నంతుచిక్కని సంసార మాత్మ తొలఁగ
నెగసిపోవును క్షణములో ఖగము రీతిఁ ;
జింత మన కేటికని పల్కుఁ జిన్నమాంబ. 20

ఉ. మానవజాతికంటె గరిమం బశు పక్షి సమస్త జంతు సం
తానము మేలు ; జ్ఞాన మదవంబుగ నుండుట సత్ప్రవర్తనన్
మాని, యభాగ్య పద్ధతుల గ్రుగ్గి నశించెడి వారికంటె న
జ్ఞాను లదృష్టవంతు లనిశంబని చిన్నమదేవి పల్కెడున్. 21

మ. తనువే వ్యర్థము, దానిలోన, నలస వ్యాపార సంలగ్నమై
వనటం జెందు; సతీ ధనాదు లటుపై వ్యామోహముం గూర్చుఁ; దీ
రని సాంసారిక కృత్య సాధనలపై రాగంబు పెంపొంద, జీ
వన దుఃఖంబులఁ గూలు జీవుఁడనుచున్ భావించుఁ జిన్నాంబయున్.

చ. పరమ వివేచనాపటిమ వర్ధిలు మానవ జీవితంబులం ;
దరుణమునందు దానికి స్వతంత్రత నిచ్చిన యుక్తరీతిగాఁ
బరపును జీవయాత్రను; స్వభావగతిన్ విరమించు దాననా
దరణ మొనర్ప; శ్రద్ధమెయి ధన్యులు గండనుజిన్నమాంబయున్.23

గీ. జంతువుల కొకవిధమగు జ్ఞానముండుఁ,
జేయఁగూడని పనులను జేయవెపుడు;
మనమె బుద్ధిమంతులమయ్యుఁ బనికిరాని
పనులఁ జేసెదమని రాజ్ఞి పలుకుచుండు. 24

గీ. హద్దుమీఱిన జంతువు లసలు లేవు,
తమ నియతులను పాలించి తనరుచుండు;
హద్దుమీఱిన మానవు లరుగు భువిని,
గానఁ బాపులౌదురనుచుఁ గనలు రాణి. 25

గీ. ఆక్సిజను హైడ్రిజను జేర నగును జలము,
వేఱుపడ వాయువులఁ జేరు, నీరు పోవు;
భూతములుచేర జీవుఁడుద్భూతమగు, న
శించు విడిపోవ, నిద్దియే సృష్టి పథము. 26

గీ. బుద్ధి పెడ త్రోవలను బట్టి పోడిమి చెడ
దయయు సత్యంబు శౌచము ధర్మ విధులఁ
దలఁప వలసెను, జీవితాదర్శము లిల
సక్రమములైన దైవ ప్రసక్తి యేల? 27



# 17. కలియుగము

చ. కలియుగ చర్యలన్నియు నఖండముగాఁ జెలరేగుచుండె, భూ
స్థలి, జనఘోష రేఁగె, సతతంబును దిండికిలేక రోగపీ
డల హతులౌచునుండిరి, యడావిడి హెచ్చె, రణంబులెల్లెడన్
విలయముఁ గూర్చుచుండెనని విభ్రమఁజెందెను జిన్నమాంబయున్. 1

గీ. పడెను భూస్వాములకుఁ బాలివారలకును,
గూలివారికిఁ, గార్మిక కూటములకుఁ,
ప్రజలకును వర్తకులకును, బతికి సతికిఁ,
ప్రళయ హేతువు లివియని పలుకుఁదన్వి. 2

గీ. రాజు రక్షకుఁడనుమాట రక్తికట్ట
దండనను జేరి పాలించుచుండు మెప్పు
డను ప్రజాపాలనేచ్ఛయే ఘనతఁగాంచె,
ముందుగతిఁ జూడవలెనను ముగుదమిన్న. 3

గీ. పిదపకాలము వచ్చినఁ బెద్దపోక
డలను బ్రకటించుచుండిరి డంబమునకుఁ,
గాని లోనలొటారము ; కాల గతులు
వైపరీత్యములని రాణి పలుకుచుండు. 4

ఉ. ఈ కలికాల చిత్రముల నేమని చెప్పుదు నుగ్గుబాలతో
నేకముఁజేసి దుష్టవిషయేచ్ఛల బిడ్డలకిచ్చి పెంతు, రీ
లోకము మోస పుంజమును, లుబ్ధుల కాకరమంచు, నెమ్మదిన్
వ్యాకులపాటుఁజెందు ననయంబును జిన్నమరాణి వ్యగ్రయై. 5

గీ. వెల్లఁబూయ సమాధియుఁ జెల్లనగును,
వేషభాషల డాంబిక విధులఁ గూర్చి
లోనికల్మషమ్మును గప్పఁబూనుదు రథ
ములని చిన్నమ పలువిధముల వచించు. 6

గీ. చిత్తవృత్తి యొకటి, పైకిఁజెప్పునట్టి
దింకొకటి, చేయునది వే, ఱిఁకేమనఁదగుఁ?
గలియుగంబున ధర్మ సంకర మదియని
రాణి చిన్నమ్మ చిత్తవిభ్రాంతిఁ జెందు. 7

మ. ధనకాంక్షాపరులైన తుచ్ఛులు మహోదారాత్ములా సాధులం
గని బాధించుచుఁ గష్టనిష్ఠురములం గారించి వేధింతు, రా
జనులన్ లక్ష్యముసేయ కాత్మవిధులన్ సవ్యంబుగాఁ దీర్చి స
జ్జన సాహాయ్యము సేత మేలనుచు నిచ్చల్ జాటుఁ జిన్నాంబయున్.

మ. ప్రతివంశంబునఁ గొందఱుద్ధతులు సంప్రాపించియేయుందు, రే
గతి వారిందనియింప శక్యమగునే? కాంక్షల్ తుదల్ముట్టఁగన్;
వ్యతిరేకింప కుపేక్షసేయుటయె దివ్యంబైన మార్గంబుగాఁ
బ్రతివాక్యంబిడుఁ జిన్నమాంబధర నాప్యాయంబు సంధిల్లఁగన్. 9

ఉ. కాపురుషాగ్రగణ్యు లవకాశము చిక్కెడు నంతదాఁక నా
దాపున వేచి, స్వార్థపరతం బసిఁగట్టి, కటా! హఠాద్గతిన్
రూపము మాపివేయుదురు, క్రూరులు వారల దూరదేశ సం
స్థాపన సేయనోపునని సత్యముపల్కెను జిన్నమాంబయున్. 10

ఉ. కప్పనుబట్టి పాము తమకంబున మ్రింగుచునుండ, నద్దియా
చొప్పున నీఁగఁబట్టి తినుచుండును; మృత్యు ముఖంబునందుఁదా
ముప్పును గాంచనుండియు, విమూఢుఁ డనుక్షణము న్మనంబునన్
ముప్పిరిగొన్న క్రోధమున మున్గి చరించును, జిన్నమాంబరో! 11

గీ. సత్యసంధత కలియుగ జనులయందుఁ
గోటి కొక్కనియందైనఁ గూడుకొనదు;
గాంధియొక్కఁడు మాత్రమె గానుపించుఁ,
జిన్నమాదేవి రెండవ దెన్నికఁగను. 12

ఉ. జీవిత కాలమంతయును స్నిగ్ధముగాఁ గొనసాగనీక, లో
కావన దీక్షనూనక, క్షుధావహ కంటక దుష్కృతంబులం
బావనమంచు సల్పుచు నపార ముదంబును గాంత్రుమానవుల్;
దైవము, ధర్మముం, బ్రకృతి దత్తములౌఁగద ! చిన్నమాంబరో ! 13

గీ. ఆంతరంగికమైత్రి సాధ్యంబు కాదు,
స్వార్థ పరతంత్రులైన భూస్వాములకును;
బిదపఁగాలమునందు సంప్రీతికరము
లగును క్షుద్రపథములు చిన్నమ్మ దేవి. 14

ఉ. భార్య విషంబుపెట్టినను, భర్త కిరాతుల కమ్మఁజూపినన్,
ధైర్యముపీడి భూపతు లధర్మపథంబులఁ ద్రొక్కినన్, మఠా
చార్యులు దుష్కృతంబులను సల్పిన, నీకలికాలరీతి కా
శ్చర్యముగాదు; చిన్నమ ప్రశస్తగతి న్నడిపించె ధర్మమున్. 15

మ. నటనల్సేయుచు రెల్లవారలును బుణ్యాస్వాంతులైనట్లు, ప్రా
కట సద్ధర్మ పరాయణుల్వలెను, సత్కార్య ప్రవీణుల్వలెం,
గుటిలస్వాంతులు, ఘోరకృత్య పరసక్తుల్, మోసగాండ్రీ కలిం;
బటుధైర్యంబున నట్టివారి దరిఁ జేర్పన్ రాను, చిన్నాంబరో ! 16

గీ. స్వార్థమున కాహుతిగ సర్వసాంప్రదాయ
ములను ధారవోసెద రధములగు నరులు;
పొట్టఁబొడిచి చూచినధర్మబుద్ధిఁ గనము,
చిన్నమయె ధర్మగతిఁ దరించినది ధరణి. 17

గీ. కలియుగంబున ధర్మసంకల్పము లిలఁ
గలుగనేరవు, సాంఘిక కర్మలందు ;
సంఘమరణము పెండ్లితో సమమునెదరు ;
చెంద దీగణమున కిలఁ జిన్నమాంబ. 18

గీ. ఆమయంబులఁ బాపుటయందు నేర్పుఁ
గాంచి, వైద్యమే తమ వృత్తిగాఁ జరించి,
పరగృహంబుల పడుచుల భంగపరుపఁ
గలరు నీచులౌ వైద్యులీ కలియుగమున. 19

ఉ. ఏదెసఁ జూచినం బ్రళయహేతువులే కనుపించు, ద్రవ్యసం
పాదన కెల్లదుష్కృతులు భావ్యములందురు గోప్యమైనచో,
వాదులువేయ జంకరు, ప్రవాదములం బ్రకటింతురే గతిం
గాదు నివృత్తి, యీకలియుగ ప్రభ యియ్యది, చిన్నమాంబరో 20

ఉ. దబ్బరలాడ జంకరు,సుధామధురోక్తుల మోసగింపఁగా
నిబ్బరమూనియుందు, రవని న్వెనుదీయరు హత్యసేయఁగం
బబ్బముఁదీర్చుకొందు రపవర్తనఁ బూనినవారలౌచు, న
బ్బబ్బ ! వచింప శక్యమగునా ? కలిచర్యలఁ జిన్నమాంబరో ! 21

ఉ. కల్లప్రమాణము ల్సలుపఁగా వెనుదీయరు, ధన్యవాదముల్
చెల్లిన పల్లవాధరలఁ జేరి బిరానఁ బరాభవింతు, రే
యల్లరిచేసియైనఁ గుటిలాత్ములు ద్రోహముఁజేతు రీకలిం;
జిల్లరజాతివారలె ప్రసిద్ధిని గాంతురు, చిన్నమాంబరో! 22

ఉ. కల్లుదుకాణము ల్సభలు, గండ్రలు సభ్యులు, వారి వాదముల్
చెల్లును, యోగ్యమానవులు లేశము మారరు ఛిల్లిగవ్వకుం ;
బ్రల్లదముల్వచించి జనరంజకు లౌదురు, చిన్నమాంబ ! వా
టిల్లు యుగాంతమం దిటులు ; ఛిల్లియు ఛిల్లియె, పల్లె పల్లెయే. 23

ఉ. తిండికిలేక ముష్కరగతిన్ జనపీడను బొట్టనింపు నా
మొండిఘటంబులే ప్రజకు మోక్షముఁగూర్చెడి సర్వతోముఖో
ద్దండులుగాఁ జరింత్రు, యుగధర్మము వచ్చుచునుండెఁ, జిన్నమా!
పండుగ పబ్బమున్ గడియు వారలకుం బయిమాట కేమిలే. 24

గీ. పాడిపంటలు మాంద్యమై పోడిమి చెడె,
మారె ఋతుధర్మములును ప్రేమమ్ము లుడిగె,
మోహ మద విభ్రమంబులు మోహరించె,
రుచులు భేదించెఁ గలికాల రుచుల, దేవి! 25

గీ. ముప్పదేండ్లకె జవసత్త్వములు నశించు,
ముదిమి పైఁబడుఁ, గడు బాల్యముననె చూప
లోచనములకుఁ దగులు సులోచనములు,
కాంక్షలేకాని యనుభవ కాంక్ష లుడుగు. 26

గీ. ధైర్యసాహసములు వీగె, శౌర్య ముడిగె,
వీర్యము నశించెఁ, బౌరుష విధులు సమసెఁ,
బట్టుమని నాలుగడుగులు పెట్టలేరు,
పిదప కాలము వచ్చె నీపృథ్వి, దేవి! 27

గీ. ప్రబలె గోమాంసభక్షణ బ్రాహ్మణులను,
దలఁప నవనాగరక శోభఁదనరె నిట్లు;
వినుత కులగోత్రములఁ బాటిగొన రొకింత,
సకల దేశాభివృద్ధి కాస్పదులు వీరు. 28

గీ. పేరు నష్టము, లాభము పొత్తటండ్రు,
చెల్లదానుడి, కాలవైచిత్ర్య మిదియె;
పేరుసత్యము, మిథ్యయాఁ బొత్తు కలిసి,
జీవకోటికి వైరుధ్యమే విధియగు. 29

# 18. ధనము.

ఉ. ఈశ్వరుఁడిచ్చు నిచ్చుకొను మీవనుచున్ ; భుజియింపఁబోక, తా
శాశ్వతమంచుఁ దద్ధనము సాధులకీయక దాచిపెట్టి, నా
యీశ్వరుఁడే వెసంగొను దదీయ ధనంబును, జేతగాని యీ
పశ్వతి నీచుఁడంచు ; నది భాగ్యవిహీనత చిన్నమాంబరో ! 1

గీ. పుణ్యపాపముల వడి నగణ్యముగను
జేసి, సుఖదుఃఖములఁగని, జీవి పరులఁ
దార్చు కీడుమేలులకు సాధనము ధనము,
చెడుగు, జాగ్రతపడుఁడను జిన్నమాంబ. 2

గీ. రెండువైపుల వాడిగనుండు ఖడ్గ
మరయ ధనలక్ష్మి, గృహలక్ష్మి యనఁగఁ జెల్లు ;
రక్తి భయభక్తులను దగుశక్తి సాక
వలయునని చెప్పెఁ జిన్నను లలితగతుల. 3

గీ. తల్లులకుఁ బిల్లలకు మధ్యఁ దగవులిడును,
గలహములఁ బెంచు, హత్యలఁ గలుగఁజేయుఁ,
గడు దురాసద మైన దీచెడుగు ధనము ;
చీడపురుగని వాకొనుఁ జిన్నమాంబ. 4

ఉ. ప్రీతిగఁ జీవి తాననుభవించిన భాగ్యము, భూత తృప్తికై
చేతులమీఁదుగా వ్యయము చేసినభాగ్యము, సార్థకంబగున్
మూతిబిగించి కోశమున మూసిన భాగ్యము వ్యర్థమై, ధరా
పాతముఁ జెందునన్న నిజభావము చిన్నమరాణి చూపెడున్. 5

గీ. చేతఁజిక్కిన ధనము పంచియిడు బీద
సాదలకు వెంటనే మన సాక్ష్యమఁగను ;
బెట్టెలోనుంచి యెఱుఁగదు పుట్టుటాది,
దాన ఖని గద ! చిన్నమ్మ ధన్యయయ్యె. 6

క. ఆదాయ వ్యయ గణితము
లేదీసతి చిత్తమందు లేశంబైనన్ ;
వాదము లాడదు, సత్కా
రాదులకై ధనముచిక్క నంతియుచాలున్. 7

గీ. అరయ ధనకాంక్ష యిసుమంతయైన లేని
పరమ సాధ్వీలలామ యీ పడఁతిమిన్న ;
ఘన ధనాశా పిశాచంబుఁ గనని వారి
జీవితము ధన్యమని చెప్పుఁ జిన్నమాంబ. 8

క. కలవారికంటె నిరుపే
దలె పుణ్యాత్ములును, సత్య ధర్మాత్ములు నై
వెలయుదురని చిన్నాంబిక
పలుకున్ స్వానుభవశక్తి వైభవ మలరన్. 9

చ. పలుమరు దుష్కృతంబులకుఁ బాల్పడి లుబ్ధుఁడు కాంచనంబు ల
క్షలకొలఁదిన్ గడించి, తమకంబునఁ గోశము నించు, లేశమై
న, లవమునైనఁ దాఁదినక, నర్మిలి నార్తులఁదన్ను కెప్పుడో
విలయమునందు, నయ్యదియు వీగుననున్ మనచిన్నమాంబయున్. 10

ఉ. అట్టిధనంబు వంశమున కంటదు, దుర్వినియోగమై చనున్,
రట్టుగఁ బాపకృత్యముల రాపిడి దుర్జనులెంద ఱెందఱో
గిట్టెద రందు , మీఁదఁ బరికింపఁగ సర్వ వినాశనంబగున్,
దిట్టలు దానధర్మముల నింతురనున్ మన చిన్నమాంబయున్. 11

క. పెట్టెడువారికి ధనమిలఁ
బుట్టును, లోభులకు సుంత పుట్టను, కలదే
గిట్టును, రట్టులఁ బెట్టును,
జెట్టకుఁ గారణమగునని చిన్నమ పలుకున్. 12

క. వడ్డీపైకం బెన్నఁగ
గడ్డది, రేయింబవళులు కనుమూయదు, మా
రొడ్డుచు రెట్టికిఁ బదిరె
ట్లడ్డములేకయె గుణించు నను జిన్నమయున్. 13

క. పాపమువలెఁ బెరుగును ధన
మేపూటకుఁ, బూటపూట కేపు వహించున్ ;
రూపును మాపు నొకప్పుడు
రాపిడిఁబెట్టునని చిన్నరాణి వచించున్. 14

క. తనలేమి కేడ్చి కనలినఁ
జను నొకనేత్రంబు, పరుల సంపచ్ఛ్రయముం
గనలే కేడ్చినఁజెడిపో
వును రెండక్షులని పల్కు భూరితరోక్తిన్. 15

గీ. పుట్టినప్పుడు తెచ్చిన స్ఫురణ గనము
చచ్చునప్పుడు గొనిపోవఁజాల మెదియు,
మధ్యసిరికింత ఘోరసమ్మర్ద మేల?
తగదు తగదని చిన్నాంబ ద్రఢిమఁ బలుకు. 16

గీ. సర్వసంగ పరిత్యాగ సాధనముగ
దానధర్మము లుపయోగ మానుగాన
ముక్తిహేతువు లనిరి సన్మునులు జగతి ;
ధనము వెచ్చించి లోకులఁ దనుప వలయు. 17

# 19. స్త్రీలు.

సీ. భ్రమరసంకుల జటాపటల భారంబుతోఁ
గేలఁబూనిన జప మాలతోడ
యోగనిద్రా రసోన్ముక్త నేత్రములతో
సంహిత స్వస్తి శాసనముతోడ
క్షీరసాగరమహోదార దీధితిమీఱు
డంబారు పట్టు పుట్టంబుతోడ
మరుదంకురోచ్చలత్తరుపల్లవముఁ బోలెఁ
జలియించు మంజులోష్ఠంబుతోడ

గీ. విమలభోగార్థమై మహోగ్రమగు తపముఁ
దివిరి చేసిన పార్వతీదేవి మహిమఁ
బరిహసించుచు మోక్ష తపంబొనర్చెఁ
జిన్నమాదేవి భువిని బ్రశస్తముగను. 1

చ. ఇలఁ బతిభక్తియన్ రథమునెక్కి, సుశీలము వజ్రవర్మమై,
సలలిత ధర్మమే చతురసారథియై, వరబుద్ధి శస్త్రమై,
వెలయఁగఁ బుణ్యసాధ్వులు భువి న్విహరింతురవక్రవిక్రమో
జ్జ్వలులగు శూరులుంబలె నపార జగత్త్రియ జిష్ణుశక్తితోన్. 2

చ. చెలియరో! నీమొగంబనెడు చెన్నగు పున్నమనాటి నిండు జా
బిలి గనిపింపకుంట నతివేల తమోమయ ఘోరవృత్తిమై
నలరిన యీత్రియామ, శతయామ యనన్మదిఁ దోఁచెనాకుఁ, దొ
య్యలి! వరచిన్నమాంబ! మరణాంతర సఖ్యముఁ గూర్చిప్రోవుమా! 3

క. హర కోపాగ్నిం గాలిన
మదనకు, జీవకళవోయ మహింబొడమెను శాం
కరివలెఁ జిన్నమ, రాత్రిం
దిరముగ వెలిఁగెడు మహౌషధీలత వోలెన్. 4

ఆ. ఘనునిరాక కెదురుఁ గను మయూరియుఁ బోలెఁ
గోరిచంద్రుఁగను చకోరివోలె
భానురాకఁగోరు పంకజంబును బోలె
వేచియుండు దేవి! వేగవత్తు. 5

ఆ. నష్టశీలలైన నళినాక్షి యుపభుక్త
మైన కుసుమమాల యనఁగఁజెల్లు;
సతికి మాలికకును సౌశీల్య సౌకుమా
ర్యములు తగును జిన్నమాంబ! ధరణి. 6

క. కరనికరంబుల దివిభా
స్కరుఁడిరుల న్వీరియఁజేయు కరణి నఘముల౯
ధరణిం జిన్నమ సుతప
స్ఫురణ౯ భగ్నంబొనర్చె సాధ్వీమణియై. 7

గీ. ఆఁడువారలమనసు సాహసమునందు
వజ్రకఠినంబు, మఱియుసాధ్వసమునందుఁ
గుసుమకోమలమును నౌచు నెసఁగు దేవి!
నీవె తార్కాణమాదువీ నియతికరయ. 8

గీ. తలఁప నీమేను జల బుద్బుదంబువంటి
దగుట, పెనుగాలిలోపల నునిచినట్టి
దీపకళికనుబోలె నస్థిరమగుటను,
జిన్నమాదేవి పరమార్థ సిద్ధిఁగాంచె. 9

గీ. త్రిభువనాతీత సౌందర్య విభవ, ధన్య
యఖిల లోకవిలోకామృతాంజనంబు
నగుటఁ జిన్నాంబ సాటిసేయఁగ నగును,
వాణితోడను, మేటిశర్వాణితోడ. 10

గీ. అతిచిరప్రాప్తమయ్యె నన్యోన్యరాగ
బంధ సౌశీల్యములు నూత్న భంగి మెఱయఁ;
బద్మినీప్రభాకరుల సంపర్కముగతిఁ,
జక్షురక్షరయోగ విజ్ఞాన మటులు. 11

చ. మనము తలంచినట్లు లణుమాత్రముసాగదు చిన్నమాంబరో !
మనకృతిలోఁ బరాత్పరుఁడు మాటికినెగ్గుఁ దలంపకుండ నిం
పెనయఁగఁగూడెనేని ఫలియించుఁ దలంచినవెల్లఁ; గాకయుం
డిన, విపరీతమయ్యెడు, మనీషితముల్ గురుమర్కటా కృతిన్. 12

క. తిన్నఁగఁ దలపైఁ గాలిడి
తన్నెడి దురదృష్టదేవత నెవండుధరం
గ్రన్ననఁ దప్పింపఁ గలఁడు ?
చిన్నమ ! తటిదంశసమము శ్రీలున్ స్త్రీలున్. 13

క. చపలమతులఁ గాపాడఁగ
నుపమింప విధాతయైన నోపఁడుగద ! మ
ద్యపునిఁ, దరంగిణిఁ, దరుణిన్,
నిపుణత నియమింప నెవరునేర్తురు దేవీ ! 14

క. అనురక్తయైన మొదలన్
వనితామణి నిక్కమమృతవల్లరి ; యటుగాఁ
దనరక, విరక్తయైనం
గనుఁగొన విషవల్లిగాదె ! కాంతధరిత్రిన్. 15

గీ. క్లైపు, స్త్రీత్వంబుఁ, బురుషుఁ, డేకాంతపదము,
నరయ స్వాతంత్ర్యమనునట్టి యైదువహ్ను
లొక్కచోఁగూడెనేని నీ యుర్వియందుఁ
శావనాచార తృణము నిల్వఁగలదొక్కొ ! 16

గీ. విధుని గాంచిన వాహినీ విభునివోలెఁ,
బొంగి పొరలితిఁ జిన్నాంబ పొత్తుగలుగఁ
దద్విరహముననిప్డు చింతఁగనుచుంటి
వరభుజంగము తలమణిఁ బాసినటులు. 17

ఆ. అనిలహతికి శేఁగినట్టి కార్చిచ్చున
కడవియైన ఘాసమైననేమి ?
యటులె దుఃఖవహ్ని యాత్మదేహంబుల
నేకరీతిఁ గాల్చునేవఁ గనక. 18

గీ. అంబుజంబునకుం బృథ్వినంబువ్రవలె,
రవికి దీప్తియుఁబోలె, నుర్వరను దేహ
మునకు జీవముపగిది, నన్ననునయించెఁ
జిన్నమాదేవి, తదభావమెన్నవనట. 19

గీ. దేహసంబంధ సంపత్తి ద్వివిధమయ్యు
నాంతరంగిక సౌహార్ద్రి మలవమునెడ
రెండుజీవాత్మ లేకమైయుండుఁ గాదె !
యర్ధనారీశ్వరుండన నదియె దేవి ! 20

ఉ. పోయినవ్యక్తి రాదు, మరపుంగననోపను, సక్తచిత్తులా
ప్యాయత నంద సంస్మరణ బాయునె? లోకము లంతరించినం ;
గాయము పోయినన్ మది వికాసము పోవునె? చాతకంబులా
త్మీయ విలాసముం దెలుపుఁ, దెంపున జంటను వీడకుండుటన్. 21

మ. చలచిత్తంబున మూర్తిమంతమగు స్వేచ్ఛాదుర్విహారార్త లే
ఫలితంబుం గలిగింపనేరవు, వృథావ్యాసంగ మాత్రంబులే;
విలయంబుం గననేర వాత్మజనిత ప్రేమానుబంధంబులుం;
దలయే వీనికి వానికంచుఁ బలుకుం దోడ్తోడఁ జిన్నాంబయున్. 22

గీ. పరిణయ మాత్మీయ సంబంధ ఫలములీను,
దేహసంబంధ మైహిక తృష్ణఁదీర్చు;
హస్తిమశకాంతర విభేదమమరు నిచట
నని వచించుచు జిన్నాంబ ఘనతమీఱ. 23

గీ. జలమునందలి బుద్బుద సమము తనువు,
శాశ్వతంబగు నాత్మపరిసక్తి, గాన
నాత్మసమ్మేళనమె ప్రశంసార్హమగున
టంచు జిన్నమ్మ ప్రవచించు ననుదినంబు. 24

మ. అరయం బెండిలికాలమందుఁ బరిపూర్ణాత్మార్పణంబౌ, నటుల్
సరసన్ దైహికచిద్విలాసతఁ బునస్సంధాన మాపిమ్మటన్;
ధర వైవాహిక బంధమిట్టి దెటు వ్యర్థంబౌను మృత్యుస్థితిన్?
వర నారీమణులార! చూడఁ బునరుద్వాహం బధర్మంబగున్. 25

ఉ. పామరవృత్తిఁ గామతను భావ సుఖానుభవార్థ మిద్దరం
గోమలి కాముకుండుఁ గవగూడి చరించుట పెండ్లికాదు, స
త్ప్రేమను రెండుభూతములు వేర్మిడి నైక్యముఁజెందుఁ బెండ్లియే
క్షేమముగాంచు; వీరు పరకీయులు గారను జిన్నమాంబయున్. 26

ఉ. జీవము లేకమైనతఱిఁ జిత్తము లైక్యతఁ జెందు, దేహముల్
పావనమందు, దంపతులకక్కటా; వియోగము సంభవింప, సం
భావనమాని, లౌకికుల వర్తనఁజిక్కుట నీచమయ్యెడున్,
భావుకహాని మార్గమను వభాగ్యము చిన్నమ పల్కునట్లుగన్. 27

గీ. ఆత్మభవులగు బిడ్డలయందుఁ బ్రేమ
సహజమగు, జంతువిలవెంచి శక్తి గల్గ
విడిచి మరచును, మనుజుఁడు విడువలేఁడు,
దీన సంసారబంధంబు తెంపుఁగనను. 28

గీ. లలిఁబరాధీన లాఁడుపిల్లలు ధరిత్రిఁ
బతులు క్రూరాత్ములగునెడ సతులుఁతల్లి
దండ్రులను జూడనైన స్వతంత్రమీయ
రని యిజుగుపడు మదినిఁ జిన్నాంబ సతము. 29

గీ. పుట్టినింటను గొన్నాళ్ళు, పురుషునింటఁ
గొంతకాలము, సేవలఁగూర్చి యడఁగు,
సతులు లోకవిజ్ఞాన సంయుతులు గారు,
ధర్మమే యిది లౌకికా దర్శమగునె ? 30

గీ. యుద్ధరంగములందుఁ బ్రసిద్ధిఁగనిరి,
భక్తి విజ్ఞాన యోగ సంపత్తిఁ గనిరి,
రాజ్యములుజేసి ప్రబల ప్రపూజ్యులైరి,
స్త్రీలు పురుషులకెందును దీసిపోరు. 31

ఉ. స్త్రీలును మానవాంశజలు, చిత్తవిశుద్ధులఁగాంచ నర్హులై
క్రాలెదరన్నమాట బధిరంబగు ; భర్తల కన్నిసౌఖ్యముల్
తాలిమిఁగూర్చి, కష్టములఁదాము భరించుట త్యాగమయ్యు, స్వే
చ్ఛాలలితంబుగానిది, ప్రశస్తముకాదను జిన్నమాంబయున్. 32

చ. విరసత ధూర్తవర్తనలఁ బెంచెడి భర్తల యాధిపత్యముల్
తరుణుల కాత్మఘాతలగుఁ ; దథ్యము ; జీవిత మంతయున్ వృథా
పరుపక, దుష్టులన్విడిచి, స్వస్థతఁ గాంచి తపంబుఁ జేయుటే
పరము, పరాభవంబులెడ బాయు ననుంగద ! చిన్నమాంబయున్. 33

ఉ. మూలను బెట్టికొట్టినను మూగియుఁబైఁబడి మీకు నెప్పుడో,
తాలిమి నిల్వనేర్చునె వ్యథల్పడ నెప్పుడుఁ? గీడుమూడు నే
కాలమునందొ! భర్తకును గాంతకుఁ; గావున నిట్టికాపురం
బేలని నెగ్గు? దుఃఖము లనేకములౌనను జిన్నమాంబయుక్. 34

చ. తలఁపులుఁ గాంక్షలున్, వివిధ ధర్మము, లైహిక వాంఛ లన్నియుం
బొలఁతుల కాత్మవల్లభుల పోలిక నుండును, శక్తియుక్తులం,
గలుముల లేములన్, సకల కష్టసుఖంబులఁ, బాలుగొందు, రెం
దులకిఁక నాఁడువారలను దూష్యత, యంచను జిన్నమాంబయున్.

గీ. సర్వ సంగ పరిత్యాగ మూర్విఁజేసి
భార్య భర్తను జేరు స్వాభావికముగ;
క్షేమమే? దాని కవమతిఁ జేయఁ దగునె?
పురుష వర్యులకని యింతి పొసఁగఁ బలుకు. 36

గీ. భర్త లపచారములు జేసి ప్రబలు లగుట
భార్యలు ప్రతిక్రియలు సేయవలె ననుకొని
తప్పుదారులఁ ద్రొక్క సిద్ధపడుదు రిలఁ;
బతులె పతిత హేతువులని పలుకు నతివ. 37

గీ. నావికుఁడు నౌకఁగొని వార్ధి నడచునట్లు
పతియు సతిఁగొని సంసృతిఁ బరప వలదె!
రెంటిలో నెద్ది యొరఁగిన రెండు మునుఁగు;
ననెడి యుపమను జిన్నాంబ యనువదించు. 38

ఉ. రాగము రూపయౌవన పరంబని కొందఱు, సద్గుణాంచితో
ద్వేగమటంచుఁ గొందఱు, సతీకృత సత్కృత సాహచర్య సం
యోగమటంచుఁ గొందఱును, యోజన సేయుదు, రన్నిగూడినన్
సాగు సతంబు సద్గతికి సాధనమౌనను జిన్నమాంబయున్. 39

—( బాల్యవివాహములు. )—

గీ. పైవిలాసము లెంతెంతవఱకు నిలుచు ?
భావపరిణామ దశలను బాటి గొనినఁ ;
జిన్నతనమున భావముల్ స్థిరపడు నెడ
వన్నెదేరును, జిన్నమ్మ పలుకు నటులు. 40

ఉ. చిన్నతనంబునన్ హృదయసీమను హత్తిన హావభావ సం
పన్నత సుస్థిరంబగును భార్యకు భర్తకుఁ జిత్తశుద్ధిగా ;
సన్నిహితానురాగములు సంభవమైనవి పోవు జన్మలోఁ ;
జిన్నమపల్కు బాల్యమునఁ జేయు వివాహములే దృఢంబులౌ. 41

గీ. ఈడు వచ్చిన బిడ్డల నెంచ, బుద్ధి
పలుతెరంగులఁ బ్రసరించు, నిలువ దొకట ;
వారియెన్నిక తుద కపభ్రంశ మగును,
దంపతుల యనుబంధముల్ తరలిపోవు. 42

క. కనిపెంచిన మాతాపిత
లనువగు సంబంధవిధుల నమరుప లేరే ?
మనమనములఁ గడు దృఢపర
చినఁ జక్కంబడు నటంచుఁ జిన్నమ పలుకున్. 43

ఉ. భర్తలు కీర్తిశేషులయి వందురు కాంతల కార్తిఁగూర్చుచున్
ధూర్తులు కేశఖండన విధుల్ పచరించి, త్రపా విహీనులై
వర్తిలుచుండ్రి, వారలు కృపా రహితాత్ములు, ధర్మమిట్టి దు
ర్వర్తనలన్ హరించెఁగద ! బాపురె ! చిన్నమ ! యేమనందగున్.

చ. సహగమనాది దారుణ దశల్ తొలఁగించిరి చక్రవర్తు, లీ
బహుళతరాపదల్ దొలఁచు భవ్యసుశాసనముల్ రచించుటన్
మహదుపకారులై సతుల మానధనంబుల నిల్పరాదె ! దు
స్సహములు, మూఢపద్ధతు లసహ్యములౌఁగద ! చిన్నమాంబరో !

ఉ. మానవజన్మ మెత్తుట యమంగళమా, మనభారతావనిన్
మానినియౌటకంటె నవమానము వే ఱొకటుండునే! పరా
ధీనలు, జన్మనంతను వృథం, బరసేవను బుచ్చి చచ్చుటే
గాని, స్వతంత్రలై ప్రతిభఁ గాంచుట శక్యముగాదె! చిన్నమా. !46

ఉ. ఎంతటి దారుణంబొ? హృదయేశ్వరు నింట వసించు కుక్కకుం,
జెంతఁజరించు వారలకుఁ జిత్తము నొవ్వనిరీతి, కోడల
త్యంతము సంచరించవలె; నద్దిపొసంగనియుంటఁ గాంతకున్
వంతలుతప్ప వెన్నటికి; న్యాయమె యీస్థితి, చిన్నమాంబరో! 47

గీ. సృష్టిఁ గావించి మాయఁ బూరించి, దాని
గెలిచి రండని పంపె జీవులను ధాత;
రాజయోగినివై రణరంగమునను
జిన్నమా! దిగ్విజయము గాంచితివి ధరణి. 48

గీ. అస్థిరములైన లక్ష్మి కటాక్షములును,
నట్టి పోల్కనయగు స్త్రీకటాక్షములును,
జ్ఞాని యెవ్వఁడు మదిని విశ్వాస ముంచు?
చెంద దీగణ మునకిలఁ జిన్నమాంబ. 49

క. ఆదర్శ ప్రాయముగాఁ
బ్రాదుర్భావంబునందెఁ బడఁతుకలారా!
సాదరమునఁ జిన్నాంబను
మాదిరిగాఁ గొనితరించి మనుఁ డెల్లపుడున్. 50

## —•నిర్మల ప్రేమ•—

### గీత మాలిక.

ధర ననిర్వ్యాజమగు ప్రేమ తగునటంద్రు,
ధర్మవేత్తలు దానిఁ దత్త్వమసి యంద్రు,
ప్రతిఫలాపేక్ష లేకయే వరలు ప్రేమ
తత్త్వమేరీతిదో చెప్పఁ దరము గాదు;
నరుఁడు నిష్కామమగు భక్తి నెరపఁగలఁడె?
కోర్కి లేకున్న దేవుని కొలువదేల?
చిత్తవృత్తులు లేనట్టి జీవి యునికి
నిశ్చలమ్మగు, దైవసన్నిధి యదేల?
దంపతులప్రేమ స్వార్థ తత్పరత నిండి
యుండు, సౌఖ్యాభిలాష లుద్దండములగు;
బాంధవ ప్రేమలల్లె సంబంధ వశము,
లన్నదమ్ములు, తలిదండ్రు, లాత్మజులును,
ఘన పరస్పర లాభ కాంక్షలను బట్టి
ప్రేమల నటించుచుంద్రు, వర్ణింప లేము;
శ్రమలు కలిగినఁ బైకి విక్రమముఁజూపి
హాని జేయుదు రంత బాహాటముగను;
సన్నిహితుల మధ్య నిటులు చావుఁజంపు,
లగుచునుండఁగఁ బ్రేమ కేమిగతి గలుగు?
నాకలిమెలేని భోజనమట్లు ధరణి,
ధారణమును గాంచని లింగధారులట్లు,
పూరణము లేని చప్పని బూరెపగిదిఁ,
గారణములేని ప్రేమ యేగతి ఫలించు?
ఘన తపశ్శాలులైన భంగమొనరింపఁ

గోపమున శపించెద రతిక్రూరులగుచుఁ ;
గొరత పైదింపి మేకులుగొట్టి చంపు
క్రూరకర్ములఁ రక్షింపఁగోరి ప్రార్థ
నలనుజేసిన క్రీస్తేసు కలఁడొకండు
నిశ్చలప్రేమఁ బ్రకటించి నిలిచె వసుధ,
నద్వితీయుఁడగును ; వాని నధిగమించి
వేలు ముడుచుటకును లేరు వేఱువారు,
గాన మనమెంతవారము దానిఁగాంచఁ ;
నని వితర్కించుఁ జిన్నాంబ ప్రణయ సరణి.
ప్రేమసర్వస్వము నొసంగుఁ బ్రియతమునకుఁ
బ్రతిఫలంబునుగోరదు రక్తిగాక !
ధరణి నాత్మార్పణముసేయుఁ దన వరునకు ;
గుణగరిష్ఠతయే మైత్రిఁగుదురుపఱచు,
రూపసంపద తాత్కాలికోపపత్తి
తృప్తిఁగాంచిన జంటకుఁదెంపుగలుగ
స్మృతిహరింపదు, మరపునుజెందదెపుడు ;
జలమునందలి బుద్బుద సమముతనువు,
శాశ్వతంబగు నాత్మ ప్రసక్తిగాన
నాత్మసమ్మేళనమె ప్రశంసార్హమనుచుఁ
జిన్నమాదేవి కడు విమర్శించుచుండు.



# 20. నిందాస్తవము.



ఉ. శ్రీపరమేశ్వరా! యడలఁజేసెద వేలనురా! ధరాస్థలిన్
రాపిడిపెట్టి చంపెదవు, రక్తవిరక్తుల జీవకోటులన్;
దీపములార్పినావు, కడు దీనుల కొంపలు దీసినావు, నీ
పాపము నిన్నుముంచవలెఁ బాడుజగంబును సృష్టిజేయుటన్. 1

ఉ. ఏమి యుఁజేతగాని బలహీనుల, జీవుల సృష్టిజేసి, సం
గ్రామము వారిలోఁ గొలిపి, రాగ విరాగ సరాగ యుక్తులన్
క్షామమున న్మునుంగఁ, గనఁజాలిన క్రూరుఁడవైతివే! ఖలా!
సామముఁ బూనలేవె! విరసంబని లోకులు తిట్టిపోయరే! 2

ఉ. దారుణ మూర్తి వైతివిగదా! నిజ సంతతి నార్తిముంచఁగాఁ
దీరెనె రంధి నీకుఁ! బరితృప్తిని గాంచితివే! నరాంతకా!
మారణ హోమము న్సలుప మండన ముండనముల్ లభించెనే!
క్రూరుఁడ దైవమా! యనుచు ఘోరముగా నిలఁ దిట్టిపోసెదన్. 3

గీ. బరిదెగినవాఁడ నాకిఁక భయము లేదు,
చేయఁ గలిగిన యపకృతిఁ జేసినావు,
జలగవలెఁ బట్టి పీల్చెదఁ జలముఁ బూని
ప్రళయ కాలము వఱకు, నభవ! సురేశ! 4

గీ. ఆలు మగలకుఁ బితరుల, కాత్మజులకు,
ధర వియోగముఁ జేసి, రోదనను ముంతు
వటర! దేవ! దుర్మతివి, నీయాట సాగు
చున్నది నిరంకుశంబుగ, నన్న ద్రిశిమా. 5

గీ. సిగ్గుచిరములఁ గడుపీడి, పగ్గె కీటులు
పృథ్విఁ జెలరేగితివి వీర్య వృద్ధివలనఁ;
బ్రతిఘటించెడు వార లెవ్వరను దర్పిమ,
దేవ! తిట్టెదఁ, గవిని, బ్రతి క్షణంబు. 6

గీ. పస సరస్వతీదేవి నారసన నిల్చి
కుప్ప తిప్పలుగఁ బలుపల్కులను బల్కఁ
జేయు, రేయుంబవలును ఘోషింతు నభవ!
నీ దురాసద చర్య లన్నిటిని సతము. 7

గీ. తిష్ట కుహురనియుటులు నీసృష్టి నేల
చేసితివి! పుట్టిమునిఁ గనే? శ్రీనివాస!
నిర్వహింపని కార్యము నెట్టవలదె!
ధర నశక్తతఁ బ్రకటింపఁ దగునె నీకు? 8

గీ. నిర్గుణుఁడు, నిర్వికల్పుడు, నిరవధికుఁడు,
మొద్దువలెనుండ కిట్లు విమూఢు పగది
సృష్టికిఁ గడంగనేల? యశేష జనుల
ఘోర బాధలఁ బడ ద్రోయఁ గోరనేల? 9

గీ. వెఱ్ఱిపని జేసితివి, నీవివేక మెచటఁ
బదటఁ గలిపితివి? సురేశ! ప్రతిభ యుడిగెఁ;
జేతగాని తనంబునఁ జిక్కితి విట
నిన్ను దిట్టనివారు లే రెన్నిచూడ. 10

గీ. దానవుల తపశ్శక్తికిఁ దనివి నొంది
తగని వరములనిచ్చి, పిదప సురాళి
వారు బాధింపఁ దెల్లపో వలసివచ్చె;
దూరపుందృష్టి లేని యంధుఁడవు; దేవ! 11

గీ. "ఎంతపనిఁజేసితివి రామ! యేమనఁదగు?
సార్వభౌమ"! యనెను వాలి; సమసెఁ బ్రజ్ఞ;
యున్న సర్వజ్ఞుఁడను బిరు దూడిపోయె;
మోసగాడ వైతివిఁక దామోదరుండ! 12

గీ. చేయువారికిఁ దప్పదు చేత ఫలము;
చేసితివి సృష్టి, మాతిట్లు చెదరి పోవు;
శాశ్వతంబగు నపకీర్తి సంభవించెఁ;
దప్పుకొనఁజాల వౌరౌర! ధర్మ దూర! 13

గీ. సత్యకథనము కఠిన మసాధ్య మగును,
గష్ట నిష్ఠురములవి యనిష్టమె యగుఁ,
గాని తప్పదు విధికృత మైనకతన;
విధివి, నీమాట నీకె ప్రాపించె, సభవ! 14

క. నీచేతలు నీ నొసటికె
పాచితముగఁ దాఁకె, దేవ! ప్రాణ విదారా!
నీచాతి నీచమగుఁగా!
నీచరితము దుర్విపాక నిధి యనఁజనదే? 15

క. నీచేతి కీలుబొమ్మల
మే చొప్పునఁ ద్రిప్ప నట్టులే తిరిగెద మో
వాచామగోచరాత్మా!
మాచేఁ దిట్టులను దినకు మహిత గుణాఢ్యా! 16

గీ, తిట్టఁగూడదు దేవుని దెంపుచేసి,
పనికిమాలిన సృష్టిని వరలఁజేసె,
నెవ్వరేడ్చిరి దీనికై? రవ్వ పడియె
ననుచు దూషించు చుండెద మనసు నొగిలి. 17

గీ. జనన మరణాంతరంబున సకలకష్ట
ములను బ్రతిజీవుఁడును బొంది కలఁతఁజెంను,
స్రష్ట శక్తి హీనుఁడును, నజ్ఞానియు నగు,
ననుచు నెప్పుడు దూషింతు మనసునొగిలి. 18

గీ. మానవుని జ్ఞానమునకంటె మాంద్యమయ్యె
దైవ విజ్ఞాన సృష్టి విధాన మకట !
కన నపభ్రంశమయ్యెను గర్హితముగ
ననుచు నెప్పుడు దూషింతు మనసు నొగిలి. 19

గీ. జనకుఁ డాత్మజులను సాకు సరళి యైన
లేదు విధి జీవులను సాకు లీలలందుఁ ;
బ్రేమయెచ్చట సమసెనో ; సామ ముడిగె ;
ననుచుఁ నెప్పుడు దూషింతు మనసు నొగిలి. 20

గీ. దయను, సత్యము, శౌచము, ధర్మ గతుల
గంగలోఁ ద్రోసెఁ, బుట్టించి కడకు విడిచె ;
దిక్కుమాలిన పశ్వుల ఫక్కిఁ జేసె,
ననుచు దూషింతు నెప్పుడు మనసు నొగిలి. 21

గీ. తెలివితేటలు శూన్యమై తికమకలకు
దింపె, దైవ విజ్ఞాన మీతీరుఁగలది ;
కన నపభ్రంశ మిట్టి సంకలనఁ దలఁప
ననుచు దూషింతు నెప్పుడు మనసు నొగిలి. 22

క. పుట్టించ నెవరు కోరిరి ?
కట్టా ! కట్టడులఁగూర్చి కారియ వెట్టన్
దిట్టఁడు భగవానుఁడు, నా
తిట్టుల తాకిడియె తగిలి తీరును గుఱిగా. 23

క. చేసిన పాపముఁ జెప్పక
శాసించును దారుణముగ, సత్త్వగుణము నీ
వాసికిఁ దెచ్చెను దైవము
దోసమె మన మీసడింప? ధూర్తుఁడు గాఁడే? 24

గీ. బానిసలకంటె జీవులఁ బరమనీచ
ముగను బాలించునా! దైవమునకు, దాన
వునకు వ్యత్యాసమేమి లేదనుచు నెల్ల
జనులకుం దెల్పి దూషింతు మనసు నొగిలి. 25

గీ. ప్రకృతి పురుషులు మోహాంధ పశులు, సృష్టి
చేసి విడుతురు పోషించు వారిఁ గనక;
భూమిపైఁబడి జీవులు పోడిమి చెడి
వగలఁ గాంచెదరని రూఢిఁ బలుకఁ గలను. 26

గీ. గర్భ నరకము, తదుపరి నిర్భరైహి
క నరకము, పైనఁ, బరనరకమట! యకట!
సృష్టినైపుణ్య మీరీతి భ్రష్టమయ్యె;
ఖేదజనకము; సృష్టి సంకీర్ణముగను. 27

గీ. కష్టములులేని సౌఖ్యముల్ కలుగఁజేసి
సృష్టిఁజేసిన నది మెప్పుఁజెందుఁగాని
రోగములు దుఃఖములు జావులేగతియగు
సృష్టి బ్రహ్మకుఁ దగదని చెప్పఁగలను. 28

గీ. ప్రజల సృష్టించి, రాగాను బంధములను
బ్రణయ సరణులఁ బూరించి, యణఁచి చంపు
టదియు ఘోరముగాదె! సర్వాధికారి
చేయఁదగినది కాదని చెప్పఁగలను. 29

గీ. దండ ధరుఁడఁట ! తత్ప్రభ మండిపోను,
భూతల శ్రమ చాలదే ! పొడిచి చంపఁ !
జావ వీఁడొకఁడఁట పట్టి చమపునంట !
వలదు నిత్యజీవనమని వాకొనెదను. 30

గీ. చిత్రగుప్తుఁడఁట ! గణన చేయుటకును,
గింకరులఁట ! వేధించెడి కుంక లచట,
వానిరాజ్యము భస్మమైపోను ; యముఁడు,
చెడుగు పాలనమని నొక్కి చెప్పఁగలను. 31

గీ. దొడ్డ యుద్యోగ మలవడె ! దుడ్డు పట్టి
జీవులను మోది బాధించుఁ జిత్ర వధలఁ ;
జీదర యొనర్పదే ! యమా ! సిగ్గులేదె !
యనుచు వెటకారమాడుదు ననుదినంబు. 32

గీ. శక్తి గలవాఁడనని జీవ జంతుతతిని
సృష్టిచేసి వేధించి హింసింతు వటర !
తిట్టి దుమ్మెత్తిపోసెద రట్టు పెట్టి
మాయ మటుమాయమై ధృతి బాయు వఱకు. 33

గీ. దొడ్డదొర ధాత, గాడిద గుడ్డుజేసి
పొడ్డువెట్టెను దాఁగన్న బిడ్డల కిల ;
అడ్డదిడ్డసృజన బ్రహ్మలడ్డు గాదె ?
యనుచు గ్రోడీకరింతు దథ్యముగ సతము. 34

గీ. గణనకెక్కు ధర్మాధర్మ ఘర్షణమున
ధర్మమునకోడు, విజయ మధర్మమునకుఁ ;
గానుపించును, ధర్మ సంకరము దోఁచు,
ననుచుఁ దలపోయు చుండెద మనసు నొగిలి. 35

గీ. దైవము దయామయుండఁట ! ధర్మమూర్తి
యఁట ! స్వయంశక్తి సంపూర్ణుఁడఁట ! ధరిత్రిఁ
బాప భూయిష్ఠముగ నుండె ; వాని ప్రతిభ
యెచట డాఁగెనో ? యనుచునే నీసడింతు. 36

గీ. పరమ దుర్మార్గులగువారి ప్రతిభ హెచ్చు ;
సాధు జనులకుఁ గష్టముల్ సంభవిలును ;
ధర్మ మెచ్చట నున్నదో ? దైవ మెచటఁ
గలదొ ? వైపరీత్యము లిట్లు గలుగుచుండు. 37

గీ. శూన్యముననుండి సృష్టించి, క్షోణిఁబెంచి
శూన్యముగఁ జేయుటది దైవ శోభ యేమొ ?
జీవకోటికి సుఖదుఃఖ శిక్షణమగు
వ్యర్థముగనని చిన్నమ్మ వ్యసన పడును. 38

గీ. భద్రములుగాని ప్రేమాను బంధములను
గూర్చి యెడబాటుసేయుట కూడు నొక్కొ ?
సృష్టినైపుణ్యమునకిది శ్రేష్ఠమొక్కొ ?
తగనిపనియని దూషించెదను ధరిత్రి. 39

ఉ. మాయలమారివాఁడు, తనమర్మము లేరికి గోచరంబుఁ గా
నీయఁడు, ముక్తిమార్గ మవనిం గనఁజేయఁడు, ధర్మసాధనో
పాయముఁ జూపఁజేయఁడు, కృపంగనఁ డీశ్వర తత్త్వ మిట్టిదే !
కాయముఁ బాయ మాయమగుకష్టసుఖంబులు చిన్నమాంబరో ! 40

గీ. దుష్ట సంసార సాగరదుర్విపాద
ముడిపినను జాలు, సుఖముల నడుగ నెప్పుడుఁ ;
బాడు పుట్టుకఁ బుట్టించి చూడఁదగునె !
దేబవలె మానముద్ర వర్తించె దేల ? 41

సీ. పత్ర ఫల పుష్ప భోజనోపాయనముల
దీను లర్పింప మెక్కి మదించి, ప్రభువ!
దుష్ట పరిపాలనముఁ జేయఁ దొడఁగినావు
ధార్ష్ట్యమున నద్వితీయతఁ దాల్చి నావు. 42

మ. ప్రకృతీ! నీకిది భావ్యమా? పురుషు, వైరాగ్యాత్ము, మోహాంధ సం
చకిత స్వాంతునిఁజేసి, లోకముల స్వేచ్ఛన్ సృష్టిఁగావించి, మా
మక పత్నిన్ హరియించి, ఖేద సుఖ కర్మస్ఫూర్తి దారాత్మ్యసా
ధక వృత్తిన్ బ్రతుకంగ నేల? మృతి తథ్యంబౌఁగదా! నీకిఁకన్. 43

క. జలచర భూచర ఖేచర
ముల సృష్టి యొనర్చి, పెంచి, ముంచుట తలఁపం
బలువలు తూనీఁగల తె
క్కలఁజించి హసించు దుష్టగాథ స్ఫురించున్. 44

క. భయభక్తులఁ బ్రకటించిన
దయఁజూడఁడు, వికట మతుల దండింపఁడు, దు
ర్ణయ నయ వినయ జయ పరా
జయ నిర్ణయ విధుల నెంచఁజాలఁ డభవుఁడున్. 45

క. ఒడలు మద మెక్కి, మంచియుఁ
జెడుగున్ గుర్తింపఁ బోక చిత్తము కొలఁదిన్
నడుచు దురాత్ముల కిఁక నె
న్నఁడో? కీడు లభింపకుండునా? క్రొవ్వడఁగన్. 46

గీ. వేశ్యమాత యనందగుఁ బృథ్విఁ బ్రకృతి,
దాని కృత్యములెల్ల క్షుద్రములు, జీవ
వితతి నెల్ల సాకర్షించి చతుర గతులఁ
బట్టి పల్లార్చి చంపు స్వాభావికముగ. 47

గీ. ప్రకృతి, జీవుల నంతలో భంగపఱచి
చుట్టుప్రక్కల వారల ముట్టడించుఁ,
బవనుఁ డవనీజముల నేలఁ బడఁగఁ గూల్చి
నీడనున్నట్టి పథికుఁ జెండాడునట్లు. 48

గీ. క్షణము సుఖమును క్షణము దుఃఖమును గూర్చు
నట్టిదె, దైవగతి వంటిదగును బ్రకృతి;
వీని సమ్మేళనం బతిదారుణమగు
సృష్టికారణమయ్యెఁ బ్రక్షిప్తముగను. 49

గీ. పాప పుణ్య విచక్షణాభావ, ప్రకృతి ;
వాని వరుసల మఱచి సర్వము గ్రహించు
ధూమ్రకేతువు, శివుని సాధ్యునిగఁ బట్టి
ప్రబలి చెలరేఁగి తిరుగు నేబ్రాసి భ్రష్ట. 50

గీ. పెద్దపులి యీని తాఁగన్న పిల్లలఁదిను
రీతి, దైవము జీవుల సృష్టి జేసి
సకల హింసల పాల్జేసి చంపి తినును,
ఘోరశార్దూల మని యనఁ గూడదొక్కొ ? 51

గీ. అగపడక కూడఁగూడ వెన్నాడి తిరుగు
చున్న పగఁగొన్న విష సర్పమోయనంగ
వసుధలోపలఁ గల ప్రాణివర్గమునకు
మృత్యువై ఛాయవలె వెంట మెలఁగుఁ బ్రకృతి. 52

గీ. పిల్లి యెలుకలఁ గొని తెచ్చి పిల్లలకిడి
యాటలాడించి వానికి వేఁటనేర్పి
వధను జేయించురీతి దైవమును జీవ
తతిని హింసించు లీలా విధానమునకు. 53

గీ. ప్రకృతిసైతాను, పాప కారణము ; స్తబ్ధు,
పురుషుఁ డజ్ఞాని, మోహాంధ పరవశుండు ;
వీరి కలయికచే నింత దారుణ మగు
సృష్టిరంధి పుట్టెమునిఁగెఁ, జిన్నమాంబ ! 54

గీ. ప్రకృతి పురుషుని ప్రేరేచి పరపె సృష్టి,
పురుషుఁ డసమర్థుఁ డొంటిగఁ బొదలలేఁడు,
కావునం బ్రకృతియె దుఃఖ కారణంబు,
చిన్నమా ! దాని నిందింపఁ జెల్లు మనకు. 55

గీ. తనర నాదాము హవ్వల ధర సృజించి,
జ్ఞాన వృక్షంబుఁ దోఁటలో నూనినాఁటి,
తాకవలదని శాసించఁదగునె? పతికిఁ ;
బిదప సైతాను ప్రేరేచ విడువఁ దగునె ? 56

గీ ఆజ్ఞ జవదాఁటి భ్రష్టులై యటమటించు
ప్రజల రక్షింపఁ బ్రియపుత్రుఁ బంపె, నతఁడు
సత్త్వమూర్తియై సిలువను జచ్చెఁమదకు,
దైవసృష్టి యీరీతిని దనరె, నహహా ! 57

క. నిందాస్తవమిది దారుణ
మందారున, కార్తధూర్త మహిమాఖ్యానకున్,
సౌందర్య రూప శూన్యన
కుం దుర్మదపూర్ణున, కతి ఘోరాత్మునకున్. 58

గీ. ప్రకృతివశమున నిను దిట్టవలసె, నభవ !
కలఁతఁ జెందకు, నీసృష్టి ఫలితమె యిది ;
పాడుపనిఁ జేయ నింద సంప్రాప్తమయ్యె
నీవె తార్కాణమైతి వీ నియమమునకు. 59

గీ. ఎంతతిట్టిన విసు విసుమంత గనను,
లోకమును నింపఁగలదు నీ శోకడలదు;
బాలకులకయి నిరమింతుఁ, బరమపురుష !
తిట్టినను దిమ్మినను నీవె దిక్కు సుమ్మ. 60

క. తిట్టితినని కినయకు మో
కట్టడిదైవంబ ! నిన్ను గారియ నిడితిం
బుట్టిన పరితాపము తుద
ముట్టఁగఁ బ్రేలితి , నీకఁదుది మ్రొక్కుం గొనుమా! 61

ఉ॥ చిన్నమ జీవయాత్రఁ గృతిఁ, జేసితి గాంచుఁడు సాధ్వి భూతలా ?
భ్యున్నతిఁ బూర్తి గాంచిచనె నూర్ధ్వగతిం, జరితార్థయయ్యెఁ, ద
త్సన్నిధి నున్నమాకు సతతంబును దుఃఖము తప్పు; దైహికా
పన్నుల మాట పాఠకులు ప్రౌఢి క్షమింతురుగాక లోపముల్. 62

మ. కవితాకన్యక నన్వరించెనువయఃకాలంబునం, దీమెకున్
భవబంధంబులు లేవు కావున ననున్ స్వాభావికావస్థలం
దవమానింపను, నీకథామృతముఁ గావ్య ప్రక్రియం గూర్పనా
కవినాభావముతోడఁ దోడ్పడియెఁ గాదా ! చిన్నమాంబాసతీ ! 63

క. హేలాపుర వాసుఁడు, కవి
తా లోలుఁడు, దైవభక్తి తత్పరుఁ, డవనీ
పాలుఁడు, కృతికర్త; గృహిణి
యేలిక చిన్నమ్మ; భాగ్యమియ్యది గాదే ! 64

క. రాజా మంత్రిప్రెగ్గడ
భూజాని భుజంగరావు పూర్ణార్తిని వి
భ్రాజితముగ వ్రాసెను స్తుతి
భాజనమగుఁ జిన్నమ సతి భవ్య చరిత్రన్. 65

# 21. మాతృస్తుతి.

వాడేవు శ్రీరంగనాయకమ్మ. —

సీ. అనుపమానక్షమ, నవనీ సతినిఁ బోలి,
సత్ప్రజా భరమున క్షమను బోలి,
వితత లక్ష్మీసమానత భూమినింబోలి,
గుణరత్న ఖనులకు క్షోణిఁబోలి,
విమల పాతివ్రత్య విశ్రుతి ధరఁబోలి,
ధనధాన్య వృద్ధి భూతరుణిఁబోలి,
వాసుదేవాసక్తి వసుధా వనితఁబోలి,
ఫలదాతృతను బాటపొలఁతిఁబోలి,

గీ. వెలయు శ్రీభుజగ క్షమావిభుని ధర్మ
పత్ని, మజ్జనయిత్రిఁ, గృపాసముద్రఁ,
బుత్రికా వత్సలను, భూరిపుణ్య నిధిని,
జిన్నమాంబను సంస్తుతిఁ జేయుదాన. 1

గీ. దేవతాంగన చిన్నమాదేవి భువిని
మనుజ రూపముఁ దాల్చి నీమముననుండి
పంకసంభవమై యుండు పద్మలతను
జెందురాయంచ వోలెరాజిల్లెఁ దల్లి. 2



# 22. ఆస్థాన కవి విలాపము.

మ. మానిని ! చిన్నమా ! పతి, కుమార, సుతాతనుజా కుమార, పు
త్రీ నిచయంబు, బంధుసమితి ప్రకరంబు విచారవార్ధి నెం
తేని మునింగిరన్న నది యెల్లెడ సాజమె ; నిన్ను గూర్చి యా
స్థాన కవీంద్రచంద్రుఁడును, సాధు శిరోమణి, బుద్ధిశాలి, స
త్సూను సమానుఁడైన మన సుందరరామయ గోడు వింటివే ! 1

గీ. అతఁడు, నీద్వాదశాహస్సు నందుఁగంట
నీరుఁగార్చుచుఁ గూర్చిన నీగుణగణ
గణన సత్పద్యమణుల నేకముగఁజేర్చి
కాన్క పెట్టెదఁ గొమ్మ ! చొక్కఁపుఁ గొమ్మ ! 2

—♦ శ్రీ. సుందరరామకవికృత తారావళి ♦—

చ. తనరెడు చాంద్రమాన బహుధాన్య సమంబునఁ జైత్ర శుద్ధ మం
దున బుధవారసంయుత చతుర్దశి నుత్తర నుత్తరాయణం
బున ఘన మంత్రిపెగ్గడ సముజ్జ్వల వంశ పయోధి చంద్రుఁడై
గణుతికి నెక్కినట్టి భుజగప్రభు పత్ని త్యజించెఁ గాయమున్. 1

ఉ. పుట్టిన స్థానమెయ్యదియొ ? మోదముతోడఁ జిరంబుఁ గీర్తిమై
మెట్టిన స్థానమెయ్యదియొ ? మేను దొరంగిన స్థాన మెద్దియో ?
చిట్ట తలంపఁ ! గన్గొనిన సృష్టియు, వృద్ధియు, నాశనంబు నె
ప్పట్టున నెట్లుగల్గునొ ధ్రువంబుగ బ్రహ్మయె చెప్పనోపెడున్. 2

గీ. పరమ కస్తూరి వంశంబు పరిమళింప
దొడ్డ దొడ్డమపేట నుద్భూతయయ్యె
గణ్య పావన మంత్రిపెగ్గడ సువంశ
పావనత మించి యెనలేని ప్రతిభఁగాంచె. 3



రాజా భుజంగరావు,
వయస్సు 25 ఏండ్లు.





కొమ్మర్రాపల్లి సుందరరామయ్యగారు.

చ. అనయము జక్కినుల్ దనియునట్టుల కుంకుమఁ, బూలుఁ, బండ్లు, వ
స్త్రనిచయముల్, నిచోళములు, సాదరమొప్పఁగఁ బుణ్యకామినీ
జనముల కిచ్చియిచ్చి, కనె సర్వసుపర్వులు మెచ్చునట్టి పు
ణ్యనిధిని జిన్నమాంబ ; తనయాత్మకు శాంతి ఘటిల్లుచుండఁగన్. 4

చ. పనివడి చెంతఁజేరిన సువాసిని యేమెయుఁ గాని పత్రిమై
నను ఫలమైనఁ బుష్పమయినం గొనకుండఁగ రిక్తహస్తయై
చనుట యెఱుంగ మెన్నఁడును, నిశాసమయాతిథులైనఁ దృప్తిఁజే
కొననుఁగాని యన్నమునకుం గొఱయన్న ఋణమ్ములున్నవే ? 5

గీ. సేవకులు తప్పుఁ జేసిన శిక్షసేఁత,
కోపమును జూచియెఱుఁగము, కొద్దిగుణమె
గొప్పఁగా నెంచి మోదంబుఁ గూర్చు, వారి
తప్పు నెఱుఁగమిగాఁగ వ్యాప్తంబు సేయుఁ
జిన్నమాంబ సుగుణజాల మెన్న నరిది. 6

ఉ. సంతతి సౌఖ్యముం, బ్రజల సౌఖ్యము, గారపు భర్తృ సౌఖ్యముం,
జెంతలవారి సౌఖ్యమును, జేరిక విందుల సౌఖ్యముం గడున్
స్వాంతమునం దగోరుఁ, దనసౌఖ్యముఁ గోరదు పెట్టుపోఁతలం
దెంతయుఁ జిన్నమాంబ తన యాలువుఁ జూపుచుఁ బుచ్చెఁ గాలమున్.

మ. పసపుం గుంకుమయే మహాధనముగా, బంధుప్రియంబే మహా
వ్యసనంబై తగ, నిస్వరక్షణమె సాహాయ్యంబుగా, దానధ
ర్మసమృద్ధి న్మణిమండనంబుగ, ఋతార్థంబే మహార్థంబుగా
నెసఁగం జిన్నమరాణి పుణ్యఖనియై యేగెన్ దివాపేక్షయై. 8

ఉ వేడుక రామనామము జపించని వేళ, శివార్చనంబునుం
బోడిమి సేయకున్న దినమున్, వ్రతనిష్ఠఁ జరింపకున్న యా
నాఁడు, ననుంగు బిడ్డలకు న్యాయముఁ దెల్పని యజ్జఁ, బున్నెపుం
జేడెల నెన్నకున్న తఱి, చిన్నమరాణికి లేదు పుట్టువన్.

ఉ. ఆ యిలువేల్పులం గొలుచు నాసయు, నా ద్విజ దేవ సేవ, రా
మాయణ భారతాది బహుమాన్య పురాణ కథా వివేచన
మ్మాయుభయాన్వయ ప్రియ సమాదరణంబును జిన్నమాంబదా
రాయని బంధువర్గము నిరంతర మెన్నఁగ సన్నుతింగనెన్. 10

క. మనుమని నుత్తమ గుణఖనిఁ
దనయునిగాఁ గాంచి కీర్తితనువుం దాల్చెం
దనయలు, మనుమలు, బాంధవ
జనములుఁ జిన్నాంబ యాత్మ శాంతిం గోరన్. 11

మ. ననుసుబ్బాంబ కుమారుఁగాఁగని మహానందంబునం జూచుచుం
జను బాలిచ్చుచు బువ్వఁబెట్టుదినము ల్సత్యంబుగా నేనెఱుం
గను, సుబ్బాంబ ననుం గుమారునిగ వేడ్కంగాంచి పోషించు యౌ
వన వార్ధక్యఁ దినంబులెల్లఁ గనుపాపం జిత్రితంబై తగెన్. 12

గీ. భాగవత భగవద్గీతలో, గిరిశ
చరితములొ, భక్తవిజయ ప్రశస్త కథలొ,
నాముఖంబున వినని దినంబు లేదు
చిన్నమాంబకు బిడ్డలఁజేరి వేడ్క. 13

గీ. మీరు చెప్పిన విద్యయే, మీరు నేర్పి
నట్టి కవనమె, మీచెప్పినట్టి నీతి
కథలె మాపిల్లలకుఁ దెల్పిఁ గలుగఁ జేసె
నని వచించితివమ్మ చిన్నాంబ! సతము. 14

చ. వినెదు పురాణగాథలఁ జెవింబడు ధర్మమొ, సద్వ్రతంబొ, చే
సినదనుకం దలంచుచును జేసితి వెన్నియొ ధర్మకార్యముల్
ఘనతర సద్వ్రతంబులు జగంబున నీసరి మానినీమణిం
గనుఁ గొనలేదు, కన్గొనము, కన్గొనఁబోముఁకఁ జిన్నమాంబరో. 15

ఉ. నీమృతి వార్త వించు మగణించెడువారును, మూర్ఛమున్గి మే
ధామతిఁదప్పి భీతి వసుధంబడు వారును, మిన్ను వ్రీలుచున్
భీమముగాఁ దలంబడిన వేళగ నెంచెడువారు నుండఁగా,
నీ మమకారపుం బతియు, నేనును స్థాణుతనుంటి మమ్మరో ! 16

చ. కడుపున మల్లికార్జున శిఖామణి వడ్డ దినంబులందె నీ
కడుపునఁ బడ్డవాఁడ, ననుగుం గొమరుంబలెఁ జూచి నాకు నే
యెడపున నిష్టమో, యదియ యుత్తమబుద్ధి నొసంగి, ప్రీతితో
నడిపిన కార్యముల్ తలఁచిన న్మది కుళ్లదె చిన్నమాంబరో ! 17

గీ. అన్నయను గౌరవంబున నాదరించి,
వర పురోహితునిగ నెంచి, గురునిగాఁద
లంచి, పూజించితివిగాని, లాతివాని
గా ననుం దలపోయవు గాదె ! తల్లి ! 18

గీ. బిడ్డ లెవరింటికేనియుఁ బేరఁటమున
కేఁగునపుడు, సినీమాల కేఁగునపుడు,
నుత్సవ దిదృక్ష దేవాల యోత్తమముల
కేఁగునపుడును ననుఁగూడ నేగుఁడంచు
నంచుటఁదలంప మది చలియించు నమ్మ ! 19

చ. తన మహనీయభూతి లలితంబది యెక్కడ ? నా యకించన
వ్రిణ నిచయం బదెక్కడ ? స్తవంబొనరించుట గాదు పీటఁపైఁ
బనివడి నున్నయప్పుడును బాపురె ! నన్గనినంత లేచి యా
సనమిడి కూరుచుండును భుజంగ నృపాలుని రాణి వేడుకన్. 20

గీ. మర్త్య లోకంపు బుధులనే మాననీయ
పూజనంబులఁ దనిపిన పూవుఁబోఁడి,
పోరి నమర్త్యలోకంపు విబుధులనెట్టి
పూజలం దన్పుచుండెనో యోజ నిప్పుడు ? 21

గీ. దేవతాయతనంబుల, దివ్యనదులఁ
బూజసేయంగఁ గ్రుంకంగఁబోవునపుడు
నన్ను దోకొని చనుచుంద్రుణంబొ ? పణమొ ?
యిచ్చి ముదమందు నిన్నెట్టు లేను మరతు ? 22

చ అనుశుభ సుప్రసూతి సమయంబుల సత్యవతీ పురంధ్రికిం,
దనయుఁడు పుట్టెనో ? సుకవి ! నందన పుట్టెనొ ? తెల్పుమన్న నం
దనుఁడెయటన్న మోదమున నందను నీవును గంటఁజేసి, మా
తనయను, మీాతనూజుని ముదంబున మాఱుపుఁ జేసికొందమే !
యని వచియించు నీదగు ప్రియంబగు పల్కులు ముల్కు లాత్మకున్.

క. దారా రహితుఁడనై వి
స్తార విచారముననున్న సమయంబున నో
దారిచి పిల్లల నన్నును
నాతేం డ్లింట నిడి ప్రోచితది మరచెదనే ? 24

ఉ. చిన్నమ ! నీగృహంబున విశేషసమంబులు దివ్యగోష్ఠితో
నున్న యనంత పుణ్యమె మహోత్తమ పుణ్యపదంబుఁజేర్చు ; లే
కున్నను నేదరింప మఱియొండు లసత్కృతి గానరాదు ; పై
పున్నెముఁ, ద్వద్విచారకృతి పుణ్యము నన్నిట ధన్యుఁ జేయుతన్. 25

గీ. పుత్రి పుత్రికా పాత్రికా మైత్రిఁ, గీర్తి,
సువ్రత పరత్వమును, శుద్ధి, సూక్ష్మబుద్ధి,
రాసిగాఁబోసి, చిన్నమరాణిఁజేసి
వాసిఁగాంచె సరస్వతీ వల్లభుండు. 26

క. చిన్నమ ! నీవున్నను, లే
కున్నను, నున్నట్లె యెన్ని యున్నాఁడను ; లే
కున్న దినంబుల నాకుం
గన్నుల నీర్వెట్టు భాగ్యగరిమయె మిగిలెన్. 27





రాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారు, నందిరాజు లపతిరావుగారు.

# 23. శ్రీ రాణీ చిన్నమ్మ చరిత్ర.

చ. చెలిమినెసంగె బాల్యమునఁ, జిన్నమ పెండ్లికి మున్నె, నందిరా
ట్చలపతిరావు, మిత్రుఁ, డనిశంబును దేవి యువంత మంతయుం
దెలిసినవాఁడు, వ్రాసె సుమతీ భవదీయ చరిత్రఁ బ్రేయసీ !
నిలుచు నసారతంబు ధరణిం, గొనుమీ కృతి నాత్మశుద్ధిగన్. 1

క. క్షితిఁ బాతివ్రత్యము గల
యతివలు ధర, గగనతలము నైందవకల య
ట్లతి శుభగుణములఁ, గులమున
కతులోన్నతిఁ గూర్చువారలను నీకృతియున్. 2

—§ బ్ర. నందిరాజు చలపతిరాయకవి §—

గీ. మేటిదొడ్డమపేట జమీనురాణి
మహిత శ్రీరంగనాయికాంబా వధూటి
కీరుతులవెల్లి యామె కుమారి నోము
పున్నెముల పంట యుదయించెఁ జిన్నమాంబ ! 1

గీ. పూవుపుట్టుకతోఁదావి పొలుచుమాడ్కిఁ
బూత కస్తూరి వంశ సంభూత యగుటఁ
గన్నెతనమునఁ బొదలెడు చిన్నమాంబ
గొనముల నివాసమై సువాసనల నెఱపె. 2

ఉ. అంగనరూపముంగని, సమంచితవృత్తము, శీలముం గులం
బుంగని, శేముషీవిభవమున్, వినయంబును, బాండితీ సమృ
ద్ధింగని, చాకచక్యము, సుదీర్ణతయుంగని, యిచ్చమెచ్చి, య
ర్ధాంగిఁగఁ దా వరించె భుజగావనిపుం డనురాగపూర్ణుఁడై. 3

గీ. ధర్మశీలుండు రసికవతంసుఁడైన
రాజభుజగేంద్రు ప్రేమ సామ్రాజ్యమేలు
రాణి, మృదువాణి, వితరణపాణి, సిరుల
నలరు కల్యాణియౌర ! చిన్నమ్మరాణి. 4

గీ. అన్నివిధముల ననురూపులైన పుణ్య
దంపతులువారు తచ్చరితములు సుజన
గేయములు, తత్క్రియల్ నిత్యకీర్తనములు
గాన నొకకొంత ప్రకటింపఁ గడఁగినాఁడ. 5

చ. ఇరువురు సత్యసంధులు పరేంగితవేత్త లుదారవర్తనుల్
సరసులు, చారుమూర్తులుఁ, బ్రశాంతులు, భక్తులు, భవ్యసాహితీ
పరులు, స్వసంప్రదాయపరిపాలనధుర్యులు, పాపభీరు, లో
క్కరికొక రెండను న్నములు కారణజన్ములనంగఁ బోలదే ? 6

మ. అనురాగాంబుధి నోలలాడుచు నతిథ్యభ్యాగత శ్రేణులన్,
ఘనవిద్వత్కవివారమున్, శ్రితజనగ్రామంబు, బంధువ్రజం
బును, దీనార్తుల నెల్ల వేళలఁ గృపాపూర్ణార్ద్ర చిత్తంబులం
గనుచన్యోన్యముఁ బంతమాడుదురు సత్కార్యైక లోలాత్ములై. 7

గీ. జ్ఞానియై కర్మకాండంబు గడచె నాతఁ
డార్యగృహిణుల ధర్మ మావంతయేని
విడక కర్మిష్ఠయౌచు సేవించునామె;
యామెవ్రతనిష్ఠ వర్ణింప నలవియగునె ? 8

గీ. సోము సైదోడనంబొల్చు మోముతీరు,
జడియులేముల నల కటాక్షముల సొరు,
నడుగడుగునందు నాటుతమ్ములబిడారు
సార్థకంబౌర యీామె చిన్నమ్మపేరు. 9

ఉ. నోచిననోములెల్ల సుమనోగణతుష్టికి హేతుభూతమై
పూచి, గృహస్థతాఫలము పొంపిరివోవ ఫలించెనాఁగ ధ
ర్మాచరణ ప్రవీణయగు నా యమ కాంచె నపత్యసంపదం;
జూచిన చూపరల్ మదులఁజొక్కి ప్రశంసయొనర్చు టబ్రమే ! 10

సీ. తండ్రిచాణక్యాది తంత్రజ్ఞుల నదల్చు
వ్యవహారపాటవోద్భవ ధిషణుఁడు
తల్లిపిల్లలఁగన్న యిల్లాలు సౌజన్య
ఖని క్షుధార్తుల పాలి కల్పవల్లి
యమ్మమ్మరాత్రిం దివాన్నదానక్రియా
సంతృప్త సకలయాచక కదంబ
తాత దొడ్డమపేఁట నేత, పరాంబికా
వేదపాద స్తవ వితత యశుఁడు

గీ. మగఁడు కవి రాజు ప్రణయ సామ్రాజ్యవిభుఁడు
తాను గొనముల కలుముల తానకంబు
నిట్టిదై, యవలేప మింతేనిలేని
వినయవతి యంచుఁ జిన్నమ్మ వినుతిఁగాంచె. 11

సీ. భర్త మార్కండేయ వరదుఁబూజించుచో
నతనిఁబూజించి ధన్యత్వమొందుఁ
బతి భవానీనాథ పాదాబ్జములఁగొల్వ
నతనిసేవించి సౌఖ్యంబుఁగాంచు

ధవుఁడీశ్వరధ్యానతత్పరుఁడగు వేళ
నతని ధ్యానించి మోదాబ్ధిఁదేలుఁ
బ్రియుఁడు శివైక్యంబుఁ బ్రేమించి యత్నింప
నతని మైక్యాంబె తానర్థిఁ గోరు

గీ. నతఁడు పరమార్థవేత్త, యయ్యంబుజాక్షి
పరమపావన గుణ పతివ్రతలలోన
బుధజనోపాస్య సాత్త్వికమూర్తి యతఁడు,
పూర్ణ విజ్ఞాన సౌజన్య భూమి యామె. 12

చ. చెలువము మేల్గొనంబులు భజించిన సంతతి పెంపుతోడ ని
స్తుల విభవంబుతోఁ గొఱఁతసోకని సౌఖ్యపయోధిఁ దేలుచుం
గులికెడు పుణ్యదంపతులకుం బగఁబూనినయట్లు దైవము
గ్గలపు టసౌఖ్యముంగొలుపఁగా సమకట్టె నసూయపేరిమిన్. 13

క. పారంబు లేనిసమ్మద
పూరంబున నోలలాడు పుణ్య ప
స్మారంబను రోగంబును
గూరిచె దైవంబదెంత కూరిరంబాకటా 14

ఉ. అత్తఱి వెజ్జులెవ్వరుఁ గృతార్థతనొందమి నన్నుబిల్చి మి
త్రోత్తమ! యీామెయామయము నోర్వఁగ సెక్కెముగాదునాకు నీ
విత్తఱిఁ గుగ్గరుంగదిసి యీామెయవస్థను జూపిరోగ వి
చ్ఛిత్తి యొనర్చుబాధ్యత యశేషము నీదని చెప్పినొప్పుగన్. 15

గీ. అన్నయని యామె నన్నెంతొ యమలవృత్తి
నాదరించుట, మిత్రునియాజ్ఞ బలిమి
వారిపట్లను నాగౌరవంబుకలిమిఁ
బాలుపడితిని గుంటూరు పయనమునకు. 16

మ. చనిగుంటూరున కప్పురంబున భిషక్శాలాసమీపంబునం
దు నడింపల్లి నృసింహరావు గృహమందునావాసముం జేసి వెం
టనె కుగ్లర్ దొరసానికిం దెలుపు నంతం గూర్మి మై నామెయుం
దనయాస్పత్రికిం గొంచునేగె నతులోత్సాహంబు దీపింపంగన్. 17

సీ. పేదసాదులటన్న భేదంబుఁగనరాని
మాదిరిఁ బ్రకటించు నాదరంబు,
మిగులగడ్డనితోఁచు నెగులైననింతలో
శమియింపఁబొడము నాశ్చర్యకలన,
యెండుతల న్వచ్చి నిండుటొడింబోవు
బాలెంతగముల సంబరపుఁ బొలుపు,
చెప్పశక్యముగాని శిశురోగము లడంగఁ
బ్రాకిపోరాడు పాపలబెడంగు.

గీ. మూలుగుసవచ్చి నవ్వులఁబోవుచున్న
పడఁతులందిచ్చు మెచ్చుకోల్పలుకుకులుకు,
వెలయఁజూపరకన్నుల విందుగాఁగ
నలరుకుగ్లరుదొరసాని యాసుపత్రి. 18

గీ. ఎడతెగకవచ్చు రోగిణులింటికన్న
గుడియె పదిలంబటన్న నానుడి నిజమ్ము
గాఁగ సుఖమున్న వీక్షించి కలఁతఁబాసి
యచట వసియింపనొప్పెఁ జిన్నమ్మరాణి. 19

గీ. వేళతప్పక గ్రహణంబులీలవచ్చి
యామెనలజడి పఱచు నయ్యామయంబుఁ
గాంచి విస్మయమందెఁ గుగ్లరు కరమ్ము
నాస్థతోడఁ జికిత్సఁ జేయఁగసాగె. 20

శా. ఎన్నో మందులు మార్చిమార్చియు గుణంబింతేని లేకుంట వి
చ్ఛిన్నంబై కలధైర్యమంతయు నుదాసీనత్వముంబూను నా
చిన్నాంబాసతిఁ జూచికుగ్గెరు వృథాచింతింప కోయమ్మ నా
విన్నాణంబెటిఁగింతు నీకు నికఁదేవీ ! ధైర్యముంబూనుమా ! 21

గీ. అనుచు ననుబిల్చి మిగులరహస్యమొకటి
తెలుపుదానను వేఱుగాఁ దలఁపవలదు ;
నైతిక చికిత్సచేఁగాని నాతికింక
నామయ నివృత్తి గాదటంచనుచునామె. 22

ఉ. తేకువమై మదింగలఁచి దిట్టతనంబునఁ బట్టరాని యు
ద్రేకముగల్గఁజేయునెడఁ దీరు నపస్మృతియంచునెంచి ప్ర
త్యేకమసహ్యవస్తువుల నిచ్చిభుజింపక తీరదంచుఁ బెం
భీకరవృత్తి దండనముఁబెట్టినఁ జిన్నమ క్రోధమూర్తియై. 23

మ. వడకంబాఱుచు స్విన్నగాత్రియయి తీవ్రప్రక్రియన్ వాని నో
క్కడకుంద్రోయుచు నన్నుజేరి యిఁక నే నిచ్చో నివేషంబునుం
దడయంజాల మఱొక్కచోటికిపుడే తర్లింపుమాయంచు సం
దడిమై దండడివెట్టుచున్ గదివరాండాలోనికిం దాఁటుచున్. 24

చ. కదలవదేమి ! యిచ్చట నిఁక న్వసియింపను భౌతికంబు సం
పదలకునై పరార్థమును బాడొనరించుట నీతిగాను, బు
ద్ధ్బదసమమా శరీరమెటుబోయిననేమి సుసంప్రదాయమున్
వదలఁగనోప నామయముబారికి నగ్గమయైన నయ్యెదన్. 25

గీ అనుచు గంభీర భీషణోదగ్రచటుల
దుస్సహక్రోధగసభార దుర్నిరీక్ష్య
మూర్తివెలుఁగొందుఁ జిన్నమ్మముందునిలిచి
పలుకనేరక విభ్రాంతి బడలుమదిని. 26

ఉ. చెప్పుదమాయటన్న నటుచేసినలాభము తప్పిపోవునో,
చెప్పకయున్నఁదప్పగునో, చేయుట కెద్దియుపాయమంచు బల్
త్రిప్పల కగ్గమయ్యెను దుదిం దలపోసితిఁ జెప్పరాదటం
చప్పుడె మార్చినాడ బస వయ్యెడనుండి పురంబులోనికిన్, 27

మ. సరిగా జబ్బగపించు వేళకె చికిత్సం జేయుటం జేసి వి
స్ఫురితక్రోధరసప్రభూత చటులక్షోభంబుమై నామయం
బరికట్టంబడె, నాఁడునాటికిఁ గృశంబై శక్తిఁ గోల్పోయె ,సో
దరియుందేరెఁ గలంక నైతికచికిత్సా ప్రాభవంబద్దిరా ! 28

గీ. ప్రమదమందితి వచ్చిన పనిఫలించె
తంతివార్తను బంప మిత్రంబువచ్చె
వచ్చిరొక్కొక్కరే బంధువర్గమెల్లఁ
గడలుకొనె మేటియుత్సాహ కౌతుకంబు. 29

మ. తరువాతన్ బలవర్ధనార్థము చికిత్సం జేయఁగాఁబూనెఁ గు
గ్లరు తన్మూలమునం గ్రమంబుగఁ గనంగానయ్యె నారోగ్య భా
స్వరమా చిన్నమ నవ్వుమోమును దయాసాంద్రంబులౌ చూడ్కులుం
జిరకాలంబునకంచు మోదగరిమం జెన్నొంది రాష్ట్రావళుల్. 30

మ. ఒకనాఁడేనును మిత్రముత్సుకత రేకొత్తంగ నాస్పత్రికిన్
నికటస్థంబగు జొన్నచేని దరికిన్ విచ్చేసి దూరంబునుం
డి కటా ! రోగులకిచ్చు నన్నము సమానీతంబుగాఁ జల్లనై
వికలంబౌటను మాన్ప యత్నమును గావింపంగ యోజించుచోన్.

మ. వినుమా మిత్రమ ! సావధానముగ నావిజ్ఞాపనం బిచ్చటన్
ఘన సత్రంబొకఁడేని లేమి నిటులీ కష్టంబు వాటిల్లుచుం
డెను, దన్నిర్మితిఁ జేయ రోగిణుల కెంతే సౌఖ్యమే పారు నీ
వును, నేతాదృశ శక్తియుక్తుఁడవు గావో నెమ్మినూహింపుమా ! 32

శా. శ్రీమంతుండవు సాధుసజ్జన గణాశ్రీః పాత్రభూతుండ, వు
ద్దా మౌదార్య విశేషశోభితుఁడ, వుత్సాహైక శీలుండవున్,
భూమ ప్రాభవసంయుతుండవు, దయాపూర్ణుండవున్, రోగిణీ
క్షేమార్థంబుగ సత్రమిచ్చుటఁ బ్రతిష్ఠింపంగదోయీ సఖా! 33

చ. తమి నిటులే వచించునెడ దండడిఁబూని తదంతరంగ రం
గమున ననేకభావము లఖండములై నటియించుచున్న చం
దము గనుపించెఁ దద్వదన దర్పణమందతఁడున్ మహాత్మక
త్వమును నుదారతం బ్రకటితంబొనరించు మృదూక్తి నిట్లనెన్. 34

క. ఈజోన్నచేని తలమే
యోజన్ మనకబ్బెనేని నుడుగక సత్రం
బే జతపరిచెద నిట నెల
రోజులలో ననియెమిగులఁ బ్రోత్సాహమునన్. 35

క. అనుటయె తడవుగఁ గుగ్గరుఁ
గని మాభావములఁ దెల్పఁగా నామెయు వెం
టనె శకటం బెక్కించుక
చనె మండల నేతకడకు సమ్మద మొదవన్.

మ. చని, మాభావములన్వచింప నతఁడున్ సౌజన్య మేపార భూ 36
మిని, దద్భూమి పతింగ్రహించి గరిమం బిల్పించి మాసంగతిన్
వినిపింపంగడు నూర్జితాత్ముఁడతఁడున్ విత్తంబుఁ గాంక్షింప, నే
నును సత్రార్థము భూమినిత్తునని యెంతో వేడ్కనర్పించినన్. 37

గీ. కడఁకతోడ "శుభస్య శీఘ్రు" మ్మటంచు
వరముహూర్తమునందుఁ దత్పౌరజనులఁ
బిల్చి సభగూర్చి మండలవిభుని చేతఁ
బాదుకొల్పించినాము పునాది ఱాయి. 38

గీ. సభకు వచ్చిన పురపాల సంఘనేత
పసుపులేట్యన్వయుఁడు రావుబహదరైన
ఘనుఁడు వేంకట కృష్ణయాఖ్యాకుఁడెలమి
హెచ్చుగా నా సభాస్థలి మెచ్చుకొనుచు. 39

ఉ. పొంగుచునాతఁ డిట్లనియెఁ బూజ్య భుజంగ ధరాధినాథుఁడ
ర్ధాంగి కనామయంబొదవె నన్ను ముదంబున సత్రశాల గ
ట్టంగఁ దలంచుటం బురి నడంగెను బెద్దకొఱంత యెద్దియే
నిం గలదేనియీభవన నిర్మితి కేను సహాయమయ్యెదన్. 40

గీ. అనుట నే నాతనింజూచి యనఘ చరిత
నగరపాలక సంఘాధి నాయకుఁడవు
సజ్జనుఁడవౌటఁ బూన్కిమై సత్రశాల
నిర్మితిని జేయు భారంబు నీదె యంటి. 41

ఉ. అందఱు మెచ్చ నీయకొనె నాతఁడు, మేము ధనంబొసంగి యా
నందముతోఁ బరిజనసనాథులమై స్వపురంబుఁ జేరుచున్
వందనముల్ బొనర్చి భగవంతుని గొల్చుచునుండ నింతలో
నం దడవీకమమ్మఁ బయనంబయిరమ్మని వచ్చె వార్తయున్. 42

సీ. పోయిచూతముగదా! మునుజొన్నచేనున్న
భూమి సత్రంబయి పొలుపుమీఱె
ముప్పదిగదులతో ముయ్యంచులొప్పారె
మధ్యగిల్కలబావి మలయుచుండె
నొకవంక బ్రాహ్మణు లొకవంక వైశ్యులు
క్షత్రియశూద్రు లొక్కటను దనరఁ
గనులపండువుగాఁగఁ గానుపించిరి ప్రజల్
నందిత హృదయారవిందులగుచు

గీ. రాణి చిన్నమ్మరావు సత్రప్రవేశ
మొనరఁ జేయించెఁ గుగ్గురు ఘనతమీఱ
భూ నభోంతరములు నిండి భోరుకలఁగ
శాశ్వతానంద కీర్తులు సంధిలంగ. 43

ఉ. చిన్నమదేవి యామయముచేనొక సత్రముఁ గట్టనయ్యె న
త్యున్నతలీల బాంధవము నొయ్యనఁగూడె నృసింహరావుతో
నెన్నఁ బరోపకారకము లిప్పగిదిన్నమకూరుఁ గాదె సం
పన్నులు సౌఖ్యమందుతఱిఁ, బాములనందెడు వేళ, నేనియున్. 44

సీ. వెచ్చించె నెబ్బదివేల రూప్యంబులు
సత్రి నిర్మాణంబు సలుపు కొఱకుఁ
బత్ని యందలిప్రేమఁబరగ సత్రిముఁనామె
పేరఁ గట్టించె సంప్రీతి దనర
నాసత్రి మొగిధర నాచంద్రి తారమై
వరలంగ శాశ్వత వసతిఁ గూర్చె
దానియేల్బడిమిషన్ ధర్మాధికారుల
పరముఁ గావించె సుస్థిరము గాఁగ

గీ. నరుడు భుజగేంద్రుసాటి నేర్పరులు జగతిఁ,
జెలువ జీవించియే తన చిహ్నమైన
సత్రిమును ముప్పదేడు లుత్సాహమునను
జూచి ధన్యత్వమునుగాంచఁ జూచెనొర ! 45

ఉ. పుట్టిన యింటికిం దరుచు పోవుగతిం దలనొప్పి రొంపియేన్
బుట్టిన మాత్రిగుంటురికిఁ బోవుటయే పరిపాటియాట, ని
ప్పట్టున సత్రిమందుఁగల పాంథులకొత్తిడిఁ బాపవేఱుగాఁ
గట్టిరి సత్రిపార్శ్వమునఁ గట్టడమొండు వసింప యోగ్యమున్. 46

చ. మరణము నొందువెన్క సభిమాన పురస్సరమైన చిహ్నముల్
వరలఁగఁ జేయునట్టి యలవాటె కనంబడు దేశమందు భూ
వరుఁడు భుజంగరాయఁ డిరుప్రాణులుఁ జల్లఁగనున్న బాల్యమం
దురువుగఁ బత్నిపేరఁ బ్రణయోజ్జ్వల చిహ్నము నిల్పె నద్దిరా! 47

చ. హితుని హితోపదేశ కృతినేనొనరించిన బోధలంబొన
ర్చితివొక పుస్తకాలయమె శేషముగా సకలమ్ము దాని, సం
స్తుతమతి నీదునామమునఁ జొప్పడఁజేసి కొఱంతఁ దీర్పవో
హితుఁడ ; కవిత్వపారగుఁడ వీవగుటం గరణీయమే గదా! 48

గీ. పార్వతీదేవి చరితంబుఁ బలుకు నపుడు
పలుకు పలుకునఁదోఁచు నీశ్వరుని పగిదిఁ
జిన్నమనుగూర్చి యేమేనిఁ జెప్పఁదలఁప
నొప్పుగా నిన్ను జెప్పియే చెప్పవలయు. 49

గీ. ఆమె పొనరించు పుణ్యకార్యముల కెల్ల
సాక్షి, సాధకుఁడవు హేతువైన వాఁడ
వరయ నీవౌటఁ జిన్నమ చరిత మెపుడు
నీదు చరితకు ఛాయయై నెగడుఁగాన. 50

ఉ. చిన్నమకున్ శిలాప్రతిమ చిహ్నము సత్రము నందు నిల్పఁగా
నున్న నిను న్ముదంబుమెయి నొక్కటిఁగోరెద నీదు విగ్రహం
బున్నెఱి నప్పుడే నిలుపు పోడిమిఁగూర్పుము సత్రశాలకుం
బన్నుగ రాజురాణి ప్రతిమల్ దులలేని యలంకృతుల్గదా! 51

ఉ. చిన్నమరాణి కాపురము సేయఁగ వచ్చిన కొన్నినాళ్లకే
చిన్నికుమారుఁ గాంచె నతసీ కుసుమాభ శరీరునిన్ సునీ
సన్నుతు మల్లికార్జున ప్రసాద సమాహ్వయు నాతఁడద్దిరా!
చిన్నతనంబునందె తన చిత్రకళోన్నతిఁ గాంచె మెప్పులన్. 52

ఉ. ఆతఁడొకండె పుత్త్రిఁడిఁక నాతనివెన్కఁ గ్రమంబుగాఁ దనూ
జాతలు పుట్టిరేడ్గురు ప్రశస్తగుణోజ్జ్వల రూపశోభితల్
ఖ్యాతకుల ద్వయోద్ధరణ కారణ శీలలచూన సత్కలో
పేతలు శేముషీ విభవ విస్తృత భూరియశోవిరాజితల్. 53

క. ధనముగల నాడెదానము
ఘనముగఁ జేయంగవలయుఁ గాదేనిఁబోలం
బున, వెఱబొమ్మయె పోదాఁ
దిన, నితరుల కిడగఁలేని దీనత తగునే! 54

చ. అరణపుదాసిఁ బంపు సమయంబునఁ గాన్కగఁ గంటెలోని బం
గరునొక కొంత తీసి యొడికమ్ముగఁ జాటుగ నిచ్చిపంపె నా
దరమునఁ జిన్ననాఁడె యిటు దానము లెన్నియొ చిన్నమాంబ య
బ్బురముగఁ జేసిపేదలను బ్రోచుగృపారససిక్తచిత్తయై. 55

సీ శ్రుతిహితంబుగఁ బురోహితుల కెల్లప్పుడుఁ
గలకొలందిగ దానములనొసంగు
శనిరవిబుధ ముఖ్యసకల గ్రహంబుల
నారాధనముసల్పు నధికభక్తి
నపరాహ్ణ కాలమునందు నేతెంచెడు
నతిథి నభ్యాగతి నాదరించుఁ
బర్వ తిథులు నేతపర్వమై ప్రాపింప
భూరి దానంబు లవ్వారినిచ్చు

గీ. సిరియు, నాయువుఁజూడ నస్థిరములనుచుఁ
దాను జేసిన ధర్మమే తనదియనుచు
నెప్పుడును నేదియో దాన మిచ్చుచుండు
రాణి చిన్నమ్మరావు ధర్మముల ప్రోవు. 56

సీ. నాథుఁ డొసంగు దానముల కూతమొసంగి
చంద్రమతిని మీఱఁజాలు ప్రోడ
సుఖ దుఃఖముల భర్తృశుశ్రూషఁ గావించి
యల దమయంతిఁ గాదన్నదిట్ట
యనవరతంబు నాథా లాపసక్తయై
ధరణిజతోవంతు కొఱఁగు సాధ్వి
గృహ కార్యముల నేమరిలక నిర్వర్తించి
ద్రౌపది కెనయైన ధర్మగృహిణి

గీ. యొప్పిదంబుగ షఘ్రిము లుప్పతిల్ల
వండి బిడ్డలకుందాన వడ్డనంబుఁ
జేసి కుడిపించు నుత్సాహ శీల యూర!
యెన్న భుజంగేంద్రు గృహలక్ష్మి చిన్నమాంబ. 57

గీ. మంచు రాచూలిఁ గన్న కుమారుగేరుఁ
శౌర్యసాహస వితరణోత్సాహ శాలి
కొలమునకు వన్నెవాసియుఁ గూర్పఁ జాలు
గొనముల కొతాదు మల్లికార్జునుఁ డయారె! 58

గీ. అతని బోనంబు నందిమోహానపుబంతి
యతని వాహ్యాళి గన చతురంగపాళి
యతని రూప మనంగ చంద్రాతిశాయి
యతని నుడితేనె యమృత రసాపనోది. 59

మ. పదునాల్గేడుల ప్రాయమే యతనికిం బ్రాపించె నూఱేండ్లకుం
బదులై యప్పటికే సువాసనల దిగ్భాగంబులన్నిండి యొ
ప్పిదపుం గీర్తుల వార్ధకంబుఁ గనుటన్వేగంగటా! చేరెఁ దాఁ
ద్రిదివంబున్ సుకృతీ గతాయువనుసూక్తిన్ యాథిమైఁ జాటఁగన్. 60

ఉ. పోయిన పుత్త్రితోనె సుఖముల్ సకలంబునుబోయె, వారికిం
బాయని దుఃఖ మామరణ బంధముగా జతఁగూడె, లోకమే
లాయనిపించెఁ, బుత్త్రివిరహంబతి దారుణ దుస్సహంబుగా
దా ! యిఁక నేకపుత్త్రి విషయంబున మేర వచింపశక్యమే ! 61

చ. అడలుచుఁ గూరుచుండవలనా ? కనిపెంచెను వారికంతలో
నుడుగకవచ్చె జ్యేష్ఠ తనయోద్వాహ కౌతుకమంగళంబు వెం
బడిబడికాన్పుఁ, బెండ్లియిటు పాయకవచ్చు శుభోత్సవంబులం
బెడఁగగు సంతసంబు మఱపించె నొకించుక పుత్త్రిశోకముల్. 62

సీ. తరతరంబులనుండి పరువుప్రతిష్ఠల
నలరారు వారివియ్యంబులంది,
శిష్ట పండిత కవిశ్రేణి తుష్టి వహించి
ప్రియమార నొసఁగు దీవెనలనంది,
విఖ్యాత షడ్రసోపేత భోజనతృప్తి
జనము లందిచ్చు మన్ననలనంది,
త్యక్తావలేపసత్కారాతితర హృష్య
దఖిల సంబంధి మర్యాదలంది,

గీ. గాయనీగాయకాతి జేగీయమాన
మానితానూన కీర్తి సంపదలనంది,
పంచ వింశతి వత్సరావసర మిట్టు
లలరె నాత్మేశుతోడఁ జిన్నమ్మరాణి. 63

చ. వెలితి యొకించుకేనిఁ గనిపింపనిరీతిఁ ద్రివర్గ వైభవం
బలవడ నుత్తమస్థితి గృహస్థవిధిం బ్రకటించె వార్ధకం
బొలయకమున్నె సంసృతి పయోధిఁ దరింప విరాగ కృత్యముల్
సలుపుచుఁ గాలముంగడుపసాగిరి దంపతులెంత ధన్యులో ! 64

చ. మనుమని మాన్యశీలునిఁ గుమారభుజంగుని వంశవృద్ధికై
తనయునిగా గ్రహించి జనతానుతి నైహికపుం బరంపు సా
ధన మొనరించుకొంచు ఘనతన్ యువరాజపదస్థుఁ జేసియా
తని యభివృద్ధిఁ గోరుచు ముదంబునఁ దేలుచునుండి రంతటన్. 65

గీ. అదియె సర్వేశు నాహ్వానమనఁగ నుర్వి
వార, ముదరవ్రణంబు సంప్రాప్తమగుటఁ
జిన్నమాంబను దోడ్కొని చెన్నపురికి
వదలి రేకాని, ఫలమేమి పడయరైరి. 66

సీ. ఋక్సామ యజురథర్వోక్తి ప్రసాదిత
ఫక్కి స్సామ్రాజ్ఞీశ్వ పరత నెసఁగ,
యవని "జాయేదస్తు" మనుసూక్తిఁ బాటించి
గృహ యాజమాన్య సత్కీర్తి వెలసి
ధర "సఖాసప్త పదాభవ" యనెడు మం
త్రార్థంబు సార్థక్య మమరఁ జేసి,
నలి "నవయుయోషాకంచనహీనస్తి" యనుధర్మ
మావంత తప్పక యాచరించి,

గీ. కడఁగి యింద్రాణివలె సుమంగలతఁ జెలఁగి,
మొనసి తనయిల్లు వేయిళ్ల మొదలు గాఁగ
బహుళ సత్కీర్తి నార్జించి పరలోక
కమ్మ సాధించ నేగెఁ జిన్నమ్మ రాణి. 67

చ. అరిగితె చిన్నమాంబ! హృదయాధిపుఁడౌ భుజగేంద్రుతోడి కా
పురమును వీడి, నీసుతలఁ బూత చరిత్రల వీడి, బాంధవో
త్కరమును వీడి, నీ దుహితృకాండము గన్న సుతాళి వీడి, భా
స్వర సదనంబు వీడి, విభవం బఖిలంబును వీడి, యక్కటా! 68

సీ. పతిమాట దాటని భక్తురాలవు గదా !
పతినెట్టు లీగతిఁ బాసినావు ?
కడిపెఁడు పిల్లలఁ గన్నతల్లివి గదా ?
పిల్లల నెట్లీగి వెడలినావు ?
చుట్టాల సురభివై శోభిల్లుదువు గదా !
చుట్టాల కేగతిఁ జూపినావు ?
ఆశ్రితాళికి జీవనాధారమవు గదా !
యాశ్రిత గతి కేమి యరసినావు ?

గీ. అమ్మ ! చిన్నమ్మరాణి ! మమ్మాదరించు
మనుజు నెవ్వరి నిఁకఁ బిల్వమనెదవమ్మ !
యెవ్వరికిఁ గానఁబడక యెందేగితమ్మ !
శ్రీమదఖిల గుణాలంబ ! చిన్నమాంబ ! 69

సీ. గొప్పవాలముగల్గు ఘోటంబు తనమేన
ముసిరిన యీఁగల విసిరికొనును ;
గష్టంబులకునోర్చి కడుపారఁ గనుటచేఁ
దనపిల్లలనుబ్రోచు జనని యెపుడు ;
అలుకుపాత్రయొకింత గలిగినవాఁడును
వెలయంగఁ దనయింటి సలుకుకొనును ;
దనపాదయుగముఁ బట్టినయట్టివారికే
రక్తుఁడై దేవుఁడు ముక్తినొసఁగు ;

గీ. గర్భవతులైన సతులకాకాంక్షితముగ
సత్రమిడియెంతొ సౌఖ్యమొసంగినావు ;
నీదు యుపకృతి వరతవర్ణింపఁ దరమె ?
శిష్ట జనతావలంబ ! శ్రీచిన్నమాంబ ! 70

చ. మునుపటి వెల్గు లేదతని మోమున, నా తరళత్వ మేమియుం
గనుపడఁ బోదు, కౌతుకముగా నఁగరా, దిహలోక కాంక్షయొం
దునుగనరాదు, పూర్వపుటనూన వికాసము మాభుజంగునం
దునుగనరాదు, నీయసురుతోఁ గొనిపోతివో చిన్నమాంబరో! 71

ఉ. ఎప్పుడొ జీవులెల్ల మరణించుట సాజమెకాని సత్క్రియల్
చొప్పడఁ జేసి నీవలె యశోవిభవంబు, సుమంగళీత్వ మి
ట్లొప్పఁగఁ బోవువారుగలరో! మఱి నీ పతి శాశ్వతంబుగా
నప్పరసౌఖ్యముల్ గొలుప నాదృతిమైఁ గృతి వ్రాసెనద్దిరా! 72

చ. ఎఱుఁగుమవెల్ల ధర్మములొకించుక, చింత వహింపఁబోక యీ
సరణి సమస్తజీవులకు సాజమెకాన వివేకశాలివై
యుమపుగ నీ సతీమణికి నుద్గతులన్నమకూర్చు సత్క్రియల్
జనుపుటయర్హ మిత్తఱి భుజంగమహీనవ! ప్రాణమిత్రమా 73

గీ. సాధ్విరో! చిన్నమా! నీవు శాశ్వతముగ
నమరపురినుండి నీయన్వయంబుఁ బెనుచు
చారు చరితుభుజంగ కుమారునెమ్మి
దనరదీర్ఘాయువు నొసంగి మనుపుమమ్మ! 74

గీ. ఓ పరాత్పర! యీపుణ్య యుగ్మమందు
నతిశయంబుగ వెలుఁగొందు నస్మదీయ
గౌరవంబిట్లు తెల్పుమార్గంబొకం డొ
సంగు నీకిదె నా నమస్కారశతము. 75

చ. బలితపుఁగూర్మి నీవిభుఁడు బాల్యహితుండగుటన్ సహోదరిం
బలె నిను నేను, సోదరుని భంగిని నీవును నన్నుజూచుటం
గల, యనుతాప మిప్పగిదిగాఁ బ్రకటించినవాఁడ నందిరాట్
చలపతిరావు నాయకుఁడ సమ్మతిఁ జేకొనుమమ్మ చిన్నమా! 76

# 24. పత్రికా సానుభూతులు.

## కీ. శే. శ్రీ రాణీ చిన్నమ్మాదేవిగారు.



ఇమ్మహాసాధ్వి లక్కవరము వెల్ల లోనగు సంస్థానముల కధీశులును, ఆంధ్రసారస్వత పరిషద్వ్యావజ్జీవాధ్యక్షులును, నగు శ్రీ శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరువారి ధర్మపత్ని. వేగాయమ్మపేట జమీన్దారులగు శ్రీ శ్రీ రాజా వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరువారి సోదరి. ఇట్టి మహారాజకుటుంబమునఁ బుట్టి, విద్వత్ప్రభూత్తంసులఁ జేఁబట్టి, యేడ్గురఁ బుత్త్రికా సంతానముం బడసి, దాసదాసీ జనంబులఁ దల్లివలెఁ బ్రేమించుచు, నైహికసుఖంబు లన్నియు బుద్బుదములనియు, నాముష్మికముమాత్ర మపేక్షింపఁ దగినదనియు, నెంచి తన యాభరణముల నెల్లఁ దన కొమార్తెల కొసంగి సంతత ముకుందానుచింతనముతో సంసారవాంఛల నవలకుఁ ద్రోచి యతిథి అభ్యాగతుల కాదరభావమున నాతిథ్య మొసంగుచు శశ్వద్యశస్సు నార్జించి 13-4-38 వ తేదీని భౌతిక దేహముం జాలించి యెల్లర దుఃఖాంబుధి ముంచివైచినదని వ్రాయుటకు లేఖిని జంకుచున్నయది.

ఈమె మహారాజ్ఞీమతల్లి. గుంటూరున "కుగ్లరు" చికిత్సాలయమున కెందఱో వ్యాధితులగు స్త్రీలు ప్రత్యహము వచ్చుచుందురు. వారుండుటకుం దగిన వసతి లేక కటకటం బడుచుండుట గన్నులారఁ గాంచి జాలిఁజెంది వారి యిడుములఁ బాపఁదలఁచి దైవసమానులగు భర్తగారితో మనవిచేసి ఆ వైద్యాలయమున కెదురుగఁ గొన్నివేల రూప్యముల వెచ్చించి 70 లేక 80 కుటుంబముల వారుండుటకుం దగిన భవనము నిర్మించి యిప్పటికిఁగదా నా జన్మము సార్థకతఁజెందినదని తృప్తిపడుచుండెడిది. బీద విద్యార్థుల కెందఱికో భోజనవసతి నొడఁగూర్చుటయేగాక వారి విద్యాభివృద్ధిని బట్టియు, తదుత్సాహప్రక్రియ ననుసరించియు, విద్యార్థి వేతనములం గూడ నొసంగి సంతృప్తిఁ జెందెడిది. ఈసాధ్వీలలామ హృదయ మెఱింగిన మా భుజంగ

రాయ ప్రధాని సైత మామె ననుకరించు చుండెనే గాని యద్దుదగిలి యుండలేదు. అంతటి మహారాణియైనను నిరాడంబరయై, భర్తృసేవాను రక్తయై, స్త్రీ లోకమున కంతయును నాదర్శయై పేరెన్నికఁగాంచి, పుట్టి నింటికిని, మెట్టిన యింటికిని, యశస్సొడఁగూర్చి యస్మదాద్యాప్తుల దుఃఖసాగరమున ముంచి విబుధలోక సందర్శనమున కరిగినదని తెలుపుచు నింతతో విరమించు చున్నాఁడను.

" జనవాణి "
ది 30—6—38.

సాహిత్య విశారద,
కోన వెంకటరామశర్మ,
ఆంధ్రసారస్వతపరిషత్కార్యదర్శి.

## స్వ. శ్రీ. రాణీ చిన్నమ్మారావుగారి

-:మరణస్మరణ:-

దూరప్రదేశముల నుండి యాపన్నులై ఆసుపత్రికివచ్చు రోగులకు, వారి బంధువులకును, పట్టుగొమ్మయై ఏబదివేలు అనగా దాదాపు ఒక అరలక్ష రూప్యములు చిల్లిగవ్వలవలె వెచుకముందుగా లాలోచింపక యాదార్యముతో వెచ్చించి ముప్పదికుటుంబములు ఏక కాలమందు కుటుంబ సదుపాయము లన్నింటితో సుఖముగా నివసింప వీలుకలుగునట్లు, ధర్మసత్రమును నిర్మించిన శ్రీ రాజా మంత్రిపెగడ భుజంగ రావుబహద్దరు జమీందారువారి ధర్మపత్నియగు శ్రీ రాణీ చిన్నమ్మా రావుగారు, ఈ సంవత్సరము అనగా 1938 ఏప్రిల్ మాసమందు, ఈ భౌతిక దేహమునువిడిచి తన్ను సృష్టించిన సృష్టికర్త చెంతకేగెనని తెలుపుటకెంతయు విచారపడుచున్నాను.

ఈ జిల్లాలోను దీనికిచుట్టుపట్లనుండు ఆంధ్ర మండలములలోను, ఈ సత్రమువలన మేలు నొందనివారుండుట యరుదు. ఆపన్నులై అర్ధ రాత్రివేళవచ్చు పరదేశులకు సైతము ఈ సత్రమెల్లపుడు సిద్ధముగా నుండును. మఱియు నీసత్రపు గదులన్నింటికి నంబరులు వేయఁబడి అట్టి

నంబరుల పతకమొకటి ఆసుపత్రి డాక్టరుగదిలో నమర్పఁబడి నిండుగదు లేవో? ఖాళీగదులేవో? సులభముగా దెలుపఁబడు సదుపాయ మేర్పరు పఁబడి యున్నందున రోగులకు మిగుల నుపయోగకరముగా నుండును.

ధర్మసత్రములు పేరుగాంచిన కొన్నింటిలో గదికింతయని, అద్దె వసూలు చేయుటయు, మూఁడు దినములకంటె నధికకాలము, ఉండ వీలులేదని నిర్బంధించుటయు, సత్రమనిన స్థలముకొఱకు విచారింపఁగా బెత్లెహేము సత్రమువలెనే స్థలములేదని చెప్పుటయు, నూతనముగా చెన్నపట్టణము వెళ్ళువారు, వారి అన్నసత్రము, వీరి అన్నసత్రము అనఁగానే ఆశపడి లోనికివెళ్ళి విచారింపఁగా డబ్బుపుచ్చుకొని అన్నము పెట్టు పూటకూళ్ళ యిళ్ళని తేలునట్లుగా గాక, ఈ మన సత్రము పేరునకుఁదగిన సార్థకనామము కలదై యెల్లప్పుడును సత్రముగానే యుండును.

వేయేల! ఆపన్నులైన దీనరోగులకు, ఆసుపత్రి యేలాగో ఆలాగే పరదేశులకు ఈ సత్రము సమయాసమయములయందు సహాయ పడుచుండును.

ప్రార్థనలకు ప్రత్యుత్తరములు పొందిన జార్జి ముల్లరు వలెనే మన కుగ్లరమ్మ ప్రార్థనవలన వచ్చిన వరములలో, ఈ సత్రమొకటియని చెప్పనొప్పును.

అట్లు ఆరంభదశలో రాణిగారు కుగ్లరమ్మను గలసికొనుట తటస్థించెను. అప్పుడామె రాణిగారితో నీ యాసుపత్రికి, ఒకసత్రమవసర మని తెలుపగా, వెంటనే యామె భర్తగారితో నాలోచించి వారి యనుమతినిబడసి యేబదివేల కెక్కువగా వెచ్చించి, ఈ మహావైద్య శాలకు, అంగుగాను, అండగా నుండునట్లు ధర్మసత్రమును స్థాపించెను. ఈ తనువు లంతరించినను, ఈ ధర్మము నిత్యమై నిలుచునుగదా! అంతియ గాక, ఈ సత్కార్యము తన తదనంతరము నిత్యము సాగునట్లుగా, తాను బ్రతికియుండగానే తగు నేర్పాటులు చేసెను. ఏయేట దీని మరమ్మతులు మున్నగువానికి వారి, వీరి నాశింపకుండునట్లు స్థిరపోషణగా నుండునట్లు,

కృష్ణాజిల్లాలోని యవనిగడ్డ యను గ్రామములో వారిస్వంతము 10 యకరముల భూమిమీదవచ్చు ఆదాయమును, బెజవాడలోని వారి స్వంతము నెల 1 కి రు 15 లు అద్దెవచ్చు భవనపుటద్దెయు, ఈసత్రపు పోషణకై వ్రాసియిచ్చుటయేగాక, ఈసత్రపు హక్కులు వగైరాలు, యు. యల్. సి. మిషనువారి పక్షముగా ఆసుపత్రివారికి భుక్తపరచి లిఖితరూపముగా నిచ్చివేసిరి.

ఇదియంతయుజూడ "మన ఆశీర్వాదములయొక్క విలువను అవి మనము పోగొట్టుకొనేవఱకున్ను గుర్తింపజాలము" అను నింగ్లీషు సామెత జ్ఞాపకము వచ్చుచున్నది. ఇంతటి దానరాజమునుగూర్చి మిషనువారు ఆసుపత్రివారుమాత్రమేగాక, ఈపురజనులును, ఆంధ్రరాష్ట్రమంతయు నెన్నటికి మరువని కృతజ్ఞతను జూపుదురని నమ్ముచున్నాను."

ఈమె మనకీ సత్రదానమేగాక యిటువంటి వింక నెన్నియో విద్యాదానములు, వివాహ వస్త్రాదిదానములు, అన్నదానములు, భూదానములు, గృహదానములు, దేవాలయదానములు విరివిగా నొసరించి పేరుగాంచి యున్నారు.

మఱియు నీమె ప్రభుప్రార్థనలు త్రికాలములయందును నాచరించు టయె గాక, తన బిడ్డలకు సైతము నేర్పుచు వచ్చెనని వినియుంటిని. ఈలాగీమె యంతరంగముగా "నికోదేము" వలెనే యేసు ప్రభువునకు శిష్యురాలై తన జీవితమును సార్థకపరచి తన గొప్పస్థితిని లోకోపకారముగా సద్వినియోగపరచి విశ్రాంతికై పరమునకు వెళ్ళిన యామె యాత్మకు శాంతి కలుగునట్లును, అమె విడిచివెళ్ళిన బంధుమిత్రాదులకు ఆదరణకలుగునట్లును భక్తులైనవారు ప్రార్థింపవలయునని వేడుచున్నాను.

ఇట్లు బుధజన విధేయుడు,

చేగుడి జాషువ.

# 25. రాజదంపతుల గుణవర్ణనము.



రాజా మం. భుజంగరావు.

( ఆదిపూడి ప్రభాకరకవి విరచితము )

ఈకవి, ఆంధ్రీకృతపరాశరస్మృతి యను గ్రంథమును ఆన 1900 సంవత్సరములో, మాకుఁగృతి నొసంగినపుడు, కృత్యాదిని వ్రాసినపద్యములు.

సీ ఏరామ కలశపాథోరాశి యుప్పొంగ
నమృతంబుతోఁడఁ దా నవతరించె
నేకన్య పదునాల్గు లోకముల్ పాలించు
విష్ణుదేవునికి దేవేరి యయ్యె,

రాజదంపతుల గుణవర్ణనము.

నేతల్లి యీ జగత్సృష్టి కాద్యుం డగు
నబ్జసంభవుఁ గడు పారఁగాంచె
నేయమ్మ తన దృష్టి యిసుమంత సోఁకిన
మను 'బంగరువు సేయు మహిమ వడసె
గీ. నే మహాసాధ్వి మంగళ నామవర్ణ
జపము లక్షర దివ్య మోక్షప్రదమ్ము
లట్టి శ్రీదేవి భూరి దయాంతరంగ
శ్రీభుజంగావనీంద్రు రక్షించుఁ గాత! 1
సీ. ఎవ్వాని యవతార మిద్ధ మంత్రిప్రెగ
డాన్వయాంబునిధి కబ్జాగమంబు
లక్కవరాది వెల్లాసీమ లెవ్వాని
పాలనంబున బాగు పడిన యూళ్ళు
నెవ్వాని కీర్తికాంతావాసమునకు బ్ర
హ్మాండభాండం బొక్క యలఁతి మనికి
యెల్ల దిక్కులనుండి, యేతెంచు విబుధుల
కెవ్వాని వైదండ యీఁగి బ్రమాను
గీ. మృదుకవిత్వంపు శుకమున కెవని సరస
వాగ్వితానంబు బంధుర పంజరంబు
ప్రబల బలశాలి యతఁ డార్య వ్రజ హేళి
సారగుణశీలి భుజగరాజన్యమౌళి. 2
సీ. బీద సాదలు సేయు విజ్ఞాపనంబులు
బింక మింతయు లేక వినెడువాఁడు
విని పరామరిక చొప్పున వారి వారిలో
మంచి సెబ్బరిలను గుర్తించు వాఁడు
గుర్తించి ధర్మంపు గురి తప్పకుండనై
యొసఁగు తీరుపులుఁ దా నొసఁగు వాఁడు

నోసఁగి తా నోసఁగిన పసమీఱు న్యాయముల్
నడుపఁగా సంతోష పడెను వాఁడు

గీ. నిజమునకు ఠాణ నలువరాణికి ఠికాణ
విడుపునకుఁ డెంకి, లుఁబ్ధుల విరుచు వాకి
కరుణకు బిడారు మేల్ రాచసిరి గఁడారు
ఠారు సరదారుఁ డా జమీందారుఁ డరయ. 3

సీ. పల్లంబుపై నెక్కి వాఁగె పట్టిన జాలు
గోడలు మేడలు గుప్పళించు
జాళెంబు గొలిపి దువాళించి వదలినఁ
బేటలుఁ గోటలు పెక్కు దూఁకు
మఱిఁ గరాళించి హుమాయించి విడచినఁ
దరువులుఁ జెరువులు, దొడువాఱుఁ
గళ్ళెంబు సడలించి కావాతరటు గొల్ప
గుంటలుఁ గొండలుఁ గూల దాఁటు

గీ. నౌర యాస్కందిత మయారె ధౌరిత మ్మ
యారె ప్లుతమారె రేచిత మహహా వల్గి
త మ్మనుచుఁ దోషదొరలు చిత్రమునఁ జూతు
రతని జుహురాణి బహుధాటి కరిది సాటి. 4

సీ. రాజౌట నిజ మయ్యు రశ్మి కాసింపఁడు
కంను లే దెచటఁ జక్రములఁ బ్రోచు
సరసింహుఁడే కాని పరుసము ల్ వలుకఁడు
శాంతి యొప్పెడుఁ బుణ్య జనుల నేలు
ఘనుఁడు వాస్తవ మయ్యుగర్జించి వీను ముట్టఁ
దప్పులు లేవు రాయుంచ లెనయు
నినుఁ డంట సత్యంబు హృదయ భేదము సున్న
స్థైర్య మెక్కుడు చల్లదనము సొమ్ము

గీ. తాను భోగీంద్రుఁ డగుట తథ్యంబె కాని
క్రిందఁ గ్రాలఁడు నాలుకల్ రెండు లేవు
నోట నమృతంబు లొలుకుఁ గనుంగొనంగఁ
జిత్రము భుజంగరాయ చరిత్ర గరిమ. 5

సీ. చూచెనా సరసార్థ సూచనాయత మృగీ
లోచనా హృదయముల్ దోలఁచి చూచుఁ
జూచెనా కనకాభిషేచనాయత దృష్టి
యాచనా గతుల నింపారఁ జూచుఁ
జూచెనా భవబంధ మోచనానూన వి
వేచనా శక్తిఁ గాన్పించి చూచు

గీ. చూపు లన నిన్ని చూపులు సూడ నేర్చెఁ
బేరునకు వేయి కన్నుల వేల్పు కాక
యిట్టి మహిమలు నతనియం దేడఁ గలుగు
నిమ్మహిఁ డెట్టీశు భుజగమహీంద్రమణికి. 6

గీ. అతని యర్ధాంగలక్ష్మి చిన్నమ్మరావు
నెమ్మదికి తావు శుభము లన్నిఁటికిఁ బ్రోవు
కొలమునకు వన్నె భర్తకు వలపు కన్నె
సుగుణసంపన్న తథ్య మా మగువమిన్న. 7

గీ. పుట్టెఁ గస్తూరి వంశాబ్ధి పొంగ, మెట్టె
మంత్రిప్రెగ్గడ కులాబ్జంబుమాన్యతఁ గన
నిట్టి చిన్నమ్మరావుఁ గన్నట్టి శ్రీనృ
సింహ రాయని పున్నెంబు జెప్పఁ దరమె. 8

సీ. గరితల తలసొమ్ము గయ్యాళి తలదిమ్ము
పతిభక్తి కిరవు దుర్మతుల గురువు
మరియాదలకు నీడ గరువమ్మునకుఁ జేడ
దయకుఁ బుట్టిల్లు నిర్దయకు ముల్లు

పరమార్థముల వాడ పాపమ్ములకుఁ బీడ,
కలుములపంట లేములకు దంట
యడకువలకు వీడు దుడుకుల కురిత్రాడు,
గానముల కరువు దుర్గుణపు గఱవు
గీ. సత్యముల కాటపట్టు నసత్యములను
మాన్పుటకుఁ జాలు వాకట్టు మంచుచెట్టు
మేలులకు గీము కీడుల పాలి గామ
యారె యిలఁ గల్పవల్లి చిన్నమ్మతల్లి. 9
సీ. తనదు పతివ్రతా ధర్మమ్ము నకు విని
ర్మలమైన వదనమండలమె సాక్షి
తన మనోవైశాల్యమునకుఁ దొగల్ నవ్వు
చెవుల సోఁకెడు కన్నుఁగవయ సాక్షి
తనదు మేలైన నిదానమ్మునకు మత్త
నాగేంద్ర మందయానంబ సాక్షి
తన మహోత్కృష్ట వర్తనమునకుఁ బదియా
ర్వన్నెపుత్తడి మేని వన్నె సాక్షి
గీ. తన యుదార దయారసమునకు మంచి
పంచదారలు వెట్టించు పలుకె సాక్షి
కాఁగ, చిన్నమ్మరావు సౌభాగ్యభవాని
కెనయనఁగ నొప్పు నిజనాథు మనమెఱింగి. 10
సీ. అలరించు నిజమనోహర లీల లింపార
హృదయ మామని తలయెత్తు వేళ
నింకించు నడుగంట నెల్ల సంకటముఋ
కడువేసవి నిదాఘు మడరు వేళ
మొలక లెత్తించు నామూలాగ్రముగఁ గోర్కె
లెల్ల ప్రావృట్టు రంజిల్లు వేళ

సకలంకముగ జేయు నానంద మొసఁగుచు
మొగము శరద్వ్యాప్తి నెగడు వేళ

గీ. నెలమి సుప్పొంగఁ జేయు సుద్వ్యాప్తి నధిపు
నంగము హిమాని పొలుపు చెలంగువేళ
జలజలన రాల్చు భువి వింత చెలఁగు నటుల
జడిమముల నెల్ల శిశిర మెసంగు వేళ. 11

శా. ఏవంభూత మనోనురాగమున నా త్మేశుక్ మహానంద పా
రావారంబునఁ దేల్చు నగ్గరిత మార్కండేయు కారుణ్య వీ
క్షావై శేష్యమునం దనూజుఁ గనె దుర్గాపద్మనాభాఖ్యుఁ దే
జోవిద్యాదిక సర్వలక్షణ విశిష్టుఁ శిష్టమోదావహుఁ. 12

సీ. పసిఁడి వన్నెల వాఁడు పగడాల జగడాల
జగడాల మోవి కెంజాయ వాఁడు
వెడద యెడద వాఁడు వెలలేని చలితేని
సిరినేని నగుమోము చెన్ను వాఁడు
నందమ్ము గలవాఁడు నరవిందములఁ జిందఁ
దగు పొందికైన నేత్రముల వాఁడు
ముద్దు గుల్కెడు వాఁడు పువ్వింటి దొరవంటి
యొఱపంటి కంటి కింపొసఁగు వాఁడు

గీ. కరికరము లట్టి కరములు గల్గు వాఁడు
కనికరపు రూపుఁ జూపులఁ గల్గు వాఁడు
నిహపరము లెల్ల నొక్కట నిచ్చు వాఁడు
మల్లికార్జున పుత్రుఁ డి మ్మాడ్కి వాఁడు. 13

గీ. కందరామాయణము మహానంద సరణిఁ
జెప్పి శ్రీరామభూపాల శేఖరునకుఁ
గృతి యొసంగి జగద్ధిత కీర్తిఁ గంటి
నాదిపూడి ప్రభాకరాఖ్య కవివరుఁడ. 14

# విజ్ఞప్తి.

:o:-

శ్రీ రాణీగారి నిర్యాణ జీవితములనుగూర్చి The Madras Mail The Hindu, The Gospel Witness, ఆంధ్రపత్రిక, 22 ఏప్రిల్ 1938, యుగంధర, 20 ఏప్రిల్ 1938 సుధర్మ, 20 జులై 1938, ఆంధ్ర లూధరన్, ఆగష్టు 1938, జనవాణి 30-6-1938, ప్రారంభవిద్య 25-4-1938 గృహలక్ష్మి జులై 1938, మున్నగుపత్రికలలో విపులముగా వ్యాసములు ప్రచురింపఁబడినవి.

మంత్రిప్రెగడ మార్కండేయులు, దుగ్గిరాల విస్సయ్యగారు, సత్యవోలు అప్పారాయకవిగారు, వెంకట పార్థసారధికవులు, మున్నగుప్రముఖులు పెక్కువ్యాసములను పత్రికారాజములలోఁ బ్రకటించిరి. గ్రంథబాహుళ్య భీతిచే వాటి నిందుఁ బ్రకటింపఁజాలనందులకు మన్నింపఁ గోరుచున్నాము.

ఇట్లు,

బుధవిధేయుఁడు,

రాజా, మంత్రిప్రెగడ భుజంగరావు.

Xmas 1938.



# పర్యవసానము.

## —( గీతమాలిక )—



సృష్టికారణమెద్దియైన జీవవితతి
కష్టసుఖములఁజిక్కి నిత్యాంతమందు;
దిక్కులేనిదివాణమందిరము పృథ్వి;
జరుగఁదలఁచినవెల్లను జరిగితీరు,
భక్తివైరాగ్యయోగ్య జపతపములును,
యజ్ఞయాగహోమాదులు, వ్యర్థములగుఁ;
గలఁడులేఁడనుమీమాంస ఫలమునిడదు;
జన్మనంతనుదైవ ప్రసక్తియందు
గడపితిని; వేదవేదాంగ కావ్యములను
శ్రద్ధఁబఱియించితిని, వానిసారమిందు
సూక్ష్మముగఁజూపితిని; పరిశోధనలకుఁ
జిక్కదాతత్త్వ, మిమ్మహి జీవతతికి
మేలుచేయుటకర్తవ్య శీలమరయ.
సవివపీయూష మైహిక సౌఖ్యమెల్ల.

క. ఎందెందు వెదకి చూచినఁ
గందుమె చిన్నాంబఁ బోలు కాంతామణి, మ
ధ్యందిన సుందర దినమణి
ముందర దీపములు వెల్గఁబోలునె దీప్తిన్.



# రాజాభుజంగరాయ కవికృత గ్రంథములు.



## 1. పద్య కావ్యములు.

✓ 1. హోలీ బైబిలు. Holy Bible.

| | | | |
|---|---|---|---|
| 1. నవనిబంధన. | New Testament. | 4597 | పద్యములు. |
| 2. పాత నిబంధన. | Old Testament. | 13189 | పద్యములు. |
| | | 17,786 | పద్యములు. |

2. ✓ కథాసరిత్సాగరము (పద్యకావ్యము)
సోమదేవ కవినిర్మిత గీర్వాణగ్రంథమున
కాంధ్రీకరణము. 10,000 పద్యములు.

✓ 3. వసంత కుసుమము (ప్రబంధము.)
University Text Book.
శ్రీ విక్టోరియారాజ్ఞి చరిత్రము. 831 పద్యములు.

4. ✓ వారకాంత (ప్రబంధము.) 635 పద్యములు.

5. ✓ శ్రీరామ చంద్రుఁడు. (ప్రబంధము.) 911 ,,

✓ 6. సాంధ్రగీతావళి.
శ్రీమద్భగవద్గీతల కాంధ్రీకరణము.

7. ✓ శివగీతలు. గీర్వాణగ్రంథమున కాంధ్రీకరణము.

✓ 8. శ్రీరాణీ చిన్నమ్మారావు, జీవితము. 1116 పద్యములు.

✓ 9. దీనరత్నామణి. 180 ,,

✓ 10. చారుమతి.

✓ 11. సుశీల.

✓ 12. మధుపవిహారము.

† 13. నీతివాక్య రత్నావళి.

✓ 14. క్రీస్తుమత సారము.

15. స్తవరాజము.

✓ 16. ఇచ్ఛాశక్తి.

## రాజాభుజంగరాయ కవికృత గ్రంథములు.

17. శివపురాణము (గీర్వాణానువాదము.)
18. శృంగారరస ప్రవాహిని.
19. కస్తూరీ తిలకము.
20. జార్జిపట్టాభిషేక వర్ణనము.
21. విక్టోరియా తారావళి.
22. విక్టోరియా స్వర్గయాత్ర.
23. మార్కండేయచరిత్ర.
24. మార్కండేయ శతకము.
25. మార్కండేయ తారావళి.
26. శంకరతారావళి.
27. శివతారావళి.
28. అష్టావధానము.
29. దాంపత్య ధర్మబోధిని.
30. గాంధీమహాత్ముని చరిత్రము.
31. గోక్లే చరిత్రము.
32. దాదాభాయినౌరోజీ చరిత్రము.
33. నృసింహ నిర్యాణము.
34. గీతాంజలి. An Ode to Dr. Kugler
35. క్రైస్తవ శతకము.
36. సర్వమంగళా శతకము.
37. ఉపమాన తరంగిణి.
38. పారమార్థిక గీతావళి. (౩౬౦ పద్యములు.)
39. ధ్యాన కందములు.
40. లోకవైచిత్ర్యము.
41. ఆరోగ్యప్రార్థనా [illegible]రత్నములు.

## నాటకములు.

42. ఆంధ్రీకృత ప్రసన్నరాఘవ నాటకము
43. ఆంధ్రీకృతోత్తర రామచరిత్రము.
University Text Book.
44. ఆంధ్రీకృతాభిజ్ఞాన శాకుంతలము.
45. పాండవాజ్ఞాతవాసము (స్వకల్పితము.)
46. శశిరేఖానాటకము (స్వకల్పితము.)
47. విద్యున్మాల స్వరాజ్యవైజయంతి. (స్వకల్పితము.)
48. శ్రీకృష్ణనాటకము (స్వకల్పితము.)
49. చిత్రహరిశ్చంద్రనాటకము (స్వకల్పితము.)
50. చారుమతీ పరిణయ నాటకము.
Adaptation of Shakespear's "As you like it"
51. నలనాటకము (స్వకల్పితము.)
52. చమత్కారస్నేహ ప్రహసనము.
53. విధవావివాహ ప్రహసనము.
54. మహాయోగ రహస్య ప్రహసనము.
55. నిరపవాద ప్రహసనము.

---

## :వచన కావ్యములు.:

56. ఆంతరంగిక సత్యప్రకటనము.
Adaptation of "confession." by Leo Tolstoy.
57. నావిశ్వాసము.
Adaptation of "what I believe" by "
58. కథాలహరి.
Adapataion of "23 Tales" by "
59. పునరుత్థానము. I & II సంపుటములు.
Ressurection. by "
60. టాల్‌స్టాయి లేఖలు, వ్యాసములు.
"Essays & Letters." by "

61. దైవానుకరణము.
Adaptation of "In his steps" by Charles M. Sheldon.
62. సైతానువిలాపములు.
Adpatation of "Sorrows of Satan" by Mary Correlie-
63. ప్రార్థనా ఫలితములు.
Adaptation of "Answers to Prayers."
64. రాణీవజ్రహారము, (నవల.)
Adaptation "Queen's Neklace" by Alexander Dumas.
65. పోలీసువానిహత్య, నవల (ఆంగ్లానువాదము.)
66. నిజకథామంజరి, నీతికథలు.
67. చిత్రాంగి (నవల.)
68. మనోరమ (నవల.)
69. వాసంతిక (స్త్రీల కుపయుక్తమగుకథ.)
70. రాజహంస (నవల.)
71. విజయాంకసాహసము (నవల.)
72. నరాధికారి Story of Sin. (నవల)
Adaptation of "Master of man" by Hall Cain.
73. ఆస్థానవైపరీత్యములు. 12 సంపుటములు.
"Mysteries of the court of London" by Reynolds.
74. సహజధర్మవిధులు "Duty" by Smiles.
75. వచన నైషధము.
Approved by the Text Book Committee.
76. క్రైస్తవ గూఢార్థ ప్రదీపిక.
77. మోహలేఖావళి.
78. వ్యవసాయము.
79. శాద్వలములు.
80 శిశుసంజీవిని.
81. గానామృతము (యక్షగానము.)
82. బాలనీతికథలు.
83. సంస్కృతభాషావాఙ్మయము.
84. ఆంధ్రభాషావాఙ్మయము.

85. ఆంధ్రసారస్వతాభ్యుదయము.
86. సాధుసుందరసింగు చరిత్ర, (I. M. S. ప్రచురణము.)
87. పరమ పురుషాన్వేషణము. (C. L. S. ప్రచురణము.)
88. దైవాలోకనము. (C. L. S. ప్రచురణము.)
89. ఏసునిమార్గము (C. L. S. ప్రచురణము.)
90. దైవసాక్షి. (C. L. S. ప్రచురణము )
91. పురుషోత్తముఁడు-గాంధి.
92. హైందవ నౌకాచరిత్రము.
Indian maritime Activity.
93. మానసికతత్త్వము.
The New Psychology.
94. విభక్తావిభక్త కుటుంబ పరిస్థితులు.
95. వర్ణాశ్రమ ధర్మములు.
96. అగ్గిరాముఁడు, నవల
97. మైరావణుఁడు, నవల
98. కలియుగరావణుఁడు, నవల.
99. దేశీయమహాజనసభ.
100. దైవప్రార్థన.
101. ఆధునికకవి జీవితములు
102. అసహానారణ్య నిర్మూలన కుఠారము.

---

## English Works.

103. The Inner Doctrines of Christianity.
104. The Power of Christ.
1105. How to make Christianity Indian.
106. The Divine Incarnation.
107. God is Love.
108. The Truth of Christianity.
109. The Divine Purpose, of Creation.
110. The Glory of Christ's Sacrifice.
111. Political & Religious Situation in India.
112. The History of Telugu Leterature-
In collaboration with P. Chenchiah. B. A. M. L.
Published by Y. M. C. A.

## శ్రీరాజాభుజంగరాయ కవికృత గ్రంథములు.

### —♦ కృతి నందిన గ్రంథములు ♦—

1. ఆంధ్ర పరాశరస్మృతి. (పద్యకావ్యము.)
   ఆదిపూడి ప్రభాకరకవి.
2 పద్మినీప్రభాకరము. (మహాప్రబంధము.)
   కూచి సత్యనారాయణ శాస్త్రి
3. ధర్మజ రాజసూయము. (వచనము.)
   నేతి సుబ్బరాయశాస్త్రి.
4. కవిరాజ సందర్శనము.
   ఆదిపూడి ప్రభాకరకవి.
5. భుజగరాయ మణిశతకము.
   కొత్తపల్లి సుందరరామకవి.
6. భుజగ భూపాల శతకము.
   కొత్తపల్లి సుందరరామకవి.
7. హనుమద్విజయము. సంస్కృత పద్యకావ్యము.
   కాలనాథభట్ట నారాయణ శాస్త్రి.
8. భుజంగనృపాల శేఖర శతకము.
   అడివి సాంబశివరావు.
9. కనకవల్లి (నవల)
   చిల్లరిగి యోగానందకవి.
10. ప్రాచీన హిందూరాజ్యాంగ చరిత్ర.
   సాహిత్యవిశారద, కోన వేంకటరాయశర్మ.
11. రాజ కళింగ గంగు నాటకము.
   నందిరాజు చలపతిరాయకవి.
12. భుజంగరాయ సందర్శనము.
   రావూరి చిట్టివెంకటసుబ్రహ్మణ్య కవి. బి. ఏ.
13. హైమవతీ పరిణయము.
14. శ్రీమహాలక్ష్మి కల్యాణము.
15. శ్రీరంగ నాయికోద్వాహము.
16. కామేశ్వరీ పాణిగ్రహణము.

17. అన్నపూర్ణా వివాహము.
18. శకుంతలా కరగ్రహణము.
19. వెంకాంబా పరిణయము.
20. వీరరాఘవ కల్యాణము.
21. ప్రపంచ యుద్ధ చరిత్రము. (పద్యకావ్యము)
మచ్చ సూర్యరాయకవి.
+ 22. హనుమజ్జీవిత మహా ప్రబంధము.
అన్నమరాజు సుబ్బరాయకవి.

---

# ప్రచురించిన గ్రంథములు.

1. మంజువాణి. మాసపత్రిక. దశవర్షములునడిచెను.
2. సర్వలక్షణ సారసంగ్రహము.
3. అహోబల పండితీయము.
4. శకటరేఫ నిర్ణయము.
5. ఆంధ్ర చందాలోకము.
6. రాజవాహన విజయము.
7. కృష్ణరాయ విజయము.
8. అచలాత్మజా పరిణయము.
9. రామేశ్వరమాహాత్మ్యము.
10. దిలీప చరిత్రము.
11. వైజయంతీ విలాసము.
12. పారిజాతాప హరణము.
13. చిత్రసీమ (శొంఠి భద్రాద్రి రామశాస్త్రి)
14. ఆంధ్రలోకోక్తిచంద్రిక.
15. సంస్కృతలోకోక్తిచంద్రిక.
16. రా. బ. కం. వీరేశలింగకవి గ్రంథరచనా చాకచక్యము.
దామరాజు శోభనాచలము.